
చందమామ
మే '78, - 125 పైసలు

# చతుర

మే 1978

సంపుటి : 1 సంచిక : 4

## ఈ నెల సమగ్ర నవల

అతనికి ఉద్యోగం లేదు, ఆదాయం లేదు, సంసారాన్ని పట్టించుకునే సంస్కారమూ లేదు. తెల్లారే సరికల్లా మేడలు కట్టేయాలనే తాపత్రయం మాత్రం ఉంది. కాకుల్లాంటి లోకుల, అప్పుల వాళ్ళ పాలిటికి భార్యా బిడ్డలను వదిలేసి ఊరుకున్నాడతను.

ఆ కాకుల ఇనప ముక్కుల పోట్లకు తట్టుకోలేక, పసిబిడ్డల దుస్థితి చూస్తూ సహించలేక తనే ఏదేనా పనిచేసుకుని సంపాదించి సంసారం నడుపుకుంటా నంటుంది ఆమె. అందుకు అంగీకరించేందుకు అతనికి అడ్డం వచ్చేది.........

# పరువు

వీల్లేదు... వంశ గౌరవం, పరువు ప్రతిష్ట నాశనమవుతాయంటాడతను. ఓపిక పడితే అందలా లెక్కిస్తాను, బంగాళాలో కాపురం పెట్టిస్తానంటాడతను. విధిలేక పసిబిడ్డలను చంకనేసుకుని అతనితో తెగతెంపులు చేసుకుని బజార్న పడిందామె. ఆవిడ సాధించిందేమిటి? ఎదురయిన అనుభవాలెలాంటివి?

## యం. పార్థసారథి

ప్రతిభావంతంగా చిత్రించిన బడుగుజీవుల జీవిత చిత్రం ఈ నెల చతుర సమగ్ర నవల 'పరువు'

## ఈ నెల ముఖపత్రం :

ప్రాచీన భారతీయ చిత్రకారులు అందరికీ తెలిసిన ఇతి వృత్తాలకు నయనానందకరమైన వర్ణ సమ్మేళనంతో రూపకల్పన చేయటంలో సిద్ధహస్తులు. అతి స్వల్పపరిధిలో అనేకానేక రూపాలను, పరిసర ప్రకృతిని సవివరంగా చిత్రించటంలో నిపుణులు. ఈ కోవకు చెందిన చిత్రాలు 'మినియేచర్ పెయింటింగ్'గా సుప్రసిద్ధాలు. వాటిలో ఒక ప్రాంతానికి ,చెందిన 18వ శతాబ్దినాటి 'నర్పూర్' పెయింటింగ్ 'రాధా కృష్ణులు' ఈ నెల చ తు ర ముఖపత్రం. ఈ చిత్రం ప్రస్తుతం ఇంగ్లాండులోని విక్టోరియా అండ్ అల్బర్ట్ మ్యూజియంలో ఉంది.

## రెండవ కవరు :

ఉత్తర భారతావనిలోని మౌంట్ అబూ ఆలయం పాలరాతి శిల్పాలకు సుప్రసిద్ధం. జైన ఆలయమే అయినప్పటికీ ఆలయ వాస్తు నిర్మాణం మన దక్షిణాది ఆలయ నిర్మాణానికి దగ్గరగా ఉంటుంది. ఆ ఆలయ అంతర్భాగ దృశ్యం ఈ ఫొటో.

## మూడవ కవరు :

ప్రాచీన భారతీయ ఆలయాంతర్భాగాలు వాస్తవంలో నృత్య వేదికలే. ఈనాటి అత్యంతాధునిక రంగస్థల వేదికలకు ఉదాహరణ ఈ ఫొటోలోని బెర్లిన్ నాటకశాల స్టేజీ. ఊహాతీతంగా అభివృద్ధి చెందిన ఆధునిక వాస్తుకళకు ఇదొక ఉదాహరణ.

## నాలుగవ కవరు :

16వ శతాబ్దిలో దక్షిణ భారత కళారంగం కంచుశిల్పాలకు ప్రసిద్ధిక్కే. ఆనాటి అపూర్వ శిల్పాలలో ముఖ్యమైన చోళుల కాలపు శిల్పం ఇది.

చతుర
ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ
హైదరాబాద్-500004

# సింహాపరేషన్

మహారాష్ట్రలోని ప్రతాప్ సింగ్ పార్క్‌లో 'జానకి' అనే ఆడసింహానికి ఈమధ్య అతిక్లిష్టమైన ఆపరేషన్ జరిగింది. సింహం పైపెదవిమీద ఓ పెద్దకాయలాంటి వ్రణంపెరగడంప్రారంభించింది. అది కాన్సర్‌సంబంధమైనదనీ, ఆపరేషన్‌చేస్తేగాని, సింహంబ్రతకదని నిర్ధారించుకున్నారు డాక్టర్లు. ఐదుగంటలసేపు అతిజాగ్రత్తగా ఆపరేషన్‌చేసి, ఆ వ్రణాన్ని తీసేశారు. దేశంలో ఇలాంటి ఆపరేషన్లలో ఇదేమొదటిది. ఆపరేషన్



చెయ్యడంలో ఎదురయిన మొదటి సమస్య, సింహానికి మత్తు మందివ్వడం ఎలాగనేది! కురుపు నోటిమీద వుండడం వల్ల ఏమాత్రం అశ్రద్ధగా ఉన్నా, సింహంగారు డాక్టరుగారిని చక్కగా భోంచేస్తారు. మొదట్లో స్పర్శతెలీనివ్వని కొన్ని ఇంజక్షన్లిచ్చారు· కానీ అంతలోనే సింహం మామూలుస్థితికి వచ్చేయసాగింది. చివరికి ఆపరేషన్ చేసేరోజున 375 మిల్లీ గ్రాముల మత్తుమందు ఇచ్చారు. గొంతుదగ్గర, మోకాళ్ళదగ్గర అనెస్తీషియాఇంజక్షన్లిచ్చారు.ఎందుకైనా మంచిదని గొంతుదగ్గర మరికాస్త మత్తు మందు మార్ఫియాని కూడా ఎక్కువ మోతాదులోనే ఇచ్చారు. 'జానకి' అచేతనంగా పడిపోయింది. అప్పుడు దాన్ని బోనులోపెట్టి కదలకుండా ఇనప చువ్వలతో బంధించేశారు. నోరు తెరుచుకుని వుండేందుకు రెండు దవడలమధ్య ఓ ఇనప చువ్వని పోటీపెట్టి, ఆపరేషన్ చేశారు. వ్రణాన్ని కోయగానే, జిమ్మున రక్తంచిమ్మి డాక్టర్ చొక్కాని తడిపేసింది.ఆపరేషన్‌చేసి తీసేసిన ఆ వ్రణం 350 గ్రాముల బరువుందిట!

# ఇంటిదొంగలు

బ్రిటన్‌లో షాపుల నుంచీ ఏటా 950 కోట్ల రూపాయల విలువైన సరుకు బయటి కెళ్తుంటుంది. ఇయితే ఇది పూర్తిగా వినియోగదార్లు కొనటం వల్ల వెళ్తున్నది కాదు. మూడొంతుల సరుకు షాపుల్లో పనిచేసే ఉద్యోగస్థులు హస్తలాఘవం ప్రదర్శించి, చాటుగా ఇంటికి చేర్చుకుంటున్నా రన్నమాట. వ్యాపారస్థులకి ఈ ఇంటి దొంగల వల్ల పెద్ద

చికాకు ఏర్పడింది. ఇంటి దొంగలని పట్టుకోగల ప్రైవేటు డిటెక్టివ్‌లని షాపు యజమానులు నియమించుకో సాగారు.




ఆ 'పత్తేదారులు' మారు వేషాలు వేసుకుని నౌకర్లలాగా షాపుల్లో చేరి, మనేజరు దగ్గర్నుంచీ, కాపలా వాడిదాకా వాళ్ళ ప్రతి చర్యనీ గమనించి, యజమానికి సమాచారం అందిస్తుంటారు.

ఒకసారి . . . . .

ఒక పెద్ద షాపులో ఉద్యోగస్థులు కూడబలుక్కుని, ఆ రాత్రి షాపుని లూటీ చేద్దామని పథకం వేసుకున్నారు.

ఈ విషయాన్ని నౌకరు రూపంలో ఉన్న డిటెక్టివ్ యజమానికి అందించాడు. యజమాని సరిగ్గా లూటీ సమయానికి పోలీసులతో సహా వచ్చి దొంగలందర్నీ ఏడు కడ్డీల వెనక్కి పంపించాడు.

# ఆక్స్‌ఫర్డ్ ప్రెస్

ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ స్థాపించి ఇప్పటికి 500 ఏళ్ళయింది. బ్రిటన్‌లోని ఈ ప్రఖ్యాత ప్రచురణ సంస్థకి ప్రపంచ వ్యాప్తంగా 20 శాఖలున్నాయి. వాటి నన్నిటినీ ఒక కమిటీ నిర్వహిస్తున్నది. 500 సంవత్సరాల ఉజ్వలమైన చరిత్ర ఉన్న ఈ ప్రచురణ సంస్థ మొదట్లో చాలా ఇబ్బందులు ఎదుర్కొని మూతపడే స్థితి కొచ్చింది. ఈ సంస్థ ప్రచురించిన మొట్టమొదటి పుస్తకం 'అపోజిల్ క్రీడ్' నిండా కొల్లలుగా అచ్చుతప్పులు, తప్పుడు సమాచారం




ఉన్నాయిట. 18వ శతాబ్దం ఈ సంస్థకి గడ్డుకాలంగా ఉండేది. మొదటి నలభై సంవత్సరాల్లో ప్రచురించిన పుస్తకాల సంఖ్య కేవలం 14 మాత్రమే! ఆ

తరవాత క్రమంగా సంస్థ బలాన్ని పుంజుకుని అగ్రశ్రేణి ప్రచురణ సంస్థగా ఆదర్శప్రాయంగా రూపొందింది. 1881లో ఆక్స్‌ఫర్డ్ ముద్రణాలయం 'న్యూటెస్టమెంట్' సంశోధిత ప్రతిని తయారుచేసి ముద్రించింది. అక్కడితో అదృష్టం అందుకుంది. ఒక్కసారిగా పది లక్షల కాపీలు మార్కెట్లోకి వచ్చాయి. జనం కాపీలకోసం విరగబడ్డారు. కొన్ని కొన్ని పుస్తకాల షాపులముందు జనాన్ని అదుపులో పెట్టేందుకు పోలీసులు కూడా కల్పించుకోవాల్సి వచ్చిందిట. దేనికైనా కాలం, ఖర్మం కలిసి రావాలండీ!

# ఏనుగు పగ

రాజేశ్వరన్ నాయర్ అటవీ శాఖలో పెద్ద ఆఫీసరు. ఆయన తన కెమేరాతో జంతువుల్ని ఫొటో తీస్తుంటాడు. అతని ఫొటోలకి ఫొటో ఎగ్జిబిషన్లలో ఎన్నో బహుమతులు కూడా వచ్చినై. మొన్న డిసెంబర్లో ఆయన, జాన్ సింగ్ అనే అటవీ పరిశోధకుడితో కలిసి ఉదయం ఏడున్నరకి ముదుమలై అడవుల కెళ్ళాడు. దూరంగా ఒక ఏనుగు ఒంటరిగా కనిపిస్తే అది చూడకుండా, మెల్లిగా అక్కడికి వెళ్ళి ఒక పొదచాటున, నక్కి ఏనుగుని ఫొటోలు తీశారు. తరవాత చెట్టుమీద న్నుంచీ కూడా ఫొటోలు తీద్దామనుకున్నారు. అంతలో ఏనుగు వీళ్ళని పసిగట్టి వెంట పడసాగింది. ఇద్దరూ చెరోదిక్కూ పరిగెత్తారు. ఏనుగు నాయర్ వెంట పరుగెత్తసాగింది. పరిగెత్తి పరిగెత్తి నాయర్ ఒక చెట్టు ఎక్కి ప్రాణాలు రక్షించుకుందామనుకున్నాడు. కానీ, చెట్టు ఎక్కి తొందరలో జారిపడి,



మళ్ళీ పరుగెత్త సాగాడు. నాయర్ ఏనుగుని దోవ మళ్ళించేందుకు, తన కెమేరాని, టోపీని పొద వేపు విసిరాడు- అయినా ఏనుగు మోసపోక, అతని వెంటపడి నాయర్‌కి మరీ దగ్గరగా వచ్చి ఆగి పెద్దగా ఘీంకరించి, తొండంతో గట్టిగా కొట్టి, తిరిగి వెళ్ళిపోయింది. ఓ గంట తర్వాత సింగ్, నాయర్‌ని వెతుక్కుంటూ వచ్చేసరికి నాయర్ రక్తపు మడుగులో పడివున్నాడు. అతని వెన్నెముక విరిగిపోయింది, తలకి బాగా దెబ్బ తగిలింది. డాక్టర్లు వచ్చి చూశారు. ఏనుగు కొట్టిన పావుగంటకే నాయర్ ప్రాణాలు గాల్లో కలిసిపోయినయ్యని చెప్పారు. అంతకు ముందురోజే కొంత మంది టూరిస్టులు అడవికి వచ్చి ఏనుగుని

రాళ్లతో కొట్టి రెచ్చగొట్టారుట. ఆ కోపాన్నంతా, నాయర్ మీద తీర్చుకుంది ఏనుగు!

# కదిలేదీ, కదిలించేదీ

మద్రాసు నివాసి, 69 ఏళ్ళ వృద్ధుడు రామస్వామిగారికి ఒకే నెలలో రెండు సార్లు తీవ్రంగా గుండెపోటు వచ్చింది. దాంతో; గుండె కొట్టుకునే వేగం తగ్గిపోయి. పూర్తిగా స్పృహ కోల్పోయాడు. వెంటనే ఆస్పత్రిలో చేర్చారు. డాక్టరు శాయశక్తులా ప్రయత్నం చేసి,



"మామూలు వైద్యపద్ధతులవల్ల ఏమీ ప్రయోజనం కనిపించటంలేదు. అందుకని నేనో కొత్త పద్ధతిద్వారా ప్రయత్నిస్తాను" అని చెప్పి, అతని కుడిచేతికి సర్జరీచేసి అందులో ఒక చిన్న పరికరం అమర్చాడు. వెంటనే రోగిలో కొంత చలనం కనిపించింది. ఆ పరికరం హియరింగ్ ఎయిడ్‌ని పోలి వుంటుంది. బ్యాటరీ సహాయంతో పనిచేస్తుంది. హృదయచలనాన్ని క్రమబద్ధం చేస్తుంది. దానినుంచీ ఒక తీగ ఉంటుంది. ఆ తీగని గుండె పైభాగాన అమరుస్తారు. ఇది నిరపాయకరమైన సాధనం. ఈ ఆపరేషన్‌కి గంటన్నర పట్టింది. ఆ తరవాత రామస్వామి కోలుకుని ప్రస్తుతం మామూలుగా తిరుగుతున్నారు.

హృదయచలన నిర్దేశక యంత్రాన్ని అమర్చడంవల్ల, మనిషి మామూలు ప్రవర్తనలో ఏమీ మార్పుండదు. ఆహార విషయంలో కూడా నియమాలేవీ లేవు. ఇది అమెరికాలో తయారయింది. దాని ఖరీదుని గురించి అడిగినప్పుడు, రామస్వామి "నాకు అమర్చిన యంత్రం 5,700 రూపాయల ఖరీదుది. కొన్ని కొన్ని 20,000 రూపాయల ఖరీదైనవి కూడా వున్నాయి" అని చెప్పారు. ఈ యంత్రంలోని బ్యాటరీ మూడేళ్ళు పని చేస్తుంది.

ఈ సాధనాన్ని అమర్చుకున్నవాళ్ళు ఎలక్ట్రిక్ పరికరాల జోలికి వెళ్లకూడదు. పెద్దపెద్ద కర్మాగారాల్లో యంత్రాలవద్ద తిరగకూడదు. గడ్డం గీసుకునేందుకు కరెంటు రేజర్‌ని ఉపయోగించకూడదు. విమానాల్లో ప్రయాణించేప్పుడు, హైజాకర్ల ఉనికిని పసిగట్టే ఎలక్ట్రానిక్ పరికరాల నుంచి రక్షణ కల్పిస్తూ, ప్రత్యేక శ్రద్ధ వహించే నిమిత్తం, ఈ సాధనాన్ని అమర్చుకున్న వాళ్ళకి ఒక గుర్తింపు కార్డు ఇస్తారు.

# రికార్డు స్థాపకులు

ఆధునిక కాలంలో ప్రతి విషయంలోనూ పోటీలు జరగడం పరిపాటయింది. ఎప్పటికప్పుడు కొత్తకొత్త రికార్డులు స్థాపిస్తున్నారు ఔత్సాహికులు. అర్జెంటీనా అమ్మాయి 106 గంటలసేపు ఆగకుండా డాన్సుచేసి రికార్డు స్థాపించింది. ఓ న్యూజిలాండు ఛాంపియన్ 68½ గంటల్లో 231 మైళ్ళు నడిచాడు. లక్నోకి చెందిన సయ్యాద్ మహమ్మద్ నవాబు వారం రోజులపాటు కాలుకింద పెట్టకుండా సైకిలు తొక్కాడు.

బెల్జియంకి చెందిన ఓ అపర బకాసురుడు అరగంటలో రాళ్ళులాగా వుడక బెట్టిన 44 కోడిగుడ్లను స్వాహాచేశాట్ట! పశ్చిమ వర్జీనియాకి చెందిన ఓ వ్యక్తి వరసగా 14 గంటల 31 నిముషాలసేపు ఆగకుండా చప్పట్లుకొట్టి రికార్డు సృష్టించాడు. అతను 100 అడుగుల దూరానికి వినిపించేంత పెద్దగా, గంటకి సగటున 120 చప్పట్లు కొట్టాడు చెంపలు వాయించడంలో రష్యావారిది రికార్డు. ఇద్దరు వీరులు 30 గంటలపాటు ఒకళ్ళ చెంపలు ఒకళ్ళు వాయించుకుని ప్రపంచ ఛాంపియన్‌షిప్ పొందారు.

ఇలాంటి క్రీడల విషయాలలోనే కాకుండా, సహనం విషయంలో కూడా రికార్డు బ్రేక్ చేసినవాళ్ళు లేకపోలేదు మెక్సికోకి చెందిన ఇద్దరు ప్రేయసీ ప్రియులు, 67 సంవత్సరాలపాటు గాఢంగా ప్రేమించుకుని, చివరికి తమ 82వ ఏట పెళ్ళిచేసుకుని, ఆ ప్రేమని పరాకాష్ఠకి చేర్చుకున్నారు. బహుశా ఇది భవిష్యత్తులో కూడా ఎవరూ అధిగమించలేని రికార్డు అని ఒప్పేసుకోవచ్చు.



అమెరికా దేశీయుడైన విక్టర్ విలియమ్స్, వసపిట్టలాగా 188 గంటలసేపు ఎడతెరిపిలేకుండా వాగి రికార్డు స్థాపిస్తే, బ్రిటన్‌కి చెందిన రే కొటెవెల్ మరో పన్నెండు గంటలు ఎక్కువసేపు మాట్లాడి ఆ రికార్డు బ్రేక్ చేశాడు.

75 గంటలసేపు పాటలు పాడటంలోనూ, రోజుకి 22 గంటల చొప్పున 45 రోజులపాటు పియానో వాయించడంలోనూ రికార్డు సృష్టించినవారు కూడా ఉన్నారు. అయితే, వీళ్ళు అడ్డదిడ్డంగా నోటికొచ్చింది పాడటం, చేతికొచ్చింది వాయించడం చెయ్యకూడదు., శ్రావ్యంగా వుండి, సంగీత బద్ధమైనవే ఆలపించాలి. ఇది అసిధారావ్రతం కాదుటండీ మరి!



# పరువు

— యం. పార్థసారథి

రోడ్ల మీద సద్దు మణిగిం తర్వాత...

అర్ధరాత్రి వేళ...

మధ్యవయస్సు దాటిన ఒక వ్యక్తి సైకిల్ నడిపించుకుంటూ వచ్చి ఒక పాత పెంకుటింటి ముందాగి తలుపు తట్టాడు. అలా మరో రెండుసార్లు తట్టితే గానీ 'ఎవరు' అని జవాబు రాలేదు.

గొంతు తగ్గించి ఇతడు "నేను" అన్నాడు. గాజుల చప్పుడు వినిపించింది. చలికి కొంగు ముసుగు పెట్టుకున్న ఒక స్త్రీ నెమ్మదిగా తలుపు తీసింది. ఆమె నిద్ర మత్తులో లేదు. పైగా అప్పటి దాకా ఏడ్చినట్టు ఆమె కళ్ళు వుబ్బివున్నాయి. ఆమె ప్రక్కకు తొలగగానే ఇతడు సైకిల్ తీసికెళ్ళి సందులో పెట్టాడు. ఆ సందు చివరన ఓ వరండా. దానికి మూడు వైపులా మూడు గదులు. మరో వైపు పంపు, బాత్‌రూం

"తాళం వెయ్యవా?" అంది ఆమె.

"అక్కర్లేదు. పంచరయింది. రేపు సైకిలోడొస్తే తీసుకుపొమ్మని చెప్పు."

ఆ సందు పక్క గదిలోకి నడిచారు వీళ్ళు.

గదిలో చిన్న కిరోసిన్ దీపం వెలుగుతున్నది. గోడకు ఆనుకుని పదేళ్ళు దాటిన ఓ పిల్లా, రెండేళ్ల మరో పిల్లా పడుకుని వున్నారు. చలికి కాళ్ళు ముడుచుకొని కడుపులో పెట్టుకుని చిన్న మూటల్లా కనిపిస్తున్నారు వాళ్ళు.

"జయమ్మను పది పైసలడుక్కొని గ్యాసు నూనె తెచ్చిన" అందామె వెలుగుతున్న దీపమే అందుకు సాక్ష్యమన్నట్టుగా.

"ఇయ్యాళ కనీసం యాభై రూపాయలన్నా దొరికేవి. ఆ ముండాకొడుకు ఎగ్గొట్టినాడు · గానీ, రేపు వాని పని చెప్పాలె" అన్నాడతడు.

"సరె. సరె. కాళ్ళు కడుక్కోనికా జెల్దీ" అందామె.

అతడు ప్యాంటు విప్పి,

"ఇదిగో, వెనక చినిగింది. కుట్టు జెర" అన్నాడు.

"పోవయ్యా, కాళ్లైతే కడుక్కో. రేపు కుట్టొచ్చులే" అంది ఆమె విసుగ్గా.

"ఒద్దే. నేను నాలుగు కొట్టంగానే పోవాలె. బియ్యపు లారీలు వస్తాయి. దించుకునేదుంది" అని అతడు అంటుంటే,

"ముందు కాళ్ళు కడుక్కో" అంది ఆమె కోపంగా.

అతడు మారు మాట్లాడకుండా, షర్టు కూడా విప్పి ఓ చిన్న గుడ్డ చుట్టుకుని కాళ్ళు కడుక్కొని వచ్చాడు.

ఆమె కంచంలో మెతుకుల్లాగైన అన్నం కొంచెం, ఓ గిన్నెలో పులుసూ పెట్టి తను పిల్లల పక్కనే మూలగా ఒదిగి కూర్చున్నది.

అతడు దేవుడి పటానికి ఓ సారి నమస్కరించి వచ్చి కంచం ముందు కూర్చున్నాడు.

"చారు బాగున్నది. నువ్వు తిన్నావా?" అని అడిగాడు.

ఆమె కళ్ళు మూసుకుని వుంది. నిద్ర పోతున్నట్టుగా వుంది.

అతడు మరోసారి ఆ ప్రశ్న అడగటానికి సందేహించి, గబా గబా ఆ రెండు ముద్దలూ తిని, కంచం కడు

కొచ్చి

"తలుపు పెట్టనా?" అన్నాడు.

జవాబు లేకపోవటంతో తలుపు పెట్టేసి తలుపు పక్కనే చిన్న జంపు ఖానా పరుచుకుని కాళ్ళు ముడుచుకుని పడుకున్నాడు.

ఆమె లేచి దీపం మరింత చిన్నది చేసి, వచ్చి చిరిగిన దుప్పటి ఒకటి పిల్లల మీద సరిగ్గా కప్పి పడుకుంది.

"ఇంటిది ఇయ్యాళ మళ్ళ వచ్చి తిట్టిపొయ్యింది" అందామె.

"ఊఁ."

"ఆగొచ్చింది. ఆ రెండు ఇండ్లోళ్లు గూడ సూశిన్రు, కావలిస్తే అడుగు. ఆఖరికి వుమ్మేసింది, కూడా. అదుగో అక్కణ్ణే! నువు అన్నం తిన్న చోటే. రేపు పొద్దున వచ్చి నన్ను, పిల్లలను బయటికి ఈడ్చే స్తదట" అంది.

అతడు అదంత సీరియస్ విషయం కాదన్నట్లుగా

"అఁ దాని బొండ. తాగింది కద నైకంల దానికి తెలవలేదు. రేపు దాని సంగతి తేలుస్త సూడు. దాని పొలం మీద రెండేండ్లనించి పన్ను కట్టలేదు. నేను మాటి మాటికీ మునిసిపాలిటోళ్ళ దగ్గరికి పొయ్యి చెప్పకపోతే దాని గతి తెలిసేది. అసలు దాని కోపమంత మన మీద గాదు. ఆ ఇద్దరు కిరాయోళ్ళంటె పడదు. కిరాయ పోచుత లేరట. అందుకని మనల్నడ్డం పెట్టుకొని వోళ్ళని తిడ్తది" అన్నాడు.

"ఆ పులుసు పక్కింటి మామ్మగారు బిచ్చపు దానికి పోస్తనంటె మనకు గావాల్నని తీసుకున్న."

"అరెరె. పొద్దున పైసలియ్య లేదు గద. మర్చిపొయ్యిన. రేపు అడుగు."

"బియ్యం గూడ లేవు. పెద్ద దానికి ఇయ్యాళ్ళ జెర మొచ్చింది. అన్నం పెట్ట లేదు. అందుకే నీకు ఆ అన్నం మిగిలింది" అందామె.

"అయ్యో. పాలు తీసుకున్నావా మరి?"

"పైసలేవి? లంఖణం మంచిది. దాన్ని ఒక పూట మాడనీ."

"ఔనౌను. అదీ మంచిదే. నువ్వే మన్న తిన్నవా?"

"పొద్దు మూకంగ జయమ్మ చాయ చేసుకుని నాకింత పోశింది. ఏదో ఒకటి కడుపులకు పొయ్యిందిలే" అంది ఆమె.

"మనకీ కష్టాలు ఇంకొక్క మూడు నాలుగు నెలలుంటయే. తర్వాత సూడు, నిన్నెక్కడుంచుతనో. ఏ వ్యాపారం నాకు అచ్చి వస్తదా అని సూస్తున్న. మొన్నాటి నాడే ఒకాయన చెయ్యి సూశి చెప్పిండు, నాకు ఇంక కొన్నాళ్ళు కష్టాలున్నాయని. గడువైపోతున్నది. నేను గూడ ఇక ఏదో వ్యాపారం గట్టిగ పట్టుకుంట. ఎన్ని తీర్ల వ్యాపారాలు చేస్తినే? ఒక్కటీ పట్టు చిక్కకపాయె. పైసలు చేతులకు ఒచ్చినట్టే ఒచ్చి మాయమాయె. ఉండుండు ఇగ ఏదో ఒకటి పట్టుకోని సాధిస్త సూడు. ఈ దెబ్బతో నీ కష్టాలు, నా కష్టాలు గట్టెక్కాలె..."

ఆమె గురక వినిపించటంతో అతనూ అటు తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

ఆమె పేరు ధనలక్ష్మి.

అతని పేరు కోటయ్య.



ఎదుటి గదిలో వుంటున్న ఆయమ్మ, "ధనలక్ష్మి, కొంచెం ఇల్లు చూడమ్మా" అని పక్క గదిలోని మామ్మగార్ని తీసుకుని పాలకు పోయింది. చల్లగా మంచు కురుస్తున్నది. ఇంకా తెల్లవార లేదు. పక్కింటి వాళ్ల పని మనిషి వూడుస్తున్నది. ధనలక్ష్మి కూడా చీపురు పట్టుకుని వాకిట్లో కొచ్చింది.

అంతలోకే సైకిలు టాక్సీ కొట్టు అతను వచ్చాడు.

"కోటయ్యా వున్నడా?"

"లేడు."

"అరె. ఇంక తెల్లారన్న లేదు. అప్పుడే పొయ్యిండా"

"ఆం. ఏదో అర్జంటు పనున్నదని పొద్దున్నే పొయ్యిండు సైకిలు ఇంట్లనే వున్నది."

"ఏంది?"

"నిన్నే తీసుకపొమ్మన్నాడు. తర్వాత నీతో మాట్లాడతాడట."

అతడు గబ గబా ఇంట్లోకి వచ్చి సైకిలు చూశాడు. ముందర చక్రంలో గాలి లేదు.

"పంచరైంది. బద్మాష్. పంచరు బాగు చేయించు కునేటందుకు గూడ పైసలు లేవా?"

ధనలక్ష్మి వినిపించుకోకుండా వాకిలి ఊడుస్తున్నది.

"ఏమమ్మో. ఇప్పటికెన్ని సార్లు ఇట్ల మాట్లాడుతనని చెప్పిండు? ఎన్నాళ్ళిట్ల తప్పిచ్చుకోని తిరుగుతడు? వానికి సిగ్గులేకపోతే నువ్వన్నా చెప్పొద్దా? నాలుగు నెలలాయె సైకిలు కిరాయకు తీసుకోని, ఒక్కనాడు పైసలియ్యడు దొంగ..."

"ఇదిగో, మీరు మొగోళ్లు మొగోళ్లు ఏమన్నా మాట్లాడుకోని నాతో నెందు కయ్యా, అట్లంటవు?" అంది ధనలక్ష్మి.

"ఒహ్హో పౌరుషం బాగున్నది. నాకు కిరాయ యియ్యడు. సైకిలు ఖరాబుచేసి ఇంట్లో పారేసిపోతాడు. ఏమమ్మా. నీకు చీమకుట్టినట్టన్న లేదా? వాడు నీ మొగుడు గాదా? నీకు తిండిపెట్టి సాకుతున్నడా లేదా?"

"మొగాయనతోని మాట్లాడుమని చెప్తుంటె-సైకిల్ తీసుకపోతే తీసుకపో, లేకపోతే లేదు."

అతడు-"ఏంపేరమ్మా నీదీ, ఏమొ గానీ చాన చాన నక్రాలు చేస్తున్నవు. నువ్వు నాకు బాకీవున్నావా, నేనునీకు బాకీ వున్నానా? నియ్యమ్మ, సిగ్గులేని సంసారం. అంత మాటపడలేని దానివైతే నీ మొగన్ని పైసలియ్యమని చెప్పు. నాకేం పనిలేక వొచ్చిననుకున్నావా?"

ఇంతలో వీళ్ల యింటి యజమానురాలు ఎల్లమ్మ వచ్చింది.

"ఏమైంది బిడ్డా?" అని అడిగింది. ఆమె తలమీద పేడతట్ట వుంది.

"ఇదెక్కడి పీకులాట ఎల్లమ్మా, ఈమె మొగడేమొ సైకిలు తీసుకొచ్చి కిరాయి యియ్యడు. ఈమె నడుగుతే నేమో తనకు తెలువదంటది" అన్నాడు.

"అమ్మో, అదసుంటిదే బిడ్డా! పిల్లి ద్దరు కూడబలుక్కోని నాటకమాడు తున్నారు. వాడేమొ దొంగోడొచ్చినట్టు రాత్రి ఒచ్చి రాత్రి పోతడు. ఇదేమొ సుద్దపూసాలె నాకేమి తెలువదంటది. ఏమే, రాత్రి వాడొచ్చిండా?" అంది ఎల్లమ్మ. తలమీద తట్ట దించుకుని.

"ఆఁ ఒచ్చిండట. ఇంకా తెల్లార నన్నా లేదు. అప్పుడే పొయ్యిండట. అంత పనేమొచ్చిందమ్మ, అప్పులోళ్ల నించి మొకం తప్పించుకుందుకు గాక పోతే. ఈ యింటి సుట్టు తిరుగలేక బేజారై పోతున్నది. ఈమెకేమొ మాట్లా డితే యింత పొడుగు కోపమొస్తది"

"అదంతా నాటకం బిడ్డా! ఈ నంగ నాచి మొకాన్ని నమ్మకు. వాడు చెప్పి పోతడు తనకేమి తెలువదని చెప్పుమని. ఏమే, రాత్రి వానికి చెప్పినవా?"

"చెప్పిన."

లోపల్నించి చంటిపిల్ల ఏడుపు విని పించింది. కాని ధనలక్ష్మి కదల్లేదు. మామ్మగారూ, జయమ్మా పాలు తీసుకుని వచ్చి, లోపలికి వెళ్ళినట్లే వెళ్లి వెనక నిలబడ్డారు. చుట్టుపక్కలవాళ్ళు తలు పులు తీసి యిక్కడ జరిగే గొడవ చూస్తున్నారు.

"ఊఁ. ఏమన్నడు మరి? సామాను తీసి పారేస్తనని చెప్పి తిగద నే, పారెయ్యిమన్నడా? మాట్లాడవే మే. ఇసుంటి దొంగలను నా యింట్లోవుంచను. తెలిసిందా. నీమొగనికి సిగ్గులేదు. సరే. నీకేమైంది, నువ్వుగూడ సిగ్గిడిశినావా? ఈ సిగ్గు శెరం లేని బతుకుకన్న మేతరిపని చేసుకోని బతుకే; లేకపోతే బిచ్చమడు క్కోని బతుకు. వాడు తెచ్చిన పైసలు నువ్వు తింటంలేదా? నీ చీరెలు బట్టలు వాడిప్పిచ్చలేదా? వాని అప్పుల పైసలు తినేది నువ్వుగని. అడిగితే మాత్రం నీకు తెలవదంటావు?"

పక్క వాకిలూడుస్తున్న పనిమనిషి "ఇగపోనీ పెద్దమ్మా. ఆయినొచ్చి నంక అడుగు. ఏదో పాపం ఆడమనిషి" అంది.

"అమ్మో అట్లనకుబిడ్డా. మీదికిట్లనే వుంటరు. నమ్మిచ్చి మోసం చేస్తరు. ఒకనాడు కాదుగద. ఇప్పటికి అర్నె ల్లాయె. ఊరినింద అప్పులుచేసి రాజు లోలె బతుకుతరు. ఏమే. నీకు రోస ముంటె నువ్వు యిల్లు ఖాలీచెయ్యి. వాని సంగతి నేను సూసుకుంట" అంది ఎల్లమ్మ.

"సైకిలు కిరాయి ఏమి చెపుతవు మల్ల?" అన్నాడు సైకిలుటాక్సీ అతడు.

"చెప్పేదేంది, ఇంట్లో ఏమున్నంటె తీసుకోని పో. ఇసుంటోల్లకు అంతే చెయ్యాలె."

"ఎహె. ఇంట్ల ఏమున్నయి, నాలుగు పాతబట్టలు"

చెల్లెల్ని ఎత్తుకుని ధనలక్ష్మి పెద్ద కూతురు హేమ వచ్చి తల్లివెనకాల నిల బడింది.

"ఏంపిల్లా, రాత్రి మీ నాయిన ఎప్పు డొచ్చిండు?" అన్నాడు అతడు.

"తెలువదు" అంది హేమ భయంగా.

"పీళ్ళు వాళ్ళకు దగ్గపోరలే బిడ్డా. ఇద్దరు ఆడపోరలను ఏంచేసు కుంటమని కన్నరే? వాల్లకు పెండ్లిల్లు చేస్తరా, అమ్ముకోని బతుకుతరా!" అందిఎల్లమ్మ.

"చెప్పమ్మా, ఏంచెయ్యమంటావు ?" అన్నాడు అతను.

"ఎత్తుక పొయ్యేందుకేమున్నది. ఇంతసేపు తిడుతరు, పోతరు, అనుకుంటరు. ఏమే నిన్నెవడన్న పట్టుక పొయ్యినా యిష్టమేనా వానికి?" అంది ఎల్లమ్మ 'థూ' అని వుమ్మేసి.

"అంతే వున్నట్టుంది" అన్నాడు సైకిలు టాక్సీవాడు మరో సైకిలు తీసుకుని ధనలక్ష్మివైపు చూస్తూ.

"ఈ సారి అదేపని చెయ్యిబిడ్డా. అదన్నింటికి తెగించిన ఆడది" అంది ఎల్లమ్మ.

"ఏం ఆడది రా నాయినా. ఇట్ల వుండాలె ఆడదంటే" అంటూ వెళ్ళి పొయ్యాడు సైకిలువాడు.

"ఉండవే వుండు. ఎన్నాళ్ళుంటవో వుండు నా యింట్ల. నిన్ను అమ్మి నా కిరాయి తీసుకోకపోతే నా పేరు ఎల్లమ్మ గాదు" అంటూ ఎల్లమ్మ వెళ్ళి పొయ్యింది.

అప్పుడు గాని ధనలక్ష్మికి తమ చుట్టూ చాలామంది మూగివున్నారన్న విషయం తెలియలేదు. వెంటనే లోపలికొచ్చి తలుపేసుకుంది. అప్పటినుంచీ అల్లరిని చూసి బిత్తరపోయిన చిన్నపిల్ల మళ్ళీ ఏడుపు మొదలెట్టింది. హేమ చెల్లెల్ని తల్లిపక్కన దింపి.

"అమ్మా, కక్కొచ్చినట్టవుతున్నదే" అంది చలికి వణుకుతూ.

ధనలక్ష్మి చంటిపిల్ల నెత్తుకుని, హేమను నల్లా దగ్గరకు నడిపించింది. హేమ ఒళ్ళుకాలిపోతున్నది. ఆ పిల్ల పైకి ఏడవటం లేదు గాని కన్నీళ్ళు జారి పడుతున్నవి.

"ఏడ్వకే. మొకం కడుక్కో. పాలు తెచ్చి చాయ చేసిస్త" అంది ధనలక్ష్మి.

"నాయిన మళ్ళ ఎప్పుడొ స్తదమ్మా?" అంది హేమ.

"ఒస్తదులే. నువ్వైతే మొకం కడుక్కో" అంది ధనలక్ష్మి.

"వాళ్ళ పైసలు యిచ్చెయ్యిమని చెప్పమ్మా" అంది హేమ. నీళ్ళతో మొహం కడుక్కుంటూంటే పచ్చగా పసరు పడింది. అందులో ఏదో ఎర్రగా కనిపించింది. ధనలక్ష్మికి పై ప్రాణాలు పైనే లేచి పొయ్యాయి.

"మామ్మగారూ ఒక్కసారి ఇట్లరా" అని అరిచింది.

"ఏమమ్మా" అంటూ వచ్చింది మామ్మగారు.

"పసరు చూడునిరి. ఎర్రగ అదేంది మామ్మగారూ?" అంది ధనలక్ష్మి.

మామ్మగారు కొంచెం పరీక్షగా చూసి నిట్టూర్చి.

"ఏమోనమ్మా. ఆస్పత్రికి తీసుకుపో. తెలుస్తుంది. మొన్ననే తీసుకుపొమ్మంటే నువ్వేమో అశ్రద్ధ చేస్తివి. తొందరగా తీసుక్పో" అంది.

ధనలక్ష్మి ఇంట్లోకి రాగానే,

"నీకు పాలు కావాలా, ధనలక్ష్మి" అని అడిగింది మామ్మగారు. "ఒద్దమ్మా, కొనుక్కొచ్చుకుంటలే."

"కొనుకొద్దువుగాని. ఇప్పటికైతే తీసుకో. మొదట పిల్లకు చాయ కాగించి ఆస్పత్రికి తీసుకుపో."



"ఎంత దూరం పోవాల్నమ్మా ?" అంది హేమ.

"దగ్గిర్నే. మెల్లగ నడువు. తొందరలేదు. అంది ధనలక్ష్మి. ఆ పిల్ల నడవలేక తూలుతోంది. పడిపోకుండా తల్లిని పట్టుకుని నడుస్తున్నది. కూతుర్ని చిత్ర హింస చేస్తున్నట్టుగా అనిపించింది ఆమెకు. రిక్షాలో పోతే బాగుండును. కాని ఎంత అడుగుతాడో ! తనకు కూడా బలహీనంగానే వుంది.

"కూచుందామమ్మా" అన్నది హేమ.

ధనలక్ష్మి పిల్లల్ని తీసుకుని ఓ అరుగు మీద కూలబడింది. హేమ తల్లి మీదికి వాలి కళ్ళు మూసుకుంది. ఆ రూట్లో బస్సులులేవు. తామింకా సగం దూరం కూడా నడవలేదన్న విషయం తెలిసొచ్చింది.

"హేమా, లేవే పోదాం" అంది ధనలక్ష్మి.

కాని హేమ బలహీనంగా మూలిగి తల్లిని కరచిపట్టుకుంది. చూస్తే నిద్ర పోతున్నట్టుగావుంది. అది మగత నిద్ర. ఎట్లా నడుస్తుంది పిల్ల ? రాత్రి భర్త యిచ్చిన అర్ధరూపాయి బొడ్డున సంచీలో భద్రంగా వుంది. ఓ రిక్షాను పిలిచింది.

"సుల్తాను బజారు దవాఖానాకు ఎంత ?"

"ఆఠాన"

"అట్లనకు నాయినా. పిల్లకు జెర మొస్తున్నది. నడిశి పోదామనుకున్నగని పిల్ల లేస్తలేదు. ఉన్నోళ్ళు దగ్గర నీ యిష్టమొచ్చినంత తీసుకో. పావులి స్త తీస్కపోనాయినా" అంది ధనలక్ష్మి.

"నీ ఏషం సూశే ఆఠానఅన్న. ఇగ నలభై పైసలకొస్త రా. లేక పోతెలేదు."

"ముప్పై పైసలు తీసుకోనాయినా. పుణ్యముంటది. కిరాయి కాదు. ధర్మమనుకో" అంది ధనలక్ష్మి దీనంగా.

రిక్షావాడు ఈమె వైపు ఎగాదిగా చూసి,

"సరె. కూసో" అన్నాడు.

ఆస్పత్రిలో పెద్ద క్యూ వున్నది. డాక్టరు దగ్గరకు చేరే సరికి పదకొండయింది.

"ఏమైంది ?" అంది డాక్టరు.

"మూడు రోజుల నించి జెరమొస్తున్నదమ్మ. ఇయ్యాల పొద్దున కక్కితే నెత్తురు పడ్డది."

"మూడు రోజుల్నించి జ్వరంవస్తే ఇంతకు ముందే ఎందుకు రాలేదు. ఈ చిన్నప్పుడు ట్రిపుల్ వాక్సిన్ అవీ వేయించారా లేదా ?"

"ఏందమ్మా ?"

"పుట్టిం తర్వాత పిల్లలకు నెలకో సారి యింజక్షన్లిస్తారు చూడు-చిన్న పిల్లల దవాఖానాల్లో— అక్కడికి పోలేదా ?"

"లేదమ్మా. ఇన్నాళ్ళు మేం పల్లెలో వున్నం. అవ్వేం తెలువవు" అంది

ధనలక్ష్మి.

"రోగాలు ముదిరితే ఏడవటం తెలుస్తుందా? ఒంట్లో నెత్తురు లేదు. పిల్లలకు ఏం పెడుతున్నావు?"

"మేం తిన్నదేదో పెడుతున్నామమ్మా"

"ఎంత మంది పిల్లలు?"

"ఇద్దరు"

"ఎందుకమ్మా. మంచి తిండి పెట్టలేనప్పుడు పిల్లల్నెందుకు కంటారు? ఇక ఆపరేషన్ చేయించు కోరాదు?"

"అట్లనే చేస్తగని, జెర దీని జ్వరం తక్కువయ్యేటట్టు సూడమ్మ, మంచి మందియ్యి."

"మందు మందు అని మా వెంట పడితే లాభం లేదు. మంచి తిండి పెట్టాలి. రోజూ పాలు తాగుతారా పిల్లలు? టానిక్కులు రాసిస్తాను వాడు. పిల్లలకు పాలు, పళ్ళు, కూరగాయలు ఎక్కువగా వాడాలి. నువ్వు యిన్నాళ్ళు పిల్లలకు సరైన తిండి పెట్టక మాడ్చితే, ఒక డోస్ మందులో బాగు చెయ్యటానికి మేమేం దేవతలం కాదు" అంటూ గబగబా ఏవో చీటీలు రాసిచ్చి,

"మళ్ళీ వేళ్ళుండిరా ఎందుకైనా మంచి డి. ఓన్సాక సిలోఫర్‌కు తీసికెళ్ళి చూపించు" అంది డాక్టరు.

ధనలక్ష్మి ఒంట్లో పూర్తిగా నీరసం వచ్చేసింది. చిన్న పిల్లను చంకన వేసుకుని, నడవళ్ళేని హేమను బలవంతంగా నడిపిస్తూ యింటికి చేరింది.

"ఇప్పుడు బియ్యం ఎక్కడ అప్పు తేవాలె?" అనుకుంటూ గోడకు వాలింది.

ఇంటి వరండాలో మామ్మగారు పురాణం చదువు కుంటున్నది. జయమ్మ భర్త డ్యూటీకి వెళ్ళిపోయాడు. జయమ్మ తీరిగ్గా టేబుల్ క్లాత్ మీద డిజైనులు కుడుతూ కూర్చుంది.

"ఏమైంది ధనలక్ష్మి," అంది జయమ్మ.

"మందిచ్చినారమ్మా. ఇంకా నీలోఫర్‌కు పొమ్మన్నారు" అంది ధనలక్ష్మి.

"అయ్యో మరి పోలేదా ?"

ధనలక్ష్మి మాట్లాడలేదు.

"పోయి రావలసిందమ్మా. పిల్లల సంగతంతా అక్కడి డాక్టర్లకు బాగా తెలుస్తుంది."

"రేపు పోతానులే. ఓపిక లేదమ్మా. ఎండెక్కువైంది" అంది ధనలక్ష్మి.

"ధనలక్ష్మి, నువ్వు యిట్లా గడపటం ఏమీ బాగా లేదు. రోజూ వాళ్ళందరూ వచ్చి నానా కూతలు కూస్తే వినటం నీకూ బాగుండదు. చూడటం మాకు బాగుండదు. నువ్వే ఏదో సదుపాయం చేసుకోవాలమ్మా. అతను ఎప్పుడు వస్తాడో ఎప్పుడు పోతాడో ఎవరికీ తెలియదు. కాని రోజంతా యింట్లో వుండేది, ఆ మాటలన్నీ వినేదీ మనం" అంది మామ్మగారు.

"ఏం చెయ్యను మామ్మగారూ. నా ఖర్మ మిట్లి తగలబడ్డది" అంది ధనలక్ష్మి.

"ఇంట్లో ఏమైనా బియ్యమున్నాయా, వంట మొదలు పెట్టుమరీ. రెండవుతున్నది. ఇంత తిని కూర్చో" అంది జయమ్మ,

"కొంచెం కూసోని, ఎక్కడన్న అప్పు తెస్త. ఎండనిపడి ఒస్తే కండ్లు

పుతున

తిరుగుతున్నాయి" అంది ధనలక్ష్మి.

"సరే. ఎక్కడ పోతావులే యిప్పుడు మా యింట్లో కొంచెం అన్నం మిగిలింది యివ్వనా?" అంది జయమ్మ.

"మీ ఆయన తిని పోయ్యిండా? మిగిలితే నే యియ్యి. రాత్రి మా ఆయన పైసలిచ్చి పొయ్యిండుగని దవఖానకు పొయొచ్చేటప్పటికి ఐపోయినవి. ఏందో జయమ్మా, అసలే మాకు కట కట వున్న దం టె యిప్పుడే ఈ పిల్లకు యిట్లాయె."

"ఎట్లాగైనా ధనలక్ష్మి, నువ్వూరుకుంటే లాభం లేదు! పిల్లలు ఎదుగుతున్నారు. వాళ్ళకు మంచి తిండి పెట్టలేవు." కళ్ళకు నచ్చిన గుడ్డలు తొడగలేవు ఐనా ఇదేం ఒక్కనాటి ఇబ్బంది కాదు గదా" అంది మామ్మగారు.

"ఏ మో మామ్మగారూ, నాకేమితో సలేదు: ఎప్పుడు సూశినా ఇప్పుడో రేపో పైసలు ఒస్తయన్నట్టే వుండది."

"అదీ నిజమేలే. మనం ఏం సంపాదిస్తాం! మగవాళ్ళను నమ్ముకుని బ్రతకాల్సిందే. నాలుగు రోజులు గడ్డుగా గడిచినా, మళ్ళీ మంచి రోజులు రాకపోవు" అంది జయమ్మ.

"ఎట్లాగైనా, మీ ఆయనకు గట్టిగా చెప్పిచూడు. ఇదేమిటమ్మా, రోజూ అడ్డమైన వాళ్లూ వచ్చి మాటలని పోతే బావుంటుందా?" అంది మామ్మగారు.

"ఫోనీ, మా ఆయన్ని అడగాలా, వాళ్ళ కంపెనీలో ఎదైనా చిన్న వుద్యోగముంటే చూడమని. మామ్మగార్ని చూడు ఈ వయస్సులో వంట చేసుకుని బ్రతుకుతూ, ఇంకా తమ్ముడికి డబ్బు సాయం చేస్తుంటుంది. మగాళ్లై వుండి పెళ్లాన్నీ, పిల్లల్నీ మాడుస్తారా ఎక్కడైనా" అంది జయమ్మ.

ధనలక్ష్మికి మనసు కాలిపోతోంది. మిగిలిన ఇరవై పైసల్తోనూ పాలు కొనుక్కొచ్చి పెద్ద పిల్లకు తాగించింది. జయమ్మ యిచ్చిన అన్నం, కూర తీసుకుని చిన్న పిల్లకు పెట్టి బలవంతంగా తనింత మింగింది.

నీలోఫర్‌కు పోవాలి. టానిక్కులు కొనుక్కురావాలి. పిల్లలకు మంచి తిండి పెట్టాలి. పెద్దదాన్ని స్కూలుకు పంపాలి. ఈ తిట్లు, అవమానాలు, ఆగిపోవాలి. తన పిల్లలు తిండి లేక, రోగాలతో చచ్చిపోగూడదు. ఎలా?



## 2

ఆ పెంకుటింటి వరండా బోసిగా వున్నది జయమ్మ భర్త శివాజీ తప్పతాగి వచ్చి ఆవిడను బండ బూతులు తిట్టి, కొట్టి పడుకొన్నాడు.

మామ్మగారు కీళ్ళ నొప్పులతో మూలుగుతున్నది.

హేమ తాగిన మందు అంతా వాంతి చేసుకొని మత్తుగా పడుకుంది.

తన కూతుళ్ళ మధ్య కూర్చుని కొడి కట్టుతున్న దీపాన్ని చూస్తున్నది ధనలక్ష్మి. ఎలుకలు పైన చూరులో

తిరుగుతూ ఒకటే అల్లరి చేస్తున్నాయి. పైనించి దుమ్ము రాలుతున్నది. ఆమె తన భర్త రాక కోసం ఎదురు చూస్తున్నది. ఆవల రిక్షాల, సైకిళ్ల చప్పుడు వినిపించటం కూడా మానేసింది. టైమెంతయిందో తెలియదు. కాని చీకటిగా, ఖాళీగా వున్న వరండా, ఎదురుగా మూసి వున్న గదుల్లోంచి వచ్చే సన్నని వెలుగూ, జ్వరంతో కలవరిస్తున్న కూతురూ, లోపల్నించి వణుకు పుట్టించే చలి— ఈ ఎడతెగని రాత్రి ఎట్లా తెల్లారుతుందా అని దిగులుగా వుందామెకు.

చివరికి ఆమె నిరీక్షిస్తున్న క్షణం వచ్చింది. తలుపు మీద గొళ్ళెంతో చిన్నగా చప్పుడు.

ధనలక్ష్మి లేచి, పిల్లలమీద సరిగా కప్పి, ఎక్కడ ఎవరు లేస్తారో నన్నంత నెమ్మదిగా నడిచి వెళ్ళి తలుపు తీసింది.

"పండుకున్నావా, అప్పట్నించి పలుకలేదు" అన్నాడు కోటయ్య.

ధనలక్ష్మి మౌనంగా యింట్లోకి వెళ్లి పళ్ళెం కడిగి, అన్నం వడ్డించింది.

"ఉండుండు" అని అతడు పేంటు, షర్టూ విప్పి తన్నుడియ్యా, అక్కడ పడితే ఒరుసుక పొయినయి. అన్నాడు నెత్తురోడిన మోచేతిన్నీ, మోకాలినీ చూపిస్తూ.

"పడ్డవా, ఎవ్వరన్న పడేశినారా?" అంది ధనలక్ష్మి పిల్లల పక్కనే కూర్చుంటూ.

కోటయ్య తీక్షణంగా చూసి,

"నన్నెవరు పడేస్తరు?" అని కాళ్ల కడుక్కొచ్చుకుని పళ్ళెం ముందు కూర్చున్నాడు.

"పెద్దదానికెట్ల వుంది?"

ధనలక్ష్మి మాట్లాడ లేదు.

"నువ్వు అన్నం తిన్నవా? మాట్లాడవేం ? ఏమైంది?"

"ఏమి లేదు. నువ్వు తిను"

"అరె నా తిండి కోసమేనా యింత! చెప్పవే"

ధనలక్ష్మి ఈ సారి కూడా మౌనంగానే వుంది.

కోటయ్య అన్నం తినేసి వచ్చి కూతుర్ని తట్టి చూశాడు.

"దవఖానాకు పొయిన్రా?"

"ఊఁ. రేపు నీలోఫర్‌కు పోవాలె. ఇగో, ఈ మందులు కొనుక్క రావాలె" అంది ధనలక్ష్మి, పక్కనించి డాక్టరు రాసిచ్చిన కాగితాలు తీసిస్తూ.

"సరే. రేపు తీసుకొస్తలే"

"దవాఖానకు పోవాలె. పైసలియ్యి"

"ఇస్తనులే. ఇప్పుడు లేవు. ఎవర్నన్న అడుక్కొని పో. రేపు ఒచ్చేటప్పుడు తెస్త"

"తప్పకుంట తెస్తవా?"

"చెప్పుతున్న గద పిల్లకు కావల్నంటే ఎక్కణ్ణించన్న తేక తప్పుతుందా?"

"ఇప్పటికెన్ని సార్లు ఇట్ల చెప్పినవు! నిన్ను నమ్ముకుంటే ఐనట్టే" అంది ధనలక్ష్మి లోపలి లావాకు మూతపెట్టాలని విఫల ప్రయత్నం చేస్తూ.

"అట్లంటవేమీ నా సంగతి నీకు తెలిసిందే గద. నేనేమి నెల జీతగాణ్ణిగాను. చేసేది వ్యాపారం ఒకసారి ఒస్తది. ఒకసారి పోతది. నాలుగురోజులు కష్టాలొస్తే అట్ల మాట్లాడు తరా ?"

"రేప్పొద్దటికి పాలు గావాలె. పిల్లకు

డబల్ రొట్టె కావాలె. పండ్లు కొనుక్కరావాలె. దవఖానకు రాను, పోను పైసలు కావాలె. ఒక్క పది రూపాయలన్న ఇయ్యి."

"నవ్వులాటయిందా? పైసలు లేవని తెలుసుకొని అడుగుతున్నావు?"

"నవ్వులాటా?" అంది ధనలక్ష్మి రోషంతో.

"నవ్వులాట నీకా, నాకా? అది నెత్తురు కక్కుకుంటె, యిన్నాళ్ళు తిండి పెట్టక ఎందుకు సంపుతున్నవు అని డాక్టరు అంటె, పొద్దున సైకిలోడొదిక్కు యింటిదొక దిక్కు నిలబడి నోటికొచ్చిన కూతలన్నీ కూస్తే నవ్వులాట నీకా, నాకా? మనుషులు లేవకముందే బయటకి పొయ్యి మల్ల నడిరాత్రి దాకా యింటికి రాని నీకు నా మాటలు నవ్వులాటలే మరి. ఎందుకిట్ల నన్ను ఏడిపించు కుంటావు? నువ్వు సాకలేక పోతే నాకు, నా పిల్లలకు యింత విషం పెట్టి చంపు. ఎందుకిట్ల అందరితోని తిట్లు తినమంటవు?"

ఆమె గొంతు క్రమంగా హెచ్చి ఏడుపుగా మారింది.

"ఉష్. ఉండుండు వాళ్ళు లేస్తరు. కొత్తగా మాట్లాడు తున్నవేంది? మన కర్మ కొన్నాళ్ళిట్ల రాసున్నది ఏంచేస్తం మరి? కష్టాలొచ్చినాయని నలుగుర్లో పడుతామా? అన్ని రోజులు మన మీది కెల్లే పోతయి" అన్నాడు కోటయ్య.

"ఈ మాటలకేమిలే; ఈ బూటకాలు చెప్పే యిన్నాళ్ళు నన్ను బొమ్మోలె ఆడిచ్చినవు. పెండ్లానికి, పిల్లలకు తిండి పెట్టలేవుగాని సంసారం చేస్తావు? దొంగోడొచ్చినట్టు అర్ధరాత్రి ఒచ్చిపోతవు. నువ్వు బాగానే వుంటావు. దినమంత ఇంట్ల వుండేది నేను. వాళ్ళ తిట్లు పడేది నేను. పిల్లలు రోగాలతోని మూలుగుతుంటే వాళ్ళకు మందులు కొనుక్కరాలేక, పాలియ్యలేక ఆ ఘోష చూడలేక ఏడ్చేది నేను."

"ఏమే, నీక్కాదా చెప్పేది? మన సంసారం గుట్టు అందరికి చెప్పుతవేందే? ఎందుకట్ల గొంతు పెద్దగా చేస్తవు"

"నీ గుట్టు మట్ల గలువ. నన్ను నడిబజార్లో నిలబెట్టి తిడితే, తిండి లేదని తెలిసి ఒకరన్నం, ఒకరు కూర తెచ్చిస్తే ఇదంత సూశి నలుగురు నాలుగు తీర్ల మాటలు నాతో నంటె నీ గుట్టు ఏమైంది? పోనీ, అప్పులోళ్లను ఇంటి మీదికి రాకుండ చెయ్యి. నేను, పిల్లలు ఎట్లనన్న మాడి సస్తం గాని. అడిగితే అట్లనే అంటవు. మళ్ళ తెల్లారంగానే రావలశి నోళ్లంతా తయారు. తిండి పెట్టక సంపేందుకు కన్నవా పిల్లలను? నేను మాట్లాడితేనే సంసారం గుట్టు బైటికి పొక్కుతుందంటవు గని ఇది బజారు సంసారమని నీకు తెలువదా? ఇంకెన్ని రోజులిట్ల బుకాయిస్తవు? ఇగ నేను యివన్ని పడలేను. ఈ తిట్లు యినలేను. నా పిల్లల కోసం నేనేమన్న చేస్త. లేకపోతే ముగ్గురం విషం తిని సస్తం. నీ వ్యాపారం, నీ పైసలతోని నువ్వే సుఖపడు."

"ఇప్పుడు నువ్వే మంటవే? నేనేమి ఊరికే కూసోలేదు. దాతనైంది చేస్తనే వున్న. ఐనా నీకు ఓపిక సచ్చిపొయ్యిం

దెందుకే!" అన్నాడు కోటయ్య కోపాన్ని తగ్గించ ప్రయత్నిస్తూ.

"ఒకనాటిదా యిది? ఆ మాట అనేందుకు సిగ్గు లేదా? నన్ను పుట్టింటి నుంచి తెచ్చిన ఈ యేడాదిలో ఒక్కనాడన్న ఈ కల కల లేకుంట వుంచినవా? నేను నిన్ను సొమ్ములు పెట్టమన లేదు. చీరెలు తెమ్మన లేదు. తిండి లేక పొయ్యినా సరేగాని ఈ తిట్లు లేకుంట వుంచుమన్న. అందుకు గూడ నేను నోచుకోలేదా? ఇంత చాతకానోనివి పిల్లల్నెందుకు కన్నవు యింక? నీ అసుంటి మంచి వెడ్డలేని లుచ్చాకు యింకా సంసారం, పిల్లలు కావాల్నా? నీకిదంత ఒక్కనాడని పిస్తున్నది? పెండ్లై ఎన్నేండ్లైంది? పన్నెండేండ్లు. ఎన్నడన్న నువ్వు నా కొక్క చీరె తెచ్చి నావు? నీ పైసలతోని ఒక్కనాడు ఒక్కముచ్చట తీర్చినావు? బజార్ల తిరిగే ఆవారాగాన్ని నిన్ను తెచ్చి బాగుచెయ్యాలని మా నాయిన నా గొంతు యిట్లకోసిండు. మూడువెయ్యిలు పెట్టి నీకు దుకాణం పెట్టిస్తే యాడాది తిరుగకుంట ఆ పైసలన్ని దిగమింగి ఉడాయిస్తివి. నువ్వు దేశం తిరిగిన యిన్నేండ్లు నేనేమైపోత ననుకున్నవు? మా నాయన లేకపోతే వాల్లింట్ల యింత తిండి పెట్టి సాదకపోతె పుట్టిన ఈ పిల్లతోని నేనేం చేస్తనను కున్నావు? అన్ని పైసలు నీ ఎదాన కొట్టి గూడ అన్నేండ్లు నాకు, నా పిల్లకు తిండి పెట్టే ఎందరేమున్నరో నీకు తెలుసా? నా గురించి ఏమన్న ఫికరుంటె నన్ని ట్లుంచుతవా? పోనీ మానాయి నోళ్ళింట్ల నన్న పడుండనియ్యకుంట నువ్వు మళ్లా దాపురిస్తివి నా బతుకంత నన్ను కాల్చుకోని తినటం తప్ప నువ్వు నాకేమి మేలు చేసినవు? మళ్లమా నాయన కాళ్ళమీద పడి ఇంక రొండు వెయ్యిల రూపాయిలు రాబట్టుకొని ఇంతపొడుగు సంసారం చేస్తనని నన్ను ఈ అడివిలోకి తీసుకొచ్చి అప్పులోళ్ళకొది లేస్తివి. ఇప్పుడు మా నాయిన గూడ పాయె! మా అన్న యింటికి రానియ్యడాయె. నీ కేమొ యిదంత ఒకనాటి ఏడుపనిపిచ్చె, నేనెక్కడ సావాలె? ఏం చెయ్యాలె. ఈ కష్టాలకు తోడు యింకో పిల్ల ఒచ్చిపడె. ఈ యిద్దరు పిల్లలతోని నేనేం చెయ్యాలె? వీళ్లు తిండిలేక సస్తుంటె సూసుకుంట కూసోనా లోకంల అందరు యిట్లనే సంసారాలు చేస్తున్నారా? నా బతుకు నాశనమైంది దేవుడో!"

ఆమె గొంతు బాగా హెచ్చింది. ఏడుస్తూనే మాట్లాతున్నది. జయమ్మ గది తలుపు తీసి గుమ్మంలో నిలబడి చూస్తున్నది. హేమ లేచింది. చిన్నపిల్ల ఏడుస్తున్నది. ధనలక్ష్మి పిల్లను దగ్గరకు తీసుకోలేదు. కోటయ్య ధనలక్ష్మి భుజాలు పట్టుకొని,

"ఒద్దే ఏడవకు అదిగో, వాళ్ళంతా లేచి చూస్తున్నారు. ఒద్దే" అన్నాడు బ్రతిమాలుతున్నట్టుగా

"సూడనీ, సూడనీ అందరుసూడనీ. లోకమంతా ఒచ్చి సూడనీ ఇంక నాకేమి సిగ్గు మిగిలిందని భయపడాలె? ఇది నీకు కొత్తనేమొగని నాకు రోజు జరుగుతున్న సంగతే. నా తప్పు లేకున్నా, అందరూ నన్నా బజార్ల పెట్టి తిడ్తున్నారు. నన్నింత కష్ట పెడుతున్న

నిన్ను ఒక్కనాడు అందరు చూస్తే తప్పేమి? నేనేమి నిన్ను తిడుతలేను! కొడతలేను! నా కర్మకు నేనేడుస్తున్న అందరు సూడనీ" అంది ఆమె ఏ మాత్రం గొంతు తగ్గించకుండా. కాని ఏడుపువల్లా-అరుపులవల్లా ఆమె గొంతు బొంగురుగా మారింది.

హేమ తల్లిని పట్టుకొని "అమ్మా, అమ్మా ఏడవకే" అంది. ఆ పిల్ల కూడా ఏడుస్తున్నది.

"చెప్పరాదే. పొద్దున నాతోని చెప్పి తివిగదా నాయనను అప్పులు తీర్చమని యిప్పుడు చెప్పవే. నీ ముద్దుల నాయన ముందలనే కూసున్నడు. చెప్పు. నన్నేం చెయ్యమంటవు? నేను చేసిన అప్పులు కావు. నేను కొన్న సామానుకాదు. ఆ ఒచ్చెటోళ్ళు ఎవరో గూడా నాకు తెలు వదు ఎవనికి ఎంతప్పున్నడో ఎందుకప్పు ఉన్నడో కూడా నాకు తెలియదు కాని అందరొచ్చినన్ను గుడ్లగూబను తిట్టినట్టు తిడుతరు."

ఆ పిల్ల మళ్ళీ,

"ఒద్దమ్మా, నాయననేమనకమ్మా," అంది ఏడుస్తూనే.

కోటయ్య కళ్ళలో నీరు తిరిగింది.

"అదే ఏడుస్తున్నది. నువ్వట్లమాట్లా డకే. పిల్ల భయపడుతుంది. ఒద్దే" అన్నాడు

"ఓరి నాయినో నీకు వెయ్యిదండాలు. మేము దేనికీ బయపడేటట్టులేం. అన్నిటికి మొద్దుబారి పోయినము. సిగ్గు ఎగ్గు ఇడిసేసినం. నువ్వేమి చెప్పకు నాయినో. నన్నిట్ల ఏడువనియ్యి. నువ్వు పోయిగ తెల్లార్తది. మల్ల అప్పులోల్లొస్తరు వాల్ల తిట్లకు మల్ల తయారుగావాలె ఎన్ని నోములు కొలిశినో యింత మంచి రాత రాశిండు దేవుడు. మిమ్మల్నెవ్వర్ని ఏమంట లేను దేవుడో, నారాతకు నేనేడ్సుకుంటున్న. మీరంత నిద్రపోండ్రి" అంది ఆమె వెనక్కువాలి కళ్ళుతుడుచుకుంటూ

అప్పటినించీ తన గుమ్మంలో నిలుచున్న మామ్మగారు వచ్చి,

"ఒద్దమ్మా ధనలక్ష్మి. ఏడవకు, ఏడిస్తే ఏమొస్తుంది. నెమ్మదిగా మాట్లాడుకోండి. నువ్వు కూడా ఆలోచించు కోటయ్యబాబూ. ఎంతైనా ఆడమనిషి ఎన్నాళ్ళిట్లా భరిస్తుంది. మీరేం యింకా చిన్నపిల్లలు కారు. ఇద్దరు పిల్లలున్నారు. కనీసం వాళ్ళ కోసమైనా మీరు ఏదోఒక దారిలో పడాలి. ఆ పిల్లలను చూడు. అంత జ్వరం పట్టుకున్నది. కన్నందుకు వాళ్ళను జాగ్రత్తగా కాపాడుకోండి. ఏదో తిన్నా తినకపోయినా మనింట్లో మనం గుట్టుగా వుండాలిగాని నలుగుర్నీ యింటిమీదికి రప్పించుకో వద్దు. అనే వాళ్ళకేం నాయనా. ఒక్కటి అనాల్సిన చోట పదిమాటలని నోటి దురద తీర్చుకుంటారు. ఓ నాడు నువ్వుండి వాళ్ళతో మాట్లాడు బాబూ. ఆమెనట్లా అనొద్దని వాళ్ళకు చెప్పు. ఆమె ఏమి మాట్లాడినా, ఏంచేసిన నిన్ను నమ్ముకుని బతికే మనిషి. తనగోడు నీతో చెప్పుకోకపోతే ఎవరితో చెప్పుకుంటుంది? మేమెంతైనా చెప్పేవాళ్లమే వినటానికి బాధపడతాం తప్ప, వాళ్లట్లా అంటుంటే ఒద్దనలేం. ఏమనుకోకు నాయనా, కోపంతెచ్చుకోకు" అంది.

హేమ తల్లిమీదపడి అలాగే నిద్ర

పోయింది. చిన్నపిల్ల కాసేపు ఏడ్చి రొమ్ము నోట్లో పెట్టుకుని పడుకుంది.

"నే నెవరింట్లోనన్న పనిచేసి బతుకుత" అంది ధనలక్ష్మి.

కోటయ్య ఒక నిమిషం ఆలోచించి, "అట్ల వు దేకపడకు. నిమ్మళంగ ఆలోచించు. మనకు కష్టాలు లేవన్ననా నేను? నువ్వు కష్టాలోర్చుకుంటలేవన్ననా? ఇన్నాళ్ళు ఓర్చుకున్నావు. ఇంక నాలుగు రోజులు ఓపికపట్టు. నిన్ను తిడుతున్నారు. నిజమే. ఇయ్యాళ తిట్టిన కొడుకులే రేపు పైసలొచ్చినంక కాళ్లదెగ్గరి కొస్తరు. ఈ మూడు నాలుగు నెలల కోసం ఎవరింట్లోపని చేశినా పరువు పోతది" అన్నాడు.

"ఓ నాయినా నీ కాళ్ళు మొక్కుత. ఇంక నాకేమి చెప్పకు. ఈ తిట్లకంటె, సాపెనలకంటె ఎక్కడ అంట్లు తోము కొని బతికినా మేలే."

"చూడే! నా మాటవిను. అట్ల పట్టు పట్టకు. నాలుగు రోజుల కష్టాలకు అట్ల మనసిరగ్గొటుకోకు. ఇప్ప దేమంతి ఆర్తి వచ్చిందని, నేనేమైపోయిన్నని అట్ల మాట్లాడుతున్నవు. నావల్లనే నువ్వు కష్ట పడుతున్నవు. నిజమే కాని చూడు రేపు నాతోనే నువ్వు సుఖపడతవు. బాగుపడాల్నంటే అంట్లు తోముకోవొద్దే. ఎక్కడ ఎవర్ని ఎట్ల పట్టుకుంటె పైసలొస్తాయో సూసి పట్టుకోవాలె. నువ్వు సచ్చిందాక వాకిండ్లూడ్చినా బాగుపడలేవు. బాగు పడాల్నని నీకుంటె అసుంటి పనులు చెయ్యకు."

ధనలక్ష్మి తనకేమాత్రం పోట్లాడే వుద్దేశం లేనట్టుగా, చాలా నెమ్మదిగా.

"పొద్దున బొగ్గులు లేకపోతె జయమ్మ స్టవుమీద అన్నం వొండిన. నేనిక్కడి కొచ్చిన యాడాదినుంచి యిదే సంసారం. నేను నీకు చెప్పి నీ మనసెందుకు కష్ట పెట్టాలె? పైసలొచ్చినంక నువ్వే సుఖ పడు గని యిప్పుడు నామాన నన్ను కష్టపడనీ, ఇంట్ల పండుకొని నేనేమి సుఖపడుత లేను, ఒళ్ళొంచి పనిచేస్తె కష్టంపడేందుకు."

"ఇగో నువ్వే ఆలోచించు. మనం ఎక్కడోళ్ళమో గాదు. వంశం, కులం, మర్యాద ఏవీ లేవనుకోకు. మన యిండ్లల్ల ఎక్కడన్న ఆడోళ్ళు కూలిపనిచేసి బతికిన్రా? వ్యాపారంచేసి బతికే కులం మనది. ఒకసారి నష్టంరాదా, నాలుగు రోజులు కడుపుకు మాడమా? అప్పులుంటె నలుగురు అడుగుతరు. కాని దాన్ని సూశి మనసు మార్చుకుంటామా?"

"ఛీ ఛీ. దొంగమాటలన్నీ చెప్పకు. నీకు సదువురాదు. చేతుల నాయా పైస లేదు. ఎవ్వడు నిన్ను నమ్మడు. నువ్వొగ లఫంగవు. నువ్వుచేసేది వ్యాపారంగాదు. ఆవారా తిరుగుడు. అ చౌరస్తకాడ, ఈ అడ్డమీద నిలబడి వాని మాటలు వీనికి, వీని మాటలు వానికి చెప్పి, పావుల అఠాన తెచ్చుకుంటె వ్యాపారమంటారా? నీ దొంగేశాలు ఎన్నాళ్ళు నడుస్తయి? ఎవడో ఒకనాడు బొక్కలిరగ్గొడుతడు. అప్పుడు నీ వ్యాపారం రంగు బైట పడ్తది,"

"అంతేనా? అదేనా మాట్లాడే పద్ధతి? మీ అమ్మ, మీ నాయనతోని అట్లనే మాట్లాడినాదే? మీ ఒదినె మీ అన్నతోని అట్లనే మాట్లాడుతాదే? సంసారంచేసే

"ఆడోళ్ళు మాట్లాడే పద్ధతి యిదేనా? ఎందుకిట్ల తయారవుతున్నవు?"

"ఆహా సాలు. సాలు. మా ఇంట్ల మొగోళ్లు ఆడోళ్ళను అప్పులోళ్ల మీదికి వదిలెయ్యలేదు. తిండిలేక మాడ్చ లేదు. రోగాలొస్తే మందులకు పైసలు లేవన లేదు. వాళ్ళు రోజు అడుక్కోని తినరు. వద్దయ్యా, నువ్వు చేసిన ఘన కార్యానికి మావోళ్ళ సంగతెందుకు? ఇది నువ్వు సంసారమనుకుంటున్నవేమో. నువ్వు చేసిన అప్పులకు నేను వాళ్ళ తిట్లు పడ్డన్నిరోజులే ఇది సంసారం. ఒక్కనాడు నీ అప్పుల సంగతి నాకు తెలవదని జాడిచ్చి చెప్తే ఇది సంసారం గాదు. నువ్వు సంసారివి కాదు. నువ్వు నన్నడ్డం పెట్టుకొని, పిల్లల పేరు చెప్పుకొని, నలుగురి దగ్గర నాలుగు తీర్ల మాటలు చెప్పి పైసలు పుట్టిచ్చుకొస్తున్నవు. నీకు సంసారం గూడ లేదని తెలిస్తే వాళ్ళు నిన్ను కుక్కను కొట్టినట్లు కొట్టి తరుముతరు."

కోటయ్య కోపం తెచ్చుకోలేదు. శాంతంగా "నువ్వేం మాట్లాడుతున్నవో నీకు తెలువద్దు. నువ్వు అంట్లు తోముకొని బతికితే నా పరువు ఏమయితదో ఆలోచించు. నా వ్యవహారం, నా వ్యాపారం, నా లావాదేవీలు, అన్నీ ఏమయిపోతయి? ఫలాని మనిషి పెండ్లాం ఇండ్లల్ల పని చేసుకోని బతుకుతున్నదంటె నా కెంత నాదాన్? నేనెట్ల తలెత్తుకొని తిరుగాలె?" అన్నాడు.

"దొంగలు తలెత్తుకొని తిరుగరు. నీకు పరువేంది? నేను కష్టపడితె నీకు నాదానైతది. నువ్వు లుచ్ఛాపని చేస్తే నాకు నాదాన్ కాదా? థూ."

"ఇగో. లుచ్ఛా, లుచ్ఛా అని అట్ల అనకు. నేను ఏమి పని చేస్తె నీదేం పొయ్యింది? పైసలు తెచ్చి నిన్ను సాదుతె సరిగద. మన కులపోళ్ళ కండ్లళ్ళ, సుట్టాలల్ల చెడ్డోణ్ణి కాకపోతే సాలదా? ఒళ్లు అలువకొట్టుకుంటనే పైసలు రావే. దానికో ప్లాను వెయ్యాలె. నలుగురు పెద్ద మనుషులను ఎట్లగన్న పట్టుకోవాలె వాళ్ళకు కావలిసిన విచ్చి మన పనులు చెయ్యిచ్చుకోవాలె. మరి ఇసుంటి పనులు తొందర పడై కావు. నువ్వు నాలుగు రోజులు కండ్లు మూసుకో. కండ్లు తెరిచేటప్పటికి నిన్ను బంగ్లాల వుంచకపోతె నా పేరు కోటయ్య గాదు."

"ఇగ చెప్పకు నాయనో, నువ్వు ఇంక ఎక్కువ మాట్లాడితే నేనిప్పుడే వురిపోసుకొని సస్త."

"ఇదిగో మళ్ళ మళ్ళ చెబుతున్నను. నేను బతిమిలాడుతుంటె నువ్వు ఇంకింత బిగుడాయిస్తున్నావు. నీ మంచికే చెపుతున్న. నీ పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేసి నేను చెప్పినట్టుచెయ్యి. లేకపోతే మీ ఇంటికి పో నాలుగు రోజులు. అది ఇది గాదంటె నాకు తెలిసినోళ్ళున్నారు. వాళ్ళింట్లనన్న వుండు. అంతే గని కూలి చేస్త, కూలి చేస్తనని పాట పాడకు. కూలోళ్ళింట్లనే పుట్టవలసిన దానివి. మా కులంల తప్ప పుట్టినవు".

"ఓహో, ఏమి, నన్ను బెదిరిస్తున్నవా? నేను కూలి పని చేస్త. ఇంకేదన్న పని చేస్త నీ కనవసరం. నేను

అంటెనే నీకింత రోసమొచ్చింది. నీకు నిజంగ ధైర్యముంటే, మా మ్మ గా రు చెప్పినట్టు రేపెక్కడికి పోకు నీ మొగ తనం సూపిచ్చి ఒచ్చినోళ్ళందర్ని ఎల్ల గొట్టు. ఈ బూటకపు మాటలు చెప్పి ఎన్నాళ్లు మోసం చేస్తవు? నిన్ను నమ్మి నా బతుకు నాశనం చేసుకున్న ఈ ఇంట్ల నా గతి బానిస కన్న హీనమైపొయ్యింది. ఇంక నువ్వేం చెప్పిన, సరే. నా దారి నేను సూసుకుంట."

"అంతేనా?"

"అంతే. అ ం తే. అంతే. సస్తె సస్తను. నా కులపోళ్ళు నన్ను పేరం టానికి పిలవకపోనీ, నా సావుకు ఎవ్వరు రాకపోనీ."

"అది సరే. మీ అన్న ఏమను కుంటడో సూడు. చెల్లెలు కూలి పని చేసుకొని బతుకుతున్నదంటె వాళ్ళకెంత నామర్దా?"

"ఎవ్వరికి నామర్ద వుం డొ ద్దు. నాయినో. నీ అసుంటి మొగోడున్నం దుకు సిగ్గు పడాలె ఎవరన్న. తనింటి కెందుకు రానియ్యడనుకున్నవు నా అన్న, నీ సంగతి తెలిసే రానియ్యడు. నువ్వు వాళ్ళ దగ్గర ఇంకేమన్న పై స లు గుంజుతవని వాళ్ల భయం. ఇగ నాకు ఎవ్వరు లేరు దేవుడో. నా బతుకు నేను సూసుకుంట. నేను సచ్చిపొయ్యనని అందరితో చె ప్పు కోఇగ."

"సచ్చినా బాగుండె. నా పరువు తీస్తున్నవు."

"అవును ఈ పిల్లల్లేకపోతే సచ్చేదాన్నే. ఈ యిద్దరు పోరలను యేంచేశి పోను? ఎవ్వరికాదిలేశి పోను. వాళ్ళకోసమన్న బతుకాలె".

"ఊఁఊఁ. అంతేనా ఇగ నా పరువు మంట్లెగలిపి, నలుగుర్ల నాకు తలవంపు చేసి నేను నిన్ను సాదలేదని అందరికి చెప్పుకుంటందుకు పోతవు. నా వ్యాపారం పాడైతది. నా పలుకుబడి పోతది. నా సంగతి అందరికి నవ్వులాటైతది. నేను ఎటుకాకుంట ఐపోత. మీ వంశ మర్యాద, నా మర్యాద లెక్కచెయ్యక, నీ పిల్లలను అందరు కూలిదాని పిల్లలు అంటరనన్న లెక్కసెయ్యక నువ్వు యిండ్లల్ల పనికి పోతవు. అంత పరువు, మర్యాదలేకుంట పొయ్యింది నీకు. సరే"

"సరేగాదు. పోత. రేపు పొద్దున ఎవడన్న ఒచ్చి ఒంకర కూతలు కూస్తే చెప్పుతీసుకొని కొడ్త. రేపటినించీ ఎవ్వడు నాదగ్గెరికొచ్చి తిట్టొద్దు. నా రెక్కల కష్టంతోనే నేను బతుకుత. లేకపోతే పిల్లలకు విషంపెట్టి నేను తినిసస్త, కానీ ఎవ్వడైన నా పేరెత్తుకొని తిట్టితే ఒప్పు కోను".

"ఇగ నీకు నాకు సంబంధం లేనట్టేనా?"

"ఆఁ. ఈ తిట్ల సంబంధం, అడుక్కు తినే సంబంధం ఇగలేదు.

"సంబంధం లేనప్పుడు నేనెందుకు రావాలెనురి? రేపటినుంచి నేను రాను. నీకు కనపడను. పిల్లలకు చెప్పు ఇగనేను రానని. నా కర్మయిట్ల వుంది. ఇన్నాళ్ళు బతికి పెండ్లాం కూలిదని చెప్పుకోవాలె"

"ఈ దొంగమాటలు చెప్పకు. కాయ కష్టం చేసినందుకు సిగ్గుపడొద్దు. ఈ దొంగబతుకు బతికేబదులు ఈ ఆడిబట్ల

మాటలకు బదులు నీకు నేనంటే నిజంగా కనికరముంటె నా బదులు నువ్వే కూలి చెయ్యి. యాడనన్న రిషా తొక్కిరా. సున్నమేసిరా. అప్పుడు నే నెక్కడికి పోను. నువ్వు కొట్టినా, తిట్టినా పడుంట. నా మొగడు నన్ను సాదుతున్నడను కుంటా. కానీ అప్పులోళ్ళనింటి చుట్టూ తిప్పకుంటూ రెండు నెలలుండు, మూడు నెలలుండు అని అనకు".

"ఇగ అవన్నీ ఎందుకులే. నా బతుకు పెరటమీద యిస్తరాకైంది. పో...పో... ఎంత దూరం పోతవో నేనుగూడా సూస్త"

"నామీద పడేడుస్తావెందుకు? అరె. ఇది ఇల్లా జైలా ? నన్ను పెండ్లి చేసు కున్నది నువ్వు. ఇడిసేశి దేశాలమీద పడ్డది నువ్వు. మళ్ళవొచ్చి ఈడికి తెచ్చింది నువ్వు. ఇద్దరు పిల్లలను అంట గట్టింది నువ్వు. అప్పులు చేసిందీ, ఎగ్గొట్టిందీ నువ్వు. బట్టెబాజి పనులు చేసింది నువ్వు. నన్ను బోనుల ఎలుకను సేసినట్టు సేసి అందరితోని తిట్లు తిన మంటావు ? ఇది నేను ఓర్చుకోలేను. తిండిలేక మాడలేను. పిల్లలకు తిండి పెట్టక చంపలేను. నా బతుకు నేను బతుకుతానంటే నిన్ను బజార్ల ఏసిన్నని ఏడుస్తావెందుకు ? నువ్వు మమ్ములను సాదకపొయ్యినా, తిండి పెట్టకపొయ్యినా అందరితోని తిట్టిచ్చినా, పీనుగ పడున్నట్టు పడుంటే నీకు మర్యాద నిలుస్తదా ? నీ మనసుల ఏమున్నదో నాకు చెప్పు. ఇన్నాళ్ళు నేను పడ్డ కష్టాలు చాలక, ఇయ్యాళ నేను పని చేస్తానంటే నీకు మర్యాద పొయ్యిందా ? నిజానికి ఏడువ వలసింది నేను. మంచి యింట్ల పుట్టిన. మా నాయన మంచి కట్నమిచ్చి పెండ్లి చేసిండు. అన్నిచేసి ఆఖరికి తిండి పెట్టలేని బాడకావుకు నన్నిచ్చి నా బతుకు బుగ్గిపాలు చేసిండు. నా పెండ్లి మంట గలువ. ఇంతచేసి ఇయ్యాళ నన్ను కూలిపని గూడా చేసుకోవద్దని ఆజ్ఞ పెడుతున్నాడు యముడు. ఓరి దేవుడో. ఇదెక్కడి న్యాయమో, నాకు సావివ్వ డాయె దేవుడు"

ఆమె అరుపులకు భయపడ్డట్టుగా కోటయ్య గబుక్కునలేచి, "ఒర్లకు... ఒర్లకు...అన్ని నువ్వే తెలుసుకుంటవులే. నీ యిష్టమొచ్చిందే చెయ్యి. నేను మాత్రం ఇగ రేపటినించి యింటికి రాను. అదే సంగతి అందరికి చెప్పు" అన్నాడు.

ధనలక్ష్మి కదల్లేదు. అతను గుడ్డలు వేసుకుని, దండెం మీదినించి మరో జత గుడ్డలు తీసుకొని సంచీలో పెట్టు కున్నాడు. అద్దం ముందరి దువ్వెన ముక్కను జేబులో వేసుకున్నాడు. ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, జేబులోని రెండు రూపాయలూ దేవుడి పటం ముందర పెట్టి, సంచి చేతపట్టుకుని గుమ్మం దాటాడు. చలి, ఈదురుగాలి, మంచు కురుస్తున్నది. సన్నగా, పొడుగ్గా వున్న కోటయ్య విగ్రహం ఆ అర్ధరాత్రి చీకట్లో కలిసి పోయింది.

రోడ్డుమీద గూర్ఖా కర్ర చప్పుడైంది. నల్లా గురగురమంటూ చప్పుడు చేసింది. ధనలక్ష్మి తలుపుతీసి రావటానికి కూడా లేవలేదు.

చతుః



# 3

డిసెంబరు ఉదయం నాలుగు గంటల చలిలో జయమ్మ లేచి భర్తకు వంట మొదలెట్టింది. ఐదున్నరకల్లా శివాజీ డ్యూటీకి చేరుకోవాలి. తాగిన మైకంలో అతను గాఢ నిద్రలో ఉన్నాడు. లేపితే తిడతాడు. కానీ లేపకపోతేనే ఎక్కువ తిట్లు. రాత్రి తెచ్చిన పాలు వెచ్చబెట్టి మొదట కాఫీ చేసింది. అప్పుడు మొగుణ్ణి లేపింది జయమ్మ. రెండు మూడుసార్లు విదిలించి కొట్టాడు. కానీ అతణ్ణి లేపాలి.

"కాఫీ చల్లారుతోంది. తాగి పడుకుందురుగాని"

"అబ్బ. కడుపులో తిప్పుతున్నది ఒద్దే".

"మరెలాగండీ, రాత్రి తాగొచ్చి మజ్జిగన్నమన్నా తినకపోతిరి"

"నీ తిండి తింటే అప్పుడే డోక్కునే వాణ్ణి. నువ్వు వండేది వంటా? పెంటా?"

భర్త ఎంత ఏవగింపుతో మాట్లాడినా లెక్కచెయ్యకపోవటం ఆమెకు అలవాటైంది.

"కాఫీ తాగండీ" అని అతడు కాఫీ తాగుతుంటే—

"మొహం కడుక్కురండి త్వరగా టైమవుతున్నది. అన్నం క్యారియర్‌లో పెట్టాను. రాత్రి పిండి రుబ్బానుగా, ఇప్పుడు గారెలు టిఫిన్ చేస్తున్నాను" అంది.

"నీ వంట యావ తగలడా, ఎప్పుడు రుబ్బావే ?" అన్నాడు శివాజీ.

"మీరు పడుకున్నారుగా. నాకు నిద్ర రాలేదు"

అప్పుడు రుబ్బాను."

"ఐతే నిన్ను రోజూ తన్నాలే. మీరింతే పశువులు. తన్నుతుంటే తప్ప బుద్ధిగా వుండరు."

జయమ్మ గారెలు ఒక్కొక్కటీ నూనెలోంచి తీసి వేస్తున్నది.

"పెరుగులో వెయ్యవే." అన్నాడు శివాజీ.

"పెరుగు లేదండీ. పచ్చడి పెట్టుకోండి" అంది జయమ్మ.

"ఆఁ. ఆఁ. అనుకుంటూనే వున్నాను. అన్నీ సరిగ్గా చేస్తే నువ్వు ఆడదానివెందుకవుతావు. పెరుగు తోడు పెట్టటానికేం పుట్టిందే" అన్నాడు శివాజీ ఎప్పటికప్పుడే ప్లేటులో పడ్డ గారెల్ని మింగుతూ.

"పాలు మిగల్లేదండీ. కొంచెంమిగిత్తే నిన్న కాఫీకే సరిపోయాయి."

"ఛీ. ఛీ. జీతమంతా నీ తిండికే సరిపోదాయె. ఇంత సంపాదించిన నేను పెరుగు గారెలు తినశేసు. ఏం, ఓ పూట కాఫీ తాగకపోతే చచ్చేదానివా? నేనెక్కడ సుఖపడి పోతానో అని నీ కుట్ర. దొంగ...?" అని ఆ గారెలన్నీ తిని మిగిలిన నాలుగూ కారియర్‌లో పెట్టించుకుని గబగబా వెళ్ళి పోయాడు శివాజీ.

అప్పటికి తెల్లవారింది.

అప్పటి నుంచీ యిది గమనిస్తున్న ధనలక్ష్మి కూడా లేచి, పెద్ద పిల్ల శరీరం తాకి చూసింది. కొంత చల్లగా వుంది.

ఆ ఇంటికి పని మనిషి లేదు. అందు వల్ల వంతులవారీ రోజుకొకరు వూడుస్తారు. కాని మిగతా యిద్దరూ వూడ్వక పోయినా ధనలక్ష్మికి తప్పదు. ధనలక్ష్మి వెళ్ళి వాకిలి చూసి, ఎవరూ వూడవ లేదని తెలుసుకుని తనే వూడ్చి వచ్చింది. కొంత పొద్దెక్కిన తర్వాత ఒక కార్డు కొనుక్కొచ్చుకుని, జయమ్మ దగ్గర పెన్ను అడుక్కొని తన అన్నకు వుత్తరం రాసింది.

"పెద్దదానికి ఆరోగ్యం బాగా లేదు. ఇంట్లో జరుగుడు కష్టమై పోతున్నది. ఈ ఒక్కసారి నా మీద దయతలచి సహాయం చెయ్యి. నీ మేలు మరువను. వీలుంటే ఒకసారి రా."

"ఎవరికి ధనలక్ష్మి?" అని అడిగింది జయమ్మ. ధనలక్ష్మి చెప్పింది.

"ఎట్లాగైనా ధనలక్ష్మి, నువ్వు తొందర పడుతున్నావు. కట్టుకున్న వాణ్ణి కాదని స్వతంత్రించటం మంచిది కాదు. మనం ఎన్ని చేసినా చివరికి వాళ్ల కింద వుండవలసిన వాళ్ళమే. వాళ్ళను కాదని ఏమీ చెయ్యలేం" అంది జయమ్మ.

"మీ సంగతి వేరే జయమ్మా. ఎన్ని మాటలన్నా మీ ఆయన నీ కింత తిండి పెడ్తున్నడు. నిన్ను బాగా సూసుకుంటున్నడు. నాక్కు అది గూడ లేదాయె. నా మొగడు నన్ను మాడ్చె. నా పిల్లలను మాడ్చె. ఇగో ఇప్పుడు దవఖానకు పోవాలె. ఒకరోజు జెరమెక్కువైతే కాళ్లు చేతులు చల్లబడుతయి. జెర బాగుంటె దవఖాన కెందుకులే అనిపిస్తది" అంది ధనలక్ష్మి.

"అంతే. అంతే. ఐనా ఈ కాలం మార్పో ఏమిటో అందరికీ జ్వరాలు వస్తున్నాయి. ఇప్పుడు నీలోఫర్ కు పోతే వాళ్ళింకేవో మందులు రాసిస్తారు. వాటికి మాత్రం డబ్బులెక్కణ్ణించి వస్తాయి. అందుకని వున్నదేదో తిని కాలం గడుపు. అన్నింటికీ ఆ దేవుడే వున్నాడు" అంది జయమ్మ.

"ఎటు తోస్త లేదు జయమ్మా. ఈ వుత్తరమెప్పుడు ముట్టుతదో ఎప్పుడు మా అన్న ఒస్తడో."

"నువ్వు అనుకుంటావు. నీకే కష్టాలున్నాయని. కానీ నా కష్టాలు నేనెవరితో చెప్పుకోను ధనలక్ష్మి. నిన్న రాత్రి ఆయన చెప్పాడు. మళ్ళీ ఆయన మరదలు ఒస్తుందట, నా గుండెల మీద కుంపటిలాగ" అంది జయమ్మ, కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ.

"అయ్యో, అంతకే అట్లయిపోతవు?"

"నీకేం తెలుసమ్మా, ఆ గొడవ" అంటూ మొదలు పెట్టింది జయమ్మ.

"మా ఆయనకు మొదటినుంచీ ఆయన మరదలి మీద మనసుందట. వాళ్ళేమో కట్నం యివ్వరు. అందుకోసం నాలుగు వేలు కట్నమిచ్చిన మా సంబంధం చేసుకున్నారు. చేసుకున్న రోజు నుంచీ యింతేనమ్మా. నాకు మెల్ల కన్ను వుందంటాడు. చదువు రాదని దెప్పి పొడుస్తాడు. పోనీ, యిప్పుడు చదువు

కుంటాను అంటే 'మొద్దు మొహానికి చదువు కూడానా' అంటాడు. 'ఈ మధ్యన, పెళ్లై ఐదేళ్లైనా పిల్లలు కాలే దేం, గొడ్రాలివి' అంటున్నాడు. దానికి కూడా నాదేనా తప్పు. 'డాక్టరు దగ్గరకు పోదాం' అంటే వినడు. నేను ఆయన వెంట ఏ సినిమాకు పోవద్దు. ఏ బంధువుల యిళ్లకూ వెళ్ళనివ్వడు. నన్ను చేసుకున్న తర్వాతనే ఆయన బ్రతుకు పాడైందట. ఈ మరదలు నా కన్నా పెద్దది. ఇంకా పెళ్ళి గాకుండా వున్నది. అంత ప్రేమించిన మనిషి ఆమెనే ఎందుకు చేసుకోలేదో మరి. నా 'బతుకెట్లాగూ నాశనమైంది. కనీసం నా మరదలి బ్రతుకైనా బాగు చేస్తాను' అని ఆమెను కాలేజీలో చదివిస్తున్నాడు. నెలనెలా వాళ్ళకు డబ్బు పంపిస్తాడు. ఆవిడ పెళ్లైందాకా ఈ గొడవింతే. ఊరికే ఆమె గురించి చెప్పి నన్నేడిపిస్తాడు. ఆమెను చూడగానే మనిషే మారిపోతాడు. వాళ్ళున్నప్పుడు ఆయనకు నేను ఓ పురుగుకన్నా హీనంగా కనిపిస్తాను. కాని దీని వెనకున్నది ఆమె తల్లి. ఏమిటోనమ్మా, ఒక్కసారే చూశాను. ఈయన తల్లిదండ్రులకన్నా గూడా, ఆవిడే ఈయన మీద అధికారం చలాయిస్తుంది. సరే. ఈయన వుద్యోగం అందుకు తోడైంది. ఆ రూట్లో వెళ్ళినప్పుడల్లా వాళ్ళ దగ్గరికి పోతాడు. ఇది చాలదని వాళ్ళు ఉత్తరాలు రాస్తారు అవసరంగా డబ్బు పంపమని. ఆ తల్లీ, కూతుళ్ళు ఆయన్ను బాగా వాడుకుంటున్నారు. వాళ్ళ బంధువుల్లో ఎవ్వరూ వాళ్ళను దగ్గరకు రానివ్వరు. ఈయనే వాళ్ళకు బాగా దొరికాడు. ఒకనాడు ఆయన జేబులో ఆ పిల్ల రాసిన ఉత్తరం దొరికింది. ఏం రాసిందని అడిగాను. ఇదిగో, చేతులోవున్న సిగరెట్టుతో ఇక్కడ కాల్చారు" అని భుజం చూపించింది.

"నోటికొచ్చినట్లల్లా తిట్టారు. ఇంకెప్పుడన్నా జేబులు చూస్తే చేతులు విరగ్గొడతా నన్నారు. నువ్వే చెప్పు ధనలక్ష్మి, నా కేం లోపం వచ్చిందని, నన్నిలా రోజూ హింసించి వాళ్ళను పోషించటానికి నా మనసెట్లా వుంటుంది. ఐనా నేనెందుకు ఓపికగా వుంటున్నానంటావు. ఆ పిల్ల పెళ్ళి కావాలి, అప్పుడైనా ఈయనకు నా మీద ధ్యాస కలుగుతుందేమోనని. అలాగ ధనలక్ష్మి, నేనూ మా నాన్నకు ఇవన్నీ చెబితే ఇంకేమన్నా వుందా చెప్పు. అందుకే నాలో నేను కుమిలి పోతున్నాను. మంచి రోజుల కోసం ఎదురు చూడటం తప్ప మనమేం చెయ్యలేమమ్మా" అంది జయమ్మ కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"మన కర్మ జయమ్మా" అంది ధనలక్ష్మి.

"కాదు ధనలక్ష్మి. నువ్వు తిండి లేక ఏడుస్తున్నావు నిజమే. కాని తిండివున్నా నా గతి ఎట్లా వుందో చూడు. కొన్నిసార్లు అనిపిస్తుంది. ఇట్లాంటి బ్రతుకు ఎందుకు బ్రతకటం. ఏదన్నా జబ్బొచ్చి, తొందరగా చచ్చిపోయినా బాగుండునని. నన్నేం చెయ్యమంటావు చెప్పు. ఎవరితోనైనా ఇవన్నీ చెప్పినా విని నవ్వుకుంటారు. మా నాన్నగారికి ఇది ఇంతో

చతుర

అంతో తెలుసు. కాని ఏం చేస్తాడు? అల్లుణ్ణి అడిగే ధైర్యం లేదు. అడిగినా ఈయన తీసుకుపొమ్మంటాడు. మా నాన్నకు నన్ను తీసుకుపోయి వేరే దారి చూపించే శక్తి లేదు. నేను ఎక్కడా పని చెయ్యలేను. చదువుకోలేను. ఎప్పటికైనా రోజులు బాగు పడతాయని చూడటం తప్ప. ఈయన మరదలి తల్లి వున్నది చూడమ్మా. అదే ఇదంతా చేయిస్తున్నది. వాళ్ళ ఖర్చులకు కావలసిన డబ్బంతా ఈయన్నించి లాగుతున్నది. అందుకోసం కూతుర్ని ఎరవేసింది. ఇది మరెవరోచేస్తే భోగంవాళ్ళపనంటారు. కాని బంధువులే ఇట్లా ఎరలువేస్తే ఏమంటారో? ఎప్పుడో ఒకప్పుడు ఆయన పశ్చాత్తాప పడతాడు. తనను వాళ్ళు మోసం చేశారని తెలుసుకుంటాడు. తను వాళ్ళకింత పెట్టినా రేపు వాళ్ళు తనను రానియ్యరని గ్రహిస్తాడు. వాళ్ళ కళ్ళలో ఈయన లారీ డ్రైవరు మాత్రమే. ఇట్లా ఎరవేసి డబ్బు లాగటం అలవాటైన తర్వాత ఒకడి దగ్గర పడుండలేరు. అప్పుడీయన ఏడుస్తాడు. వాళ్ళకు తన అవసరం తీరంగానే తననుఒదిలేశారని తెలుసుకుంటాడు. కాని అదెప్పుడో. అప్పటిదాకా నేనుండను ధనలక్ష్మి. ఇవన్నీ ఓర్చుకుంటూ నేనుండలేను. ఎప్పుడో చచ్చిపోతాను. నేను బ్రతికున్నన్నాళ్ళు ఆయనకు నా విలువ తెలియదు. కనీసం చచ్చిం తర్వాతన్నా ఓ సారి మంచిగా జ్ఞాపకం చేసుకుంటారు. అంతే చాలు"

"ఇది వరకు ఇదంతా చెప్పలేదే జయమ్మా" అంది ధనలక్ష్మి ఆశ్చర్యంగా.

"ఏమని చెప్పను? నీ కష్టాలు చూసి నువ్వే ఇదైపోతున్నావు. అందరికీ అంతో ఇంతోవున్నాయనిచెప్పాను. మళ్ళీ ఎవరికీ చెప్పకమ్మా. ఆయనకు తెలిసిందంటే ఇవాళే నన్ను చంపేస్తాడు" అంది జయమ్మ భయంగా.

"నేనేందుకు చెబుతానమ్మా. చెప్పను. మామ్మగారేది? ఇంకా పనికెళ్ళి రాలేదా ఏమి? ఈ ముసలి తనంలో బాగనే తిరుగతది. నాకు ఇంత మాత్రం పని దొరికితే సాలు" అంది ధనలక్ష్మి.

"ఇవాళ ఏం వండుకున్నావు ధనలక్ష్మి" అంది జయమ్మ "ఇంక ఏమీ లేదు. నాకు తిండే గండమాయె. ఈ కారటు డబ్బాలో ఏశాస్తనమ్మా" అని లేచింది ధనలక్ష్మి.

ఆమె మనసు పరిపరి విధాల పోయింది. ఎందుకు అంతమాట అన్నానా మొగుణ్ణి అని కూడా ఆమె బాధ పడుతున్నది. కాని ఈ రోజు పిల్లలు ఆరోగ్యంగా వున్నందుకు ఆమె మనసు తేలిగ్గా వుంది. గవర్నమెంటు ఆస్పత్రులంటే ఆమెకు భయం. రెండో పిల్ల డెలివరీకి గవర్నమెంటు మెటర్నిటీ హాస్పిటల్లో వున్నప్పటి జ్ఞాపకాలు ఆమెకు ఆ ఆస్పత్రులంటేనే భయం పుట్టించాయి. అందువల్ల అత్యవసరమైతే తప్ప ఆమె ఆస్పత్రికి పోదు. "నిన్నటి మందు బాగానే వున్నది. అదే యింక రెండు రోజులువేస్త" అని సరిపెట్టుకుంది.



ధనలక్ష్మి రోడ్డెక్కింది.

ఆ రోజు ధనలక్ష్మికి మనుషులు కొత్తగా కనిపించారు. గంపలలో పెట్టుకుని కూరగాయలు అమ్ముకునే వాళ్ళూ, చిన్న చిన్న పళ్ళాలలో తినుబండారాలు పెట్టుకుని స్కూళ్ళ ముందరా, ఫుట్‌పాత్‌ల మీదా కూర్చునే ముసలి వాళ్ళూ, ఇళ్ళలో పనులు ముగించుకుని, యింటి వాళ్ళిచ్చిన కూరలూ, అన్నం తెచ్చుకునే ఆడవాళ్ళూ ఆమెకు కొత్త అర్థంతో కనిపించారు. వాళ్ళతోనే యిక మీదట తన బ్రతుకు ముడిపడి వున్నదని ఆమె తెలుసుకున్నది. ఎవరినైనా పలకరించి తనకూ అలాంటి దారి చూపించమని అడుగుదామనుకుంది. కాని తను యిలాగ తిరుగ గలదా? పని మనిషి లాగ వుండ గలదా? అమ్ముకుంటూ రోజంతా రోడ్డుపక్కన కూర్చోగలదా? ఎంత చిన్న తనం! తనెప్పుడూ వూహించలేదు యిలా ఆవుతుందని. అంతలోనే అప్పులవాళ్ళ తిట్లు జ్ఞాపకం వచ్చాయి. నిరంతరమైన వుపవాసాలు, పిల్లల జ్వరాలు, తిండిలేక [illegible] చదువు, సంధ్యా లేక జీ[illegible] కోల్పోతున్న పిల్లలూ, ఇంచుమించు రోజూ జయమ్మో, మామ్మగారో యిచ్చిన కూరలూ, అన్నం తిని గడిపే బతుకూ— అంతకన్నా యిది సయం. తాను ఆలోచించిన, వూహించిన, వున్నదనుకుంటున్న గౌరవం, మర్యాద అన్నీ తన మనసులోనే వున్నాయనీ, నిజానికి తనది పూటగడవని సంసారమనీ అనిపించింది. ఓ రకమైన మొహమాటం, భయం, సిగ్గు ఆమెను ఆలోచించకుండా చేశాయి. తను నిజ జీవితంలో యింత దరిద్రం, అవమానం భరిస్తున్నా, తన ఆలోచనల్లో మాత్రం యింకా పాతవంశ మర్యాదలూ, అభిమానాలూ అడ్డురావటం అసహజమనిపించింది. పొరబాటు అనిపించింది. అనుభవించలేని మర్యాద, గౌరవం ఆలోచనల్లో భద్రంగా దాచుకుని ఆమర్యాద, గౌరవమే తనకు జైలుగా మారినప్పుడు అవే తనకు తిండి లేకుండా చేస్తున్నప్పుడు తనింకా వాటినంటిపెట్టుకోవటమెందుకనుకున్నది. ఎంత త్వరగా తను పనిలో చేరుతుందా, ఈ ఆలోచనల్నింటి తప్పించుకోగల్గుతుందా అని తొందరపడింది. తన్ను నిర్వీర్యురాల్ని చేసే ఆలోచనలు. జీవిత సంగ్రామానికి అశక్తురాల్ని చేసి కృత్రిమస్వర్గంలో, బూటకపు మర్యాదల్లో, ఆత్మద్రోహంలో వుంచే ఆలోచనలు,



వూళ్ళో ధనలక్ష్మికి దగ్గర బంధువులు లేకపోయినా, పరిచయస్తులైన

తమ కులం వాళ్లు చాలామంది వున్నారు. పనికావాలంటే వాళ్ళ దగ్గర దీనంగా వుండాలని ఆమెకు తెలుసు. అందుకే యిద్దరు పిల్లల్నీ తీసుకుని బయల్దేరింది.

పక్కవీధిలో ఒక గుడ్డల వ్యాపారస్తుడున్నాడు. ఒకసారి వాళ్ళు ఆమెను పేరంటానికి పిలిచారు కూడాను. రాజమహలు లాగవున్న వాళ్ళింటికి ధనలక్ష్మి పెద్ద గేటు గుండా కాకుండా దొడ్డి గుమ్మం ద్వారా పోయింది. అట్టాపోతే వంట యిల్లు, పెరడు వస్తాయి. ఆడవాళ్ళను త్వరగా పలకరించవచ్చు. ఈమె వెళ్ళేసరికి యింటి యజమానురాలు, యిద్దరు కూతుళ్ళూ, పెద్దకోడలూ పచ్చీసు ఆడుకుంటూ కూర్చున్నారు.

"రా.రా. ధనలక్ష్మి. బాగున్నావా ? ఇట్లా వచ్చినవే ? రా. కూసో" అంది యజమానురాలు.

"బాగున్ననమ్మ. ఊరికెనే ఒచ్చిన. పెద్దనాయిన భాగున్నాడా ?" అని అడిగింది ధనలక్ష్మి.

ఆ యింటి యజమానిని అందరూ 'పెద్దనాయినా' అనే పిలుస్తారు.

"ఆం ఏం బాగు. కడుపునొప్పి అట్లనే వున్నది. డాక్టర్లకు మాత్రం పైసలు నీళ్ల ఖర్చయినట్టు ఖర్చయితున్నాయి" అంది యజమానురాలు.

"ఈ పెద్ద పిల్లక్కు గూడ ఈ నడుమ బాగుంట లేదు" అంది ధనలక్ష్మి.

"ఇంత చాయ తీసుకురమ్మని వంట మనిషికి చెప్పవే" అంది యజమానురాలు తన చిన్న కూతురితో.

ధనలక్ష్మికి అది తన కోసమో కాదో తెలియ లేదు. తనకోసమైతే వెంటనే "వద్దు. వద్దు. ఇప్పుడే తాగొచ్చిన" అనేది.

పని మనిషి టీ తెచ్చింది.

యజమానురాలు తీసుకుని, "ఇగో ధనలక్ష్మి ఇది తీసుకో ! పిల్లలకింత తాగిచ్చు" అని రెండు కప్పుల టీ ఆమె ముందు పెట్టింది.

"ఒద్దమ్మా. పిల్లలు తాగరు. నేను గూడ ఇప్పుడే తాగొచ్చిన" అంది ధనలక్ష్మి.

యజమానురాలు మాట్లాడలేదు.

ధనలక్ష్మి తను తాగి, మరో కప్పుతో టీ పిల్లలకు తాగించింది.

వాళ్ళు ఆటల్లో నిమగ్నమైనారు.

ఒక్కసారి వాళ్ళు "కోటయ్య ఏం చేస్తున్నడు?" అని వాకబు చేస్తే తన సంగతి మొదలు పెట్టవచ్చు ననుకుంది. కానీ ఆటలో పడ్డ మనుషులు ఇంటి కొచ్చిన మనిషిని మరచిపోయారు.

కాసేపుండి ధనలక్ష్మి, "ఒక చిన్న పని మీద వచ్చిన పెద్దమ్మా" అంది.

"ఏమి! ఏం కావాలె ధనలక్ష్మి!" అంది యజమానురాలు.

"ఇంట్ల గడుసుడు కష్టమైపోతున్నదమ్మా. అయిన పనేందో, ఆయినేందో- రోజంత తిరిగొస్తడు గని ఇంటికేమి తేడు. అడిగితే కొన్నాళ్ళు ఓర్చుకోవాల్నంటడు. పోనీ, ఆయనకు మంచి పని దొరికిందాకనన్న నేను యాడనన్న పని చేసి పిల్లలకింత పెట్టాలనుకొంటున్న" అంది ధనలక్ష్మి.

"ఏమయింది? కోటయ్య ఒకసారి వచ్చి బాగనే వున్ననని చెప్పిండే. ఏదో చేస్తున్న. నాలుగు పైసలు ఆడుతున్న

యన్నాడు" అంది యజమానురాలు.

"అదేనమ్మా, ఆయనతోని కష్టం మహా అభిమానం మనిషి. ఎవ్వరికీ ఏమి చెప్పడు. ఇంట్ల అంత సరిగ్గనే వున్నట్టు తిరుగతడు. ఇంట్లేమి జరుగుతున్నదో ఇంట్ల మనుషులకు తెలుస్తది. మగాయన అట్ల చెప్పుకోని తిరుగుతుంటే నా అసుంటిది జరుగత లేదని చెప్పినా నమ్మరు."

"ఏమయిందే. ఇప్పుడు అంత కష్టమేమొచ్చింది?"

"ఇదేనమ్మ. ఒక్కనాటిది గాదు. ఎక్కడెక్కణ్ణో అప్పులు చేశిండు..."

"ఆఁఆఁ మా దగ్గర కూడ నూరు రూపాయలు తీసుకపోయిండు. వారం రోజుల్లో యిస్తనని. ఇంకా పత్త లేడు. పోతే పొయినయి. మనోడేనని మళ్ల అడుగలేదు."

"అదేనమ్మ. వాళ్ళందరు ఇంటి మీదికొస్తరు. నన్ను అడుగతరు.అయినేమొ మబ్బులపోతె మళ్ళ రాత్రి దాక రాడు. ఇంట్ల ఒక రోజుంటె రెండు రోజులుండడు. ఏదో, మనోళ్ళిండ్లల్ల ఏదన్న పని దొరికితే జెర ఆసరైతదని."

యజమానురాలు నవ్వింది.

"ఇక్కడేం పనున్నదే. నువ్వు చెయ్యగలిగేటి పనేమీ లేదు."

"అది కాదమ్మ ఏపనన్న చేస్త. ఇప్పుడు మీ పని మనుషులు చేస్తున్న పనే చేస్త. మన ఇండ్లే గద. ఎవరికి చెప్పుకునేదుంది? ఏదో నాలుగు రోజులు గుట్టు చప్పుడు కాకుంట గడుపుకుంట."

"అయ్యో అయ్యో. అదేందే ధనలక్ష్మి. అట్లంటవు. పని మనుషులు చేసే పని నువ్వెట్ల చేస్తవే? ఎంత రోజులు బాగలేకపోతె మాత్రం అవేం మాటలే? కోటయ్యకు తెలిస్తే ఏమంటడు?"

"అన్ని ఆయనకు తెలుసునమ్మ. చేస్తె బాగుండదంటడు. కాని ఆపదొచ్చినపుడు గొప్ప సూసుకుంటె ఎట్ల?" అదీ గాక చేసేవి కూడ మనోళ్ళిండ్లనే గద."

"ఒద్దు ధనలక్ష్మి. నువ్వు అసుంటి ఆలోచనే రానియ్యకు. ఇట్ల పని చేసుడు నీకు మంచిదిగాదు. చెయ్యించుకునుడు మాకు మంచిదిగాదు. పెద్దదాన్ని చెబుతున్న. ఇను. మర్యాద, మంచి అన్ని ఒదులుకోని నువ్వు పని చెయ్యకు. కావలిస్తె కోటయ్యను ఒగసారి ఇక్కడికి పంపించు. ఆయనతోని గూడ సెప్పిస్త."

ధనలక్ష్మికి నోరు పెగల్లేదు.

కాసేపుండి "ఒస్తనమ్మ ఏదో ఊకెనే అడిగిన. ఏమనుకోకున్రి. ఉండబట్టలేక యిట్ల ఒచ్చిన" అంది.

"ఫరవాలేదు పొద్దుమీకింది. భోంచేసి పోదురుగాని ఉండు " అంది యజమానురాలు.

"లేదమ్మా, మళ్ళీ ఒందాలె ఆయనొస్తడుగద'' అంది ధనలక్ష్మిలేస్తూ.

ఆ తెల్లారి ధనలక్ష్మి తమకు తెలిసిన ఒక ఆఫీసరు యింటికి పోయింది. అతను ఈమె కథవిని "ఎక్కడన్నా ఆఫీసులో స్వీపర్ వేకెన్సీలు వస్తే చెబుతాను ఓపిక పట్టు. ఐనా లోకమంటే తెలియనిదానివి నువ్వే తిరుగుడేందమ్మా. ఈ తిరుగుడేదో నీ మొగుడేతిరిగితె సరిపోదా" అన్నాడు.

అలాగ నిర్విరామంగా పరిచయస్తుల గుమ్మాలు ఎక్కి దిగుతున్నప్పుడు ధనలక్ష్మి ఒక ముసలమ్మను చూసింది.

ఆమె కూడా వాళ్ళ బంధువే. ఆ యింటి వాళ్ళతోనే వుంటున్నది గాని వేరే వండు కుని తింటుంది. ఆమె కెవరూ లేకపోవ టంతో ఆమె ఓ రకం స్వతంత్రురాలు. చిన్నప్పుడే విధవైంది. కొన్నాళ్ళు అన్నలవద్ద వుంది. అక్కణ్ణించి వచ్చి యిక్కడ తెలిసినవాళ్ళింట్లో వుంటున్నది. ఎవరింట్లో ఏకార్యమైనా పోతుంది. ఇంటి మనిషిలాగా సహాయం చేస్తుంది. ఏమీ పనులు లేనప్పుడు అప్పడాలు వత్తుకుని కులంవాళ్ళ యిళ్ళలోనే అమ్ముకుని వస్తుంది.

ధనలక్ష్మికి అక్కడ ఆశా కిరణం కనిపించింది. ఆవిడతో తన కథంతా చెప్పుకుంది.

"ఏంచేస్తం బిడ్డా! నీ రాత అట్ల రాసిండు దేవుడు. మొగుడున్నా ముండ రాలివై పోతివి వాడు పెట్టడాయె, నిన్ను సంపాదిచ్చుకోని తిననియ్యడాయె" అంది ముసలమ్మ.

"అదే నాయనమ్మ ఇక ఆయనతోని, ముడిపెట్టుకుంటె అయ్యేటట్టులేదు. నాకు నేనే ఏదో ఒగ సదుపాయం చేసుకుంట. అప్పడాలు చేసి బతుకత నాయినమ్మ" అంది ధనలక్ష్మి.

"ఇదేం బతుకు బిడ్డా. ఏదో ముసలి దాన్ని, కూసుండలేక చేసుకుంటున్న సీకంత యిద్దుంటె ఇక్కడొగ మార్వాడోడున్నాడు. వాడు నూటికి మూడో నాలుగో ఇస్తడట.వానికి చేసి అమ్ముకో. ఇంక ఇద్దర్ని ముగ్గురు ఇట్లగేచేసి వానికి అమ్ముకుంటరు. సూపిస్తలే" అంది.

"రోజుకెన్ని చేస్తవు నాయినమ్మా" అంది ధనలక్ష్మి.

"ఆఁ ఎన్ని బిడ్డా పొద్దుందాక కూసుంటె నూరు నూటయాభై ఐతయి. మీరు ఒయిసోల్లు రొండు నూర్లు చెయ్యరా?"

"ఈ పని చేస్తె నలుగుర్ల పతకుంట వుంటం. ఇంట్ల కూసోని చేసుకుంటు నట్టు గూడ వుంటది. ఏదో పిల్లలు నేను ఒక్కపూటనన్న తింటం."

"పొద్దు మీకింది. రేపు పొద్దున మార్వాడోని దగ్గరికి తీస్కపోయి సూపిస్త. మాయింటికిరా రేపు" అంది ఆమె.

ధనలక్ష్మికి వుద్యోగం దొరికినట్టే వుంది.

ఆమె ఇంటికి రాగానే జయమ్మ చెప్పింది. "ఎవరో ఇద్దరు ముగ్గురు మొగాళ్ళు వచ్చి పోయారమ్మా. తాళం చూసి మళ్ళీ వస్తామనుకుంటూ పోయారు."

"ఇదివరకు రానోళ్లా ?"

"ఏమో నేనైతే చూడలేదు."



**4**

పొద్దున్న లేవగానే రాత్రి మిగిలిన అన్నం పిల్లలకు పెట్టి, "జయమ్మా మామ్మగారు ఇంకా రాలేదు. ఇన్నాళ్ళు ఎక్కడికి పోయిందమ్మా, ఈ యము లోళ్ళు రాకముందే పోత. మళ్ళీ ఎవడన్న

వొచ్చి పురాణం సదువుతడు" అంది ధనలక్ష్మి యింటికి తాళం వేస్తూ.

"మీ అన్న దగర్నించి వుత్తర మొచ్చిందా? ధనలక్ష్మీ?" అంది జయమ్మ.

"ఏదమ్మ ఇంక మూడు రోజులన్న గాక పోయె అక్కడ వాళ్ళకెన్ని పనులో ఏమో. ఆయనకు తీరిక దొరికినప్పుడు రాయాలే. మాకు రోజుకో గండమని పిస్తదిగని వాళ్ళకేమి?" అని ధనలక్ష్మి పిల్లల్ని తీసుకుని బయల్దేరింది.

ఆమె అట్లా వీధి చివరికి చేరేసరికి ఒకతను సైకిలు మీద ఎదురైనాడు.

"ఏమమ్మో నిన్నె, నీ మొగడు న్నడా?" ధనలక్ష్మి అతన్ని గుర్తు పట్టింది. కొత్తలో తను కొన్నాళ్ళు అతని కొట్లో వస్తువులు అప్పుతెచ్చింది కోటయ్య చెపితే.

"ఆయిన ఇప్పుడిక్కడ వుంటలేడు. నేను పిల్లలే వుంటున్నం" అంది ధనలక్ష్మి నడుస్తూనే.

"ఆగవమ్మా. ఎక్కడికి పోతున్నవు! వాడెప్పుడు ఇంట్లో వున్నడని. ఇయ్యాళనేమో కొత్తగా మాట్లాడుతున్నావు?" అంటూంటే.

"మేం పనిమీద పోతున్నము. నువ్వు ఆయిన వుండే దగ్గరికి పో. బజార్ల ఏందయ్యా. నిలబడి మాట్లాడు మంటావు?" అంది ధనలక్ష్మి కోపంగా.

అతడు అక్కడే ఆగిపోయాడు.

అంత గట్టిగా విదిలించినందుకు ఆమెకు సంతోషమైంది. "వీళ్ళను నోరెత్తనియ్యొద్దు" అనుకుంది.

ధనలక్ష్మి ముసలమ్మ దగ్గరికెళ్ళి అక్కణ్ణించి మార్వాడీని కలిసి అతణ్ణి బ్రతిమాలి అప్పడాలకు కావలిసిన సామాను అప్పు తీసుకుని ఇంటి దారి పట్టింది.

"అమ్మా చాన దూరం నడిసినమే కాళ్ళు నొస్తున్నాయి" అంది హేమ. ఆ పిల్లకు జ్వరం తగ్గింది గాని బలహీనంగా వుంది.

"పోదాం బిడ్డా. రిషా మాట్లాడుత. ఇగ మిమ్ములను పస్తులు పండబెట్టను బిడ్డా. మొదట మీకే ఒండి పెడ్త. ఇగ ఫికరు చేయకున్రే. ఎట్లనో ఒకట్ల మనం ఇంత తిని బతుకుదామే. మీ కోసమే గద నే యింత చేసింది. ఇన్ని పడ్డది. ఇగ నువ్వేమడిగిన యిస్తనే" అంది ధనలక్ష్మి వుద్రేకంగా.

ఆ పిల్లకు ఈ మాటలు అర్థం కాలేదు. మూడు రోజుల్నించీ తల్లి వెంట ఇంటింటికీ తిరుగుతున్నది.

"నాయన ఇగ ఇంటికి రాడా అమ్మా?" అంది.

"నేనొద్దనలేదే! తనే రానన్నడు; నేనేం చేయాల్నె ... బెంగ పెట్టుకోకు. ఎన్నాళ్ళు పోతడులే. ఇయ్యాళనో రేపో వస్తడు. మనకు తిండి పెట్టకుండ, సంపాదించుకోనియ్యక సావుషం పెట్లనే. ఇగో అప్పడాలు చేస్తున్న. పైసలొస్తయి. ఇదంత మీ కోసమేనే. నేనేం చేసినా మీ కోసమేనే" అంటుంటె ఆమె గొంతు గద్గదమైంది. అక్కణ్ణించి రిషాలో ఇల్లు చేరేసరికి పొద్దుటి మనిషి గది తలుపుకు జేరగిలబడి నిద్రపోతున్నాడు.

జయమ్మ ఇంటి తలుపేసి వుంది. మామ్మగారు తన గది ముందర గుడ్డ

పరచుకుని పడుకుని వుంది.

ధనలక్ష్మి పిల్లల్ని కిందికి దించి, "జరుగు జరుగు" అంది.

అతను లేచాడు.

"ఒచ్చినవా. దా. దా. నీ కోసమే కూసున్న" అన్నాడు.

బాగా పొద్దెక్కింది. ఆమెకు కడుపులో కాలి పోతున్నది.

"జరుగవయ్యా, ఇంట్లకు బోవాలె" అంది.

అతడు జేబులోంచి చిన్నపుస్తకంతీసి, "ఇగో ఈ లెక్కలు సూడు. నీమొగుడు నూటయాభై ఐదు రూపాయలు బాకీ పెట్టిండు. మొదట తీర్చి యింట్లోకిపో. ఏం-పొద్దున అడిగితె రోడ్డు మీద పాట్లాడానంటావు? బాకీ వున్న ముండలకింత నీల్గుడా? పైసలిస్తేనే నిన్ను యింట్లో అడుగుపెట్టనిస్త. ఇంకెన్నాళ్ళేస్తవు దొంగేశాలు. వాణ్ణడగుతే యింటికి రమ్మంటడు ఇంటికొస్తె నువ్వువాణ్ణడగుమంటవు. నడుమ మేము బేజారు గావాలె?''

ధనలక్ష్మి ఆలోచించింది. ఉద్రేకపడి ప్రయోజనంలేదు. మొదటినించి అంతా చెప్పెయ్యాలనుకుంది

"అయ్యో! నా మొగడు బాకీ వున్నాడు నిజమే. కాని రెండు రోజుల నాడే ఆయన యింట్లనించి పొయ్యిండు. ఆయినకు అప్పు తీర్చే శక్తి వున్నదో లేదో నాకు తెలువదు కని మాకు రొండు పూటల తిండి పెట్టే శక్తి మాత్రం లేదని ఒప్పుకున్నాడు మేం ఆయినతోని తెగతెంపులు చేసుకున్నాం. నా బతుకు నేను బతుకుతున్న. ఇగో. అప్పడాలు చేసి బతుకత, ఒగమ్మ ఈదారి సూపిచ్చింది. దాని కోసం యెన్నిండ్లు తిరిగిన్ననుకున్నవు! ఎవర్నడగినా పని జేయొద్దన్నరు. గని నేను ఇయ్యాలనించి పనిచేస్తున్న. ఆయినచేసిన పాత అప్పుల సంగతి నాకు తెలువదు. ఇగ ఆయిన ఈ యింటికి రాడు. పొయ్యేటోడు పొయ్యిండు. ఈ యిద్దరు పిల్లలను నేనే సూడాలె. ఆయన అప్పుల సంగతినన్ను అడుగకు. ఇప్పుడు ఆయినకు నాకు సంబంధం లేదని చెప్పి పొయ్యిండు. అయ్యో. ఇప్పుడు నేను ఒంటరి దాన్ని ఇంక యిదివరకు తిట్టినట్టు ఎవ్వరు నన్ను తిట్టొద్దు. ఆయిన అప్పులకు నాకు ఏమి సంబంధం లేదు. మీకు మీ అప్పులకు వెయ్యిదండాలు. ఆయనెక్కడ కానొస్తె అక్కడ పట్టుకొని అడుగ్గని. నా దగ్గరికి మాత్రం రావొద్దు" అంది ధనలక్ష్మి వూపిరి బిగపట్టుకుని.

"అట్లనా బాగసన్నదమ్మ. బాగా నేర్పించి పొయ్యిండువాడు. ఎంతమంది తోని యిట్ల చెప్పతున్నావు. ఇది కొత్త రకంఎగ్గొట్టుడా? ఈమాటలుబజాట్ల చెప్పు. ఎవరి మీద వుమ్మేస్తరో తెలుస్తది. నువ్వు వాడు విడిపొయ్యినారు? యాడ విడిపొయ్యిను? ఎవరి ముందల విడిపొయ్యిను? అప్పుల సంగతి నీకు తెలువదా? ఏం మజాక్ ఐందా నీకు? చెప్పినా జెర నమ్మేటట్టు చెప్పు. సరే ఈ ఇల్లు వాడు కిరాయికి తీసుకున్నాడా నువ్వా? ఇంటిదాన్ని అడిగొచ్చిన. అది గూడ ఒస్తన్నది. అన్ని తెల్సుకోని పోతనియ్యాళ్ళ వాసు చెప్పమన్నా

మాటలన్నీ చిలుక చెప్పినట్టు చెప్పు తున్నావు? చిలుక చెప్పినట్టు" అన్నాడు.

అటువంటి తిట్లు అలవాటైనా యిప్పు డామాట ఆమెకు కొరడా చురక లాగ తగిలింది.

"మొకం మీద ఉమ్మేస్త శెరం దప్పినోడా. మంచి చెడ్డా లేదా? ఆడ దాన్ని పట్టుకోని యిష్టమొచ్చినట్టు మాట లనాలనుకుంటున్నావు? నీకు తోడబుట్టి నోళ్ళు లేరా? మంచి తనంగా చెబితె తెలుస్తా లేదా? ఎవ్వనికి అప్పిచ్చినవో వాన్నే అడుగు. నువ్వు ఒగమ్మకు పుట్ట లేదా? అప్పు తీసుకున్నోనికి నాకు యిప్పుడు సంబంధం లేదు. వాడిక్కడి కొస్త లేడు అంటె వినవు. నా బతుకు నేను బతికినా యింక నా సుట్టు గద్దలోలె యిట్ల తిరుగుతరు. నేనెక్కణ్ణించి యియ్యాలె? వాడు నా దగ్గెర ముల్లె పెట్టి పోయిండా? ఆస్తులు రాశిచ్చి పొయ్యిండా? ఏమున్నదని నన్నడుగ తరు? మాకు తిండి పెట్ట లేకనే వాడు పొయె. నేను ఒక్కదాన్నే వున్నా యింక నా యెంట పడ్డరు. నన్ను, నా పిల్లల్ని న రి కి ముక్కలు చేశి పంచుకోని!" అంటె ధనలక్ష్మి ఏడుస్తూ.

శివాజీ, జయమ్మ మామ్మగారు అందరూ చూస్తున్నారు. కానీ ఎవరూ మాట్లాడలేదు. ఆమె గొంతు చీల్చుకుని పెట్టిన కేకలకు భయపడ్డట్టుగా అతడు మళ్ళీ జవాబియ్యలేదు, లోలోపలే గొణు క్కుంటూ—

"నియమ్మ. దొంగముండలు, అప్పులు చేసెటప్పుడు ఈ పతివ్రతల ఏశాలన్ని ఏమయితయో. ఇప్పుడేమో ఏడ్సి బెది రిస్తరు. ఉండుండు నీ పని యిట్లగాదు, అందరిఃముందల ఏడుద్దువుగాని. ఇయ్యాల నిన్ను తోలుబొమ్మనాడించినట్టు ఆడిస్త సూడు" అంటూ అతడు విసురుగా బైటికి వెళ్ళిపొయ్యాడు.

ధనలక్ష్మి ఏడుస్తూ అక్కడే కూల బడింది.

"సూడు మామ్మగారూ, ఫీళ్ల నాయెంట ఎట్ల పడుతున్నరో. నేనింక ఎక్కడికి పోవాల్నమ్మా. ఎక్కడ పడి సావాలె. వాడు నా ఉసురు పోసుకుంటు న్నడు. ఏం చెయ్యనమ్మా, ఇంక ఎంత మందికి జవాబు చెప్పాలె? వాడు పొయ్యిండని చెప్పినా నమ్మత లేరు. నన్ను కాల్చుకొని తింటున్నరు"

ఆమె గొంతుకలో భయం కనిపిం చింది. ఓడిపోతున్నట్టుగా వుంది. కానీ పిల్లలకోసం ఆమె కోడిపెట్టలాగా పోట్లాడ నిశ్చయించుకుంది. వెళ్ళి యింట్లోవున్న కొంచెం బియ్యం పొయ్యిమీద పెట్టింది.

"ఇదిగో ధనలక్ష్మి, ఈ పచ్చడి తీసుకో" అంది మామ్మగారు గుమ్మంలో నిలబడి.

"ఎందుకు మామ్మగారు, రోజు ఏదో ఒగటి యిస్తరు. నా బతుకంత యిట్లనే ఐపాయె" అంది ధనలక్ష్మి.

"అయ్యో... అంత మాటనకమ్మా. ఇందులో ఏం భాగ్యం మునిగిపోయింది? నాకు ఎక్కువైతేనే నీకిస్తూన్నాను. ఒక్కదాన్ని ఎంతని తినను?" అంది మామ్మగారు.

ధనలక్ష్మి అన్నం వుడకగానే పిల్లలకు పెట్టింది. చిన్నదానికి నోరు కడిగించింది.

మిగిలిన అన్నం తను కంచలో పెట్టుకుని కూర్చుంది.

ఆవల సైకిళ్ళ చప్పుడైంది. ఒకటి, రెండు, మూడు...

జనం బిలబిలమంటూ లోపలి కొచ్చారు. ఎల్లమ్మ పెద్దకొడుకు— వాడికి ముప్పై ఏళ్ళుంటాయి— సైకిలు టాక్సీ వాడు, కిరోసిన్ షాపువాడు, మరొకడు ఇందాకా వచ్చినవాడు, కిరాణ కొట్టువాడు. మొత్తం ఐదుగురు.

గది ముందర నిలుచున్నవాళ్ళను చూడగానే చిన్నపిల్ల ఏడుపు లంకించు కుంది. హేమ 'అమ్మా' అంటూ వచ్చి తల్లిని వాటేసుకుంది. ధనలక్ష్మి పై ప్రాణాలు పైనే పొయ్యాను. శివాజీ ఈవలికొచ్చాడు. మామ్మగారు దూరంగా నిలబడ్డది. ఆమె వణుకుతున్నది.

ధనలక్ష్మి లేవ ప్రయత్నించినా లేవ లేకపోయింది. బలవంతంగా పెద్దపిల్లను విడిపించుకుని గోడను పట్టుకుని లేచి నిలుచుంది.

"ఏమే నీ మొగుడు ఇడిసి పెట్టిండా?"

ధనలక్ష్మికి నోరు పెగల్లేదు. ఆ క్షణంలో ఆమె నిశ్చేతనమైంది.

"మాట్లాడే. మొగుడు యిడిశేస్తె చెప్పవే. మేం నీకు తిండిపెడ్తం. ఇంత మందిమున్నం. ఫిన్ను సాకలేమా. నీ మొగడు నిన్నిడిసి పెట్టిండని చెప్పే. వాడు యింటికొస్తలేడా? ఇక్కడ నువ్వు ఒక్కదానివే వుంటున్నావా? నువ్వేమి చేశినా వాడు నిన్నడుగడా? తెగతెంపులు చేసుకున్నావే? చెప్పవే. కిరాయికోసం రాలేదులే మాట్లాడే! ఎప్పటినించి ఒంటరి బతుకు నీది? చెప్పే".

అక్కడ కాలం ఆగిపోయింది. అతడు మరొక్క అడుగు వేసేలోగా ఆమె చేతులెత్తి నమస్కరించింది.

"ఏం మాట్లాడుతున్నవన్నా! ఇట్ల మాట్లాడుడు నీకు న్యాయం కాదు. నీకు పైసలు బాకీ వున్నమన్నా. నీ బాకి తీరుస్తం. ఒక్కమాటయినన్నా, అట్ల మాట్లాడకు. మీరు మంచి చెడ్డ తెలిసి నోళ్ళు. పెద్దోళ్ళు. పొట్ట కూటికి, రొండు ముద్దల తిండికోసం, ఈ పోరలు తిండికి సావొద్దని నేనిట్ల వుంటున్న అన్నో. ఇంకెందుకు గాదు. అంత తెలుసుకోని మాట్లాడన్నా. ఆయన చెప్పిండేమో మీతోని. నేనేమి చెడ్డమాటలు మాట్లాడ లేదన్నో. సచ్చిపోయిన, చితికిపోయిన, కూటికి గతిలేక వున్నా. నా నోటికి చెడ్డమాటలు రావన్నో. ఇన్నేండ్లనించి యింట్ల వుంటున్న. నువ్వెప్పుడన్న నా నోటినించి అసుంటి మాటలు విన్నావా? మీ కాళ్ళు పట్టుకుంట. నేను చెప్పేది యినన్నా. తప్పైతె ఇప్పుడే నన్ను కాల్చి సంపుర్రని అన్నో. ఇగనేను బతుక. నేను బతుక. నా తప్పైతె ఇప్పుడే చెప్పు అన్నో" అంటూ ధనలక్ష్మి అతని కాళ్ళ మీద పడింది. ఆమె జుత్తు రేగిపొయ్యింది. కన్నీరు ధారకట్టింది. కన్నీటి మంట లలో కాలిపోతున్నట్టుగా వుంది ఆమె.

అతను వెనుకకు జరిగాడు. గది ఈ వలికొచ్చాడు.

"బద్మాష్ ముండలు ఇట్లనే మాట్లాడు తరు. వాళ్ళను నమ్మకు. అదంతే. దాంది నోరు గాదు. మొదట తనకు తెలువ దంటది. గట్టిగ మాట్లాడితే ఆడోళ్ళతోని మాట్లాడే తరీఖ ఇదేనా అంటది. అసలు

సంగతేమిటే బద్మాష్ అంటే కాళ్ళమీద పడుతది. దాన్ని ఇడిసిపెట్టద్దు. ఇయ్యాళ్ళ అటో, ఇటో తేలిపోవాలె" అన్నాడు ఇందాక వచ్చినతను.

"ఏమే, నువ్వు బాకీ లేనంటావు? వానికి నీకు సంబంధం లేదంటావు? ఇంటికొచ్చి పైసలడుగొద్దంటావు? ఇన్నాళ్ళు ఎవ్వడు పెడితె తిన్నవే? కోటయ్య కాక ఇంకెవ్వడన్న వున్నడా నీకు? చెప్పవే. అట్లయితె మేమంత వున్నం......"

అంటుంటే మామ్మగారు,

"ఏమిటి బాబూ, ఆ మాట్లాడటం, ఆడదాన్ని పట్టుకుని. అన్నీ మీరే మాట్లాడుతున్నారు. ఆమెనేమైనా చెప్ప నిస్తారా లేదా? ఎందుకయ్యా ఆమె నలా గంటారు. ఇన్నేళ్ళొచ్చాయి" అంది.

"ఏయ్ ఏందే ముసల్దానా. దానికి లేని పౌరుశం నీకేందే. నువ్వు మొదట ఇల్లు ఖాలి చెయ్యి. నీ యింట్ల నువ్వు పడుండక దీని సంగతి నీకెందుకే. అంత ఇదుంటే దాని బాకి నువ్వే తీర్చు" అన్నాడు ఎల్లమ్మ కొడుకు.

"ఏదో బాబూ మంచి మాటే చెప్పాను. నేనేమీ చెడు మాట్లాడ లేదు. ఓ దిక్కు లేని ఆడదాన్ని హింసిస్తే మీకే మోస్తుం దన్నాను" అంది మామ్మగారు. తన గుమ్మంలోనే జారగిల పడుతూ.

"ముసల్దే మంటున్నదో ఇన్నావే? నువ్వు దిక్కులేని దానివట. ఇంత మంది మున్నంక దిక్కులేని దానివెందుకైతవే? నువ్వు దిక్కులేని దానివైతే మేమిన్నాళ్లు అప్పలెందుకిస్తమే. ఉట్టిగానే ఇస్తం"

"బాబూ, నేను చెప్పేది ఒక్కమాట ఇనుర్రి. మీరెన్నన్నా మీదే న్యాయం, విన్న తర్వాత న్యాయమని పిస్తేనే సన్నిట్ల ఒదులుర్రి. లేకపోతే ఇక్కడ్నే ఇప్పుడే చీల్చెయ్యిర్రి. నేను కాదనను బాబో. ఈ అబద్ధం బతుకు బతుకాల్నని నాకు కోరిక లేదు బాబో. అందుకోసమే ఇంత ఇది. నాకు మర్యాదొద్దు, మంచి మాటలొద్దు. సంబంధాలొద్దు. దోస్తానా లొద్దు. మొక మాటాలొద్దు. నేను రొండు ముద్దలు సంపాయించి నా పిల్లలకు పెట్టే సొక్కున్నదా లేకపోతె వాళ్ళు సస్తుంటే సూసుకుంట వూకోవాల్నో చెప్పుర్రి. అంతే బాబూ. ఈ బతుకు నేను అందికే బతుకుతున్న. అంతే గని సుఖాలకోసం గాదు. షోకు కోసం గాదు. తిని బలు వాల్నని గాదు. మేడలు మిద్దెలు కట్టా ల్నని గాదు. సొమ్ములు పెట్టుకోని కులు కాల్నని గాదు. అందరితోని మంచి దాన్నని పిచ్చుకోవాల్నని గూడా గాదు బాబూ నేనీ పని చేస్తున్నది. కేవలం తిండికి. అది గూడ నా తిండి కోసం కాదు బాబూ. కన్నందుకు ఈ పిల్లలకు ఇంత పెట్టాల్నని. బాబూ ఇది మీకు వింతగనే కనిపించొచ్చు. తెగిచ్చినట్టే కనిపించొచ్చు. నేను చెడ్డదాన్నే కావొచ్చు. నా మొగడు మంచోడే కావొచ్చు. కని ఈ ఒక్క చిన్న సంగతి వినుర్రి. విని మీరే తీర్పు చెప్పుర్రి. తప్పైతె ఇప్పుడే ఇక్కడ్నే శిక్ష వెయ్యిర్రి. నేను చేస్తున్నది గూడ తప్పైతె ఈ లోకంల నేనుండను. బాబూ నామొగడు నన్ను పన్నెండేండ్ల నాడు చేసుకున్నడు. చేసుకున్నందుకు ఈ ఇద్దరు పిల్లల్ని తప్ప నాకు ఇంకేమి ఇయ్యలేదు. ఈ పన్నెండేడ్లల్ల పదేండ్లు

మా తండ్రి వుప్పే తిన్నబాబూ. నా మొగుడు నన్నీడికి తెచ్చి రెండేండ్లయితున్నది. ఈ రెండేండ్ల నించీ ఆయన పెట్టిన తిండే మీదెగ్గర చేశిన అప్పు బాబూ. ఈ చీరెలు నాకు మా నాయన యిచ్చినయే. ఈ పిల్లల గౌనులు మా నాయన యిచ్చినయే. ఈ తిండి మీరు పెట్టింది. నడుమ ఆయ నెందుకు బాబూ. తిండి మీరు నాకే పెట్టిన్రి. నా పిల్లలకే పెట్టిన్రు. ఈ యిల్లు ఆయన మా కోసమే కిరాయి తీసు కున్నడు దీని కిరాయి నేనే యిస్తాను. నిజమే బాబూ. ఆయన యిన్నాళ్ళ నించి మీ బాకీ తీర్చలేదు. కాని తీరుస్త నని చెప్పిండు. బాబూ, మీ కన్న నేను ఎక్కువ బేజారై పోయిన. మీరు ధర్మా త్ములు గనక అపిచ్చి యిన్నాళ్లూర్కు న్నరు. అప్పు నాలుగు రోజుల తర్వాత తీర్చినా ఫరవాలేదన్నరు. కాని తిండి కోసం. నేను నాలుగురోజులు ఆగలేను బాబూ. మేం మాడు తున్నం. పిల్లల ఒంటి మీద బొక్కలు తేలినయి. గుడ్లు కండ్లల్ల కొచ్చినయి. నా సంగతి పోనియ్యి బాబూ. నేను బతికినా, సచ్చినా ఒక్కటే వాళ్ళు పస్తులుంటే సూసు కుంట కూర్చోమ్మంటవా ? చెప్పు బాబూ నా మొగడు ఓ ధర్మాత్ముడు. పిల్లలకు తిండి లేదంటే నాలుగు రోజులు ఓపిక పట్టుమన్నాడు. మీరింత ఒచ్చి పైసల డుగుతున్నరంటే విని మరచి పొమ్మ న్నాడు. పిల్లలకు మందులు కావాల్నంటె పైసలొచ్చినంక తెస్తనన్నాడు బాబూ యిదొక్కనాటి సంగతిగాదు. ఈ యింట్ల సంసారం జేస్తున్న రెండేండ్ల సంగతి. పోనీ, తనకు చాతగాకపోతే నేను కూలి జేసి సంపాదిస్తనన్న బాబూ, అట్లన్నం దుకు కోపమొచ్చింది. ఇగ యింటికి రానని పొయ్యిండు. అదే నాతప్పు బాబూ నా తప్పు యింక వున్నది. పోయ్యే టప్పుడు మీ సంగతి ఏం చేసినవని అడగలేదు. అందికే మీరు యిప్పుడు యిట్ల నాతోని మాట్లాడుతున్నరు. కాని, అడిగినా, ఆయనేమి చెప్పేటోడు. ఎట్ల గైన నాకివన్ని తప్పవు. బాబూ యిప్పుడు చెప్పుని. జల్ది చెప్పుని. నన్నేం చెయ్యమంటారు ? నన్ను మీ రేమన్న చేసుకోని. బాబూ

చీల్చుకోని, కాల్చుకోని, మీ యిష్ట మొచ్చినట్టు చేసికోని. కని ముందు నన్ను చంపుని. నా తిండి సంపాదిచ్చు కునే హక్కు నాకు లేనప్పుడు ఇంకొక్క క్షణంగూడ బతుకను" అని ఆమె తలుపు కోడుకేసి తల బాదుకుంది.

"వహ్వా దీన్ని నాటకాలికి పంపిచ్చా ల్లేరా. మనల్ని బేకూఫ్ లనుకుంటున్నది" అన్నాడు ఒకతను.

ఆమె తల చిట్లింది.

"నియ్యమ్మ నిన్న కోటయ్యనేమొ పొద్దున్న యింటికొస్తె యిన్ని పైసలిస్త నన్నడు. ఇంటికొస్తెనేమొ యిది యిట్ల మొదలుబెట్టింది."

"నిన్న చెప్పిండా ?"

"ఆఁ నిన్ననే. లేకపోతె మేము పని లేక నీ మొకం సూడాల్నని ఒచ్చిన మనుకున్నవా ఏం ?"

"అదిగాదురా. ఒకరికొకరు చెప్పు కుంటరు. నేను నీ మీద చెప్పుత. నువ్వు నామీద చెప్పుమని నడుమ మనం తిరు

గాలె. సూసేటోళ్ళకేమొ యిది నీతి మంతురాలోలె కనిపిచ్చాలె. వాడే చెప్పిండేమొ. నేను నాలుగు రోజులు మొకం తప్పిస్త. నువ్వు నన్నిడిసేసి న్నని చెప్పుమని"

"అరె లేకపోతె ఏంది? ఇది పని జేస్తనన్నదట. వాడొద్దన్నడట, ఇది ఒంటరిదైందట. వాని అప్పులు తనకు తెలువదట ఎవరన్న నమ్మ్మతరా యిది?"

"ఇన్నేండ్లనించి వాడు ఈ యింట్ల వుంటున్నడు. సంబంధం లేకపోతే ఇదే యెల్లిపోవాలె. ఏమే కిరాయిచు తీసు కున్నోడు వాడెక్కడ పోతడే? వాణ్ణిడిశి పెట్టె నువ్వేపో. లేకపోతె పాతకిరాయంత నువ్వు కడ్తవా?" అన్నాడు ఎల్లమ్మ కొడుకు.

ధనలక్ష్మి తలొంచుకుని నిలుచుంది.

"ఈ తిక్కతిక్క ఏశాలన్ని మానెయ్యి. అప్పులోల్లు ఒచ్చిన్రను బొక్క లిరగ్గొడ్తరట అని చెప్పు వాడొచ్చినంక. అట్లగాదంటె మళ్ళ మేమొచ్చినప్పుడు యిక్కడ కనిపిచ్చకు" అన్నాడు కిరాణా కొట్టు అతను.

"ఈసారి మళ్ళ చిలుక పలుకులు పలికితె షేం పోతమనుకోకు. నీ సామాను నిన్ను బజార్లోఏశి రోడ్లమీద నీ శిగ్గుతీస్తం జాగ్రత్త."

వాళ్ళు వెళ్ళిపొయ్యారు.

ధనలక్ష్మి రాయిలాగా వాళ్ళు వెళ్ళిన వైపే చూస్తూ నిలుచుంది.

"చూశావుగా ధనలక్ష్మి నువ్వు ఒక్కదానివి వుంటానన్నా వుండనివ్వరు లోకులు. వాడు రాకపోయినా నీదే తప్పంటారు. నువ్వు సంపాదించుకున్నా నమ్మరు. పైగా యిలాగ చెప్పుకుంటే మరింత చులకనైపోతావు. ఎందుకొచ్చిన పంతమమ్మా. ఈ సారి అతడు వస్తే మామూలుగా వుంటానను. నీ పని గిని అంతా మర్చిపో. ఐనా నువ్వేం పని చేస్తావు. అనుకోవటమేగాని అంతా భగవంతుడి మీద ఒదిలేసి కూర్చోవటమే నువ్వు చెయ్యగలిగింది" అంది మామ్మ గారు.

ధనలక్ష్మి మాట్లాడలేదు.

ఆమె కంచంలో అన్నం అట్లాగే ఎండిపోయింది. చిన్నపిల్ల ఏడ్చినప్పుడల్లా యాంత్రికంగా రొమ్ము నోట్లో పెట్టడం తప్ప ఆమెలో ఏ కదలికా లేదు.



బాగా రాత్రైంది. పిల్లలు పడుకున్నారు, నిద్ర రాక ధనలక్ష్మి కూర్చున్నది.

బయట తలుపు చప్పుడైంది.

తలుపు దీస్తే-కోటయ్యా, ధనలక్ష్మి అన్నా నిలుచున్నారు.

"రా అన్నా రా" అంది ధనలక్ష్మి ఆతృతగా.

ధనలక్ష్మి అన్న మాట్లాడకుండా లోపలికి వచ్చాడు వెనకే కోటయ్యా వచ్చాడు.

"కాళ్ళు కడుక్కో అన్నా" అంది ధనలక్ష్మి అంగణం దగ్గరకు దారితీసి

చెంబుతో నీళ్ళు పట్టుకుని.

అతడు రాగానే "ఉత్తర మెప్పుడు ముట్టిందన్నా?" అని అడిగింది.

"పొద్దున. ఇగో దిగి బావను కలిసి నాను. రానురానంటె నా బలవంతం మీద తీసుకొచ్చిన" అన్నాడు అతడు.

ధనలక్ష్మి లోపల్నించి చింకి చాప తెచ్చి వరండాలో వేసింది. కోటయ్యా కూడా కాళ్ళు కడుక్కొచ్చుకుని కూర్చున్నాడు.

ధనలక్ష్మి రెండు గ్లాసులతో నీళ్ళు తెచ్చిచ్చింది.

"పెద్దదాని కెట్లున్నది?"

"ఇప్పుడు జెర తక్కువున్నది. ఒదినె, పిల్లలు బాగున్నరా?"

"అందరు బాగానే వున్నరు, ఉత్తరాలు రాస్తె అట్ల కాలుచెయ్యి ఆడకుంట రాస్తారే, కొంప లంటుకపొయ్యినట్టు" అన్నాడు.

"ఇప్పుడు అంతకంటె ఏమి తక్కువున్నది? అంతా విన్నావా?"

"ఆఁ విన్న. చూసిన నువ్వెట్లగైనా తొందర మనిషివే. నీ పట్టే నీదిగాని అది మంచా చెడ్డా అని ఆలోచించేదే లేదు. ఏం, యింకా చిన్నదాని వనుకుంటున్నావేం? బావను అట్ల తైతక్క లాడిస్తున్నావు. నువ్వు రాశిన సంగతి గూడ బావకు తెలవదట.ఆయనకు తెలువకుంట వుత్తరాలు రాయవలిసిన అవసర మేమొచ్చిందే?" అన్నాడు అతడు.

"ఇక్కడేమైతున్నదో నీకు తెలువదన్నా. ఆయన చెప్పిందే విన్నావుగాని అసలు సంగతి తెలుసుకోలేదు" అంది ధనలక్ష్మి.

"చాలుచాలు. నీకు తెలివెక్కువైంది. ఇట్ల భర్త చెప్పిందానికల్లా కాదంటున్నవు గనుకనే నీ సంసార మిట్లయింది. అతను చెప్పింది తప్పని నువ్వు మళ్ల చెప్పుతవా? ఇదేనా పద్ధతి? మన యిండ్లల్ల ఆడోళ్ళకు భర్త చెప్పినట్టు నడుచుకునుడే తెలుసు గని భర్తను ఎదిరిచ్చి పనులు చేసే అలవాటులేదు. మరి నువ్వు చేస్తున్నవు ఆ పని. ఇన్నాళ్లు నిన్ను పెంచినందుకు మాకు నువ్వుతెచ్చే గౌరవం యిదేనా? ఎవరింట్లోనన్న పని చేస్తనంటావు? బావ యింటికి రానంటె సరే. పో అంటావు. ఇవి సంసారులు మాట్లాడే మాటలా? మా యింట్ల నువ్వు యివ్వే నేర్చుకున్నావే? నువ్వట్ల పని చేస్తె మాకు మంచి పేరొస్తదనుకున్నావా? భర్తతోని తెగతెంపులు చేసుకోని భార్య ఎక్కడుంటదే? నువ్వు యింక చిన్న పిల్లననుకుంటున్నవా? ఇవన్ని ఎక్కణ్ణించి నేర్చుకున్నవే? నీ భర్తకు నాలుగు రోజులు కష్టాలొస్తె ఆయనకు ధైర్యం చెప్పి, సముదాయిచ్చి, ఆయన పక్కన నిలబడతరా లేకపోతే యిజ్జతుతీశి ఆ పని చేస్త ఈ పని చేస్త అని బెదిరిచ్చి మనసు విరిచేస్తరా? అసలే అప్పు లెక్కువయినయని ఆయన బాధ పడుతుంటె నువ్వు యింక నాలుగు మాటలని యింట్లనించి పొయ్యేటట్టు చేస్తావు? ఏమి మనసే నీది? ఐనా తప్పు నీది కాదులే. ఇంత అలుసిచ్చిన బావది. అరె భర్తను ఎంతమాట పడితే అంతమాటంటవా?"

ధనలక్ష్మి నిర్విణ్ణురాలైంది.

"కాదన్నా. కావలస్తె, అగో మామ్మ గారున్నది. ఆమె నడుగు. నీకు తెలువ దన్నా మొత్తం సంగతి తెలుసుకోకుంట మాట్లాడు తున్నవు. ఇగో. దీని గతి చూడు" అని పెద్ద పిల్లను చూపించింది.

"ఉష్, మళ్ల అదేమాట ఐతే నీకు యిరుగు పొరుగుల సాక్ష్యం కావాల్నే? భర్తకు వ్యతిరేకంగ నీవు అందర్నీ సాక్ష్యం తెచ్చుకుంటావే? ఛీ. ఛీ. ఇందు కోసమేనా నువ్వు వుత్తరం రాశింది? బావ చెపుతుంటె నువ్వు నా చెల్లెలి వైనం దుకు తల కొట్టేశి నట్టైందే. నీకేమి నువ్వు బాగనే వుంటవు. నీ ఘనకార్యం ఎంత దూరం పోతదనుకున్నవు.. మన వాళ్ళు ఎక్కడెక్కడున్నారో అందరు నీ పేరు చెప్పుకుంటరు. ఫలానోని చెల్లెలట అని చెప్పుకుంటె తలెత్తుకోలేంది నేనే. నువ్వు మా యింట్లో పుట్టినందుకు మా కింత వుపకారం చేస్తున్నవు! మొగడు తెచ్చింది తిని యింట్ల వుండలేని ఆడది కూలి పని చేశి బతుకుతదట. ఇంకేమి, రాసింది చాలక వాదిస్తున్నవు గూడ. శభాష్ చెల్లే! నీపేరు నాలుగు కాలాలు చెప్పుకుంటరులే. నువ్వు పుట్టినింటికి, మెట్టినింటికి కీర్తి తెచ్చే పని చేస్తున్నవు. చెల్లే చాలు. చాలు. ఇంతదూరం ఒచ్చి నందుకు నాకు మంచి పాఠం చెపుతు న్నవు. చిన్నపిల్లలు, ఇంక పెండ్లి కావ లశినోళ్ళు నిన్ను చూశి నేర్చుకుంటా రులే."

"అది గాదన్నా నువ్వు చెప్పింది వింటను గని నా సంగతి విను. ఎన్నాళ్ల నించి ఒక్క పూట తింటున్నమో అడు గన్నా. ఎంతమంది ఇంటి చుట్టు తిరిగి పోతున్నారో అడుగు. పిల్లకు రోగ మొచ్చిదంటే డాక్టరేమన్నడో అడుగు. నాకేం యింత మందిని యిది చెయ్యాలని లేదు. అందికే ఏమన్న ఆధారం సూపిచ్చుమని నీకు రాస్తి"

"ఛీ.ఛీ. మళ్ళ తిండి తిండి అంటవు. కులంల పుట్టినోళ్లు తిండిలేక సావరే, మర్యాదకు ప్రాణమిస్తరే. మన వంశంల ఎవ్వరు తిండి లేదని కూలి పని చెయ్య లేదే. ఉన్ననాడు తిన్నరు. లేనినాడు పస్తులున్నరు. గని ఎవ్వరు యిట్ల ఉత్త రాలు రాసుకోలేదు. సుట్టు పక్కలోళ్ళకు చెప్పుకోలేదు. మొగణ్ణి ఎదిరిచ్చి ఎల్లి పొమ్మన లేదు. నువ్వు మా వంశంల చెడ బుట్టినవే. నన్ను పైసలియ్యమని రాశి బెదిరిస్తావు? ఇయ్యకపోతే కూలి పని చేస్తనంటావు? చెయ్యవే. కూలి పని చెయ్యాలని అంత కోరికున్న దానివి ఇంక ఉత్తరమెందుకు రాశినవే? నీకు ఎట్లనన్న రోడ్ల మీద తిరుగుదామని వున్నది. ఒక ఇంట్ల వుండే మనసుకాదు. కనీసం ఇట్లనన్న నాలుగిండ్లు తిరుగొచ్చు ననుకుంటున్నవు. ఇంట్ల వుండే ఆడిది ఇట్లుండదే. దానికిన్ని ఆలోచనలు రావు. నువ్వా, నీకు మెదడు నిండ ఇవ్వే ఆలో చనలు ఎప్పుడు ఏ మోక చూసి రోడ్ల మీద పడుదామా అని. పో, మరి నేను చెపితే ఇంటావా ఏమన్ననా?"

ధనలక్ష్మి ఎప్పుడో జవాబివ్వటం మానేసింది. అంతా విని,

"అన్నా నువ్వే చెప్పు. నేను నీకన్న చిన్నదాన్ని. మీ యింట్లనించి ఒచ్చిన దాన్ని. తప్పుచేశిన. ఈ ఒక్కసారికి

క్షమిచ్చు. నువ్వేమి చెయ్యమంటె అదే చేస్త. ఇక నువ్వు గీసిన గీటు దాటితె అప్పుడను" అంది.

"గిరిగీసేది నేను గాదే. నీ భర్త. నువ్వు రాస్తె నీ మేలుకోరి వచ్చిన. అంతేగని నిన్ను ఆజ్ఞాపించేది గిరిగీసి గిరిలో వుంచేది, పోషించేది, శిక్షించేది, క్షమించేది అంతా నీ భర్తే. నువ్వు ఏమడిగినా నీ భర్తనడుగు. నీ భర్త యిష్టంతోని నువ్వేమన్న చెయ్యి. ఒద్దంటె మానెయ్యి. నాకు కావలిసింది అంతే."

ధనలక్ష్మి మాట్లాడలేదు.

"చూడు. బావకు నేను గ్యారంటీ యిచ్చి తీసుకొచ్చిన. నా చెల్లెలు అసుంటిది గాదు. నిన్ను బాధపెట్టదు. నువ్వు ఎట్ల ఏలుకుంటె అట్ల పడుంటది. అని చెప్పి తీసుకొచ్చిన. మరి నా పరువు కాపాడుడు, నీ భర్త పరువు నిలబెట్టుడు అంత నీ చేతిల వున్నది"

"నువ్వు చెప్పినట్టే నడచుకుంట నన్నా" అంది ధనలక్ష్మి.

"చెల్లే అట్ల మాట్లాడు తల్లీ, భర్త ఆజ్ఞల వుంటనని, కష్టసుఖాలల్ల ఆయనను విడిచి పెట్టనని చెప్పే. నీ బాగు నీ పిల్లల బాగు అంత ఆండ్లనే వున్నదే. ఐందేదో ఐంది. ఇగనించన్న బుద్ధి తెచ్చుకో. నీ అప్పడాలు గిప్పడాలు అన్ని కట్టిపెట్టు. బావను యింక నామర్దపాలు చెయ్యకు."

"ఇయ్యాలనే తీసుకొచ్చిన. ఆ సంగతెవరు చెప్పిరి?" అంది ధనలక్ష్మి ఆశ్చర్యంగా, తన్నమీద యింతమంది కన్నేసి వుంచారని తెలియకుండా.

"ఆఁ. ఆ. నువ్వు యిన్నాళ్ళసించి ఎవరెవరిండ్లకు పొయ్యినవో, ఏమి మాట్లాడినవో, వాళ్ళేమన్నరో, అన్ని తెలుసుకొనే ఒచ్చిన. నేను యిప్పుడు చెప్పేదేమంటె యిగ యిసుంటి మర్యాద తక్కువ పనులు చెయ్యకు. నిన్ను పెంచి నోళ్ళకు, కట్టుకున్నోనికి మర్యాద తెచ్చే పనులు చెయ్యి. నా మాట కాదని మళ్ళ ఏమన్న చేస్తివా యిగ నీ యిష్టం. గని మళ్ళ నాకు వుత్తరాలు రాయకు. బావకు కూడ చెప్పిన. చెల్లే ఏమిచెప్పినా మీ మంచికే చెప్పుతమే! మీ సంసారం బాగుండాలనే యిన్ని చెప్పిన. జెర నెమ్మదిమీద ఆలోచించు. ముందు వెనక చూసి చెయ్యి. బావతోని అట్ల యిష్టమొచ్చినట్టు మాట్లాడకు. మొగోని మన సిరిగితె సంసారం పెంటమీదకొస్తది. ఆయనను జాగ్రత్తగ సూసుగో. ఆయన తోనే నీకు లక్ష్మి. ఆయనతోనే నీకు ప్రపంచం. ఆయనను కాదని నువ్వు ఏ పనిచేశినా నెగ్గవు. అంతేగాక అందరికి తలవంపులు తెచ్చిన దానివైతవు."

ధనలక్ష్మి మరోసారి,

"నువ్వు చెప్పినట్టే వుంటనన్నా" అంది.



మర్నాటి వుదయం కోటయ్య పెందరాలే స్నానం ముగించుకుని బజారుకెళ్ళి యింట్లో కావలసిన సామానంతా తెచ్చి పడేశాడు. విరామంలేని వంట చెయ్యటం

తన సంసారంలో అది మొదటి రోజు ధనలక్ష్మికి. ఆ రోజు యింట్లో అందరికీ పండగ భోజనం.

ధనలక్ష్మికి కలలోవున్నట్టుగా వుంది. ఎక్కడో ఏదో మారిపోయింది. ఆమె యిది నమ్మలేక పోతోంది. ఆ రోజు కోటయ్య కులాసాగా తిరిగాడు. ధనలక్ష్మి కూడా సిగ్గుపడింది. ఎన్నడూ లేనంత సుష్టుగా భోజనం చేశారేమో, కునుకు పట్టేసింది మధ్యాహ్నం కోటయ్య సంచిలోని షర్టూ, పాంటు సబ్బుపెట్టి పిండింది. అప్పుడు జేబులు చూస్తే అందులో నాలుగైదు లాటరీ టికెట్లు. కొంత చిల్లర కనిపించాయి. కోటయ్య ఆదుర్దాగా "టిక్కట్లు జాగ్రత్త" అంటూ అవి తీసుకుని భద్రంగా తన పాంటు జేబులో పెట్టుకున్నాడు.

సాయంత్రం ధనలక్ష్మి అన్న చెల్లెలి చేతిలో ఐదు రూపాయలు పెట్టి పిల్లలకు చెరో రూపాయిచ్చి,

"అట్ల నవ్వుకుంట వుండే. లోపల దిగులు పెట్టుకోకు. అప్పలోళ్ళు యింటి ఛాయలకు రారులేయిగ" అని చెప్పి ఊరికెళ్ళి పోయాడు.

ఆ తర్వాత కాసేపటికే కోటయ్య గూడ బయటికి జారుకున్నాడు.

ధనలక్ష్మి ఆప్యాయంగా కోటయ్య పాంటు చిరుగులు కుట్టటం మొదలు పెట్టింది.

"మీరు అట్లా వుండటమేనమ్మా మాక్కావలిసింది" అంది మామ్మగారు.

"ఏదో మామ్మగారూ ఇప్పటికన్నా రోజు లిట్లా గడుస్తేచాలు. దేవునికి ప్రతి శనివారం కొబ్బరికాయ కొట్టుకుంట" అంది ధనలక్ష్మి.

రాత్రి కోటయ్య వచ్చేటప్పుడు పిల్లలకు రబ్బరు బొమ్మలు కొనుక్కొచ్చాడు.

ధనలక్ష్మికి అంతా సంతృప్తే.



## 5

మామ్మగారికి అనారోగ్యంగా వున్నది.

మొదట జలుబు చేసింది. తరువాత ఫ్లూ ఐంది. రెండురోజులు జ్వరం మండి పోయింది. ఒళ్ళంతానొప్పులు, మూల్గులు. లేచి కూర్చునే శక్తి లేదు.

జయమ్మే మామ్మగారికి పాలుతెచ్చి, వెచ్చబెట్టిస్తుంది.

"మామ్మగారూ, ఎన్నాళ్ళిట్లా పడుకుంటారు. జ్వరం తగ్గదాయె. రెండు పూటలు మందు తెచ్చుకోండి" అంది జయమ్మ.

"ఒద్దమ్మా. మందొద్దు. మా కొద్దు. అదే తగ్గుతుందిలే" అంది మామ్మగారు.

అసలే చలికాలం. అందులోనూ జ్వరం. వణుకు. ఒక రోజు రాత్రి జ్వరం మరీ ఎక్కువైంది. మనిషి లేచి లేచి పడింది. కప్పుకోవటానికి సరిగ్గాలేవు. జయమ్మ తన పక్క గుడ్డలు యిస్తానంటే తీసు

కోలేదు. తనవే పాత గుడ్డలు, చీరెలు అన్నీ కప్పుకుంది. కానీ వణుకు ఆగ లేదు. పక్కనున్న ఓ ఆర్.ఎం.పి. డాక్టర్ను తెచ్చి చూపించాడు శివాజీ. అతడో యింజక్షనిచ్చి పోయాడు. తెల్లారి మామ్మగారు ఒక్కటే విసుక్కుంది.

"ఎందుకు, నాయనా పోగాలానికి ఈ మందులు. ఇంతవరకు నేను సూది తీసుకోలేదు. ఈ రోజు తీసుకోవలసి వచ్చింది" అని, అంత జ్వరంలోనూ మడి, స్నానాలు, కాఫీ తప్ప మరేం ముట్టలేదు.

"మామ్మగారూ, ఇక్కడ మీ తమ్ముడున్నాడేమో. అక్కడికి పోనిద్రెండు రోజులు" అంది ధనలక్ష్మి.

"ఒద్దమ్మా, వాడి సంసారం వాడిది. ఆరుగురు పిల్లలతో దానికి వాళ్ళకు చేసుకోలేకనే యిదవుతుంది. ఇంక నాకెక్కడ చేస్తుంది. ఐనా అసలే దానికి నన్ను చూస్తే పీకలదాకా వొస్తుంది. పిల్లల్ని పలకరించటానికి పోతేనే ముఖం చాటు చేసుకొని తిరుగుతుంది. నేను యీ స్థితిలో పోతే యింకేమన్నా వుందా?"

"అయ్యో! అదేమిటి మామ్మగారూ, మీరు వాళ్ళకు డబ్బిస్తూనే వుంటారు- తమ్ముడు, తమ్ముడు అని అంత కలవరిస్తారు. ఒకసారి పోతే అంత తప్పేమిటి!" అంది జయమ్మ.

"నేన్నెంత యిస్తానమ్మావాడికి... వాడికి సరిగా చదువబ్బలేదు. ప్లీడరి గుమాస్తా చేస్తున్నాడు. ఆ డబ్బులతో ఏం గడుస్తుంది. పిల్లల చదువులాయె. గుడ్డలాయె. ఈ కరువుకాలంలో ఏం సరిపోతుంది. అందుకని యిక్కడా అక్కడా వంటచేసి ఆ నాలుగు రాళ్ళు వాడికిస్తే ఏదో వేణ్ణీళ్ళకు చన్నీళ్ళన్నట్టు వుంటుంది. ఐనా యింకా నాకెవరున్నారమ్మా. ఒక్కదాన్ని ఈ శ్శో పడుంటే ఎక్కువే మొస్తుంది, వున్నొక్కణ్ణీ యిక్కడ వదిలేసి. నాకున్న ఆ మూడెకరాలూ వీడికే యిచ్చాను. అదమ్మి యిక్కడో యిల్లు కొనుక్కున్నాడు. కాని నాఖర్మ. యిప్పుడేమొ వీడి పెళ్ళాం నన్ను యింటికే రానియ్యదు- ఐనా నేనుపోతే ఎంత, పోకపోతే యెంత. వాడూ, వాడి పిల్లలూ సుఖంగా వుంటే చాలుననుకొని ఊళ్ళో పడుంటే, "ఒక్కదానివీ యిక్కడే ముందని వుంటావే." అని నన్నిక్కడికి తీసుకొచ్చి ఆ యిల్లు కూడా అమ్మేసుకుని నన్ని అద్దె కొంపలో తగలేశాడు. నేను వంట చేసి నాలుగు రాళ్ళు వెనకేసుకోగానే వాడొచ్చి పట్టుకుపోతాడు. నలుగురికేమో సంపాదించినట్లే కనిపిస్తుంది కాని నాకు నేనేమో యింత దరిద్రురాల్ని."

"పోనివ్వండి, మామ్మగారూ మీరు మాత్రం ఎవరికి పెడుతున్నారు. తమ్ముడికేగా. అతడైనా మిమల్ని జ్ఞాపకం చేసుకుంటాడు" అంది జయమ్మ.

"అట్లా అనుకునే పడుంటున్నానమ్మా. ఆ వెధవ మొన్ననే వచ్చి యిరవై రూపాయలు దాచిపెట్టుకుంటే పట్టుకుపోయాడు. యిప్పుడేమో కాఫీ పొడి ఐపోయింది కొనుక్కోవాలన్నా డబ్బులేదు. నా దగ్గర రేషన్ కార్డుంది.

చతుర

దాసమీద చక్కెర, గోధుమలూ తెచ్చి పెట్టాలి. సరే తెస్తానుగాని డబ్బులిచ్చి పోరా అంటే లేవంటాడు. నేను తేకపోతే అయ్యో అయ్యో రేషన్ పోగొట్టావుగదే. ఆ మాత్రం నమ్మకం లేదా నా మీద అంటాడు".

"ఆఁ. ఇంతచేసినా ఆపదొస్తే మీ గతి మీరే సూసుకోవాలె. రెండు రోజులుగా చేసేటోళ్ళే లేరాయె" అంది ధనలక్ష్మి.

"వాడు మంచివాడేనమ్మా. వాడికి యింతో అంతో పెద్దదాన్ననే జ్ఞానం వుంది. వాడి పెళ్ళామేనమ్మా పెద్ద గయ్యాళి. నా డబ్బు తీసుకుంటుందిగాని నా నీడ పనికిరాదు దానికి".

"పోనీ మీ తమ్ముడికైనా యింగితి ముండొద్దుటండీ, మీరు పోనప్పుడు మీ డబ్బెందుకు తీసుకోవాలి? పెళ్ళాంతో ఆ మాట చెప్పొచ్చుగదా" అంది జయమ్మ.

"ఏదోనమ్మా, సంసారం, డబ్బు కావాలి. ఇంట్లో వెచ్చాలు సరిపోకపోతే అది వాణ్ణి మొట్టుతుంది. వాడు నా దగ్గర లాగుతాడు. ఎన్నాళ్ళు తింటాడులే. నేను మాత్రం ఎన్నాళ్ళు చేస్తాను" అంది మామ్మగారు.

"అది సరే మామ్మగారూ మరి మీరు యిలా లేవలేకపోతే చేసేవాళ్ళు లేరాయె. మీరేమీ వెనకేసుకోకపోతే రేపు ఎట్లా గండీ?" అంది జయమ్మ.

"ఏమిటో, అంతా ఆ భగవంతుడే చూస్తాడు" అంది మామ్మగారు నిర్లిప్తంగా.

ముగ్గురాడవాళ్లూ మధ్యాహ్నం తీరిగ్గా కూర్చున్నారు. ధనలక్ష్మి చీర చిరుగులు కుట్టుకుంటున్నది జయమ్మ శివాజీ గుడ్డలు ఇస్త్రీ చేస్తున్నది.

"జయమ్మా, నీకు కందిపప్పు పెట్టాలె. మళ్ళసారి తెచ్చినపుడు పెడ్త" అంది ధనలక్ష్మి.

"ఫరవాలేదులే. మీరు కటకట లేకుండా వుంటే అంతే చాలు. ఓ పిడికెడు పప్పుకేం భాగ్యం?" అంది జయమ్మ.

"ఏమో మాది ఒక్కనాటి సంగతా ఏమన్నా. ఆ ఒక్కరోజు అన్ని సామాన్లు అది అర్ధపావు, ఇది పావుసేరు తెచ్చిండు. వారం రోజులాయె. అవ్వే దాచిపెట్టి ఒండిన. మళ్ళ సామాను మా లెత్తుతలేడు."

"చెప్పినావా సామాను అయిపోయిన దని?"

"ఆఁ చెప్పిన. ఒకసారిగాదు మూడు సార్లు. అయినా ఇది జరిగే సంగతికాదు జయమ్మా"

"ధనలక్ష్మి అట్లనకు. ఆడదానికి ఓపిక కావాలమ్మా. మనకు కోపాలొచ్చి లాభంలేదు తల్లీ, మంచికైనా, చెడ్డకైనా మొదట మననే వేలెట్టి చూపిస్తారు" అంది మామ్మగారు.

"నేను అదే అంటున్నాను మామ్మగారూ, ఏదో జరుగుతున్నది జరుగనీ. మీ అన్న వచ్చాడుగదా ఏదన్నా దారి చూపించాడేమో" అంది జయమ్మ.

"పనికి పెయ్యి ఒంచని మనిషి. అయనను ఎవరు బాగుచేస్తరు జయమ్మా, ఆవారా తిరుగుడుకు అలవాడు పడ్డడు" అంది ధనలక్ష్మి.

"ఏమో అట్లా అనకు, మీ రోజులు బాగుపడ్డాయి ధనలక్ష్మి, అప్పుడు మీ

ఆయన చెప్పాడేమో తనకు శని పట్టు కున్నదని, అది పోయిందిలే యిక" అంది జయమ్మ.

"పోలేదమ్మా పోలేదు, ఆయనకు నేను శని. నాకు ఆయన శని. జయమ్మా, నా మన సెట్టున్నదనుకున్నవు. కాలిపో తున్నది. నేను మొండిదాన్ని జయమ్మా. ఇంత మందితోని యిన్ని తిట్లుతిని యింక బతికున్న. నేను మనిషిని కాను. నాకు నేనేశని. అదిగాదు జయమ్మా ఆయనకు అప్పులు చేస్తె యిజ్జతుపోదు. తిట్లు తింటె యిజ్జతుపోదు. పిల్లలు సస్తె యిజ్జతు పోదు. నేను పనిచేస్తెనె యిజ్జతుపోతది. వీళ్ళేం మనుషులో. నన్ను బతుకనియ్యరు సావనియ్యరు. పీనుగ వున్నట్టు వుండాలె నోరెత్తొద్దు. వాళ్ళకు పరువున్నదిగని నాకు పరువు లేదు.

"అట్లా అనకు ధ న ల క్ష్మి, నీ మొగుడి పరువొకటీ, నీ పరువొకటీనా" అంది జయమ్మ.

ధనలక్ష్మి నవ్వి,

"ఔనులే. ఆయినను చేసుకున్నప్పుడే నా పరువు పోయింది. ఆయనకు లేని పరువు నాకెందుకు? పోసి, ప్రాణమన్న నాదా? అది గూడ ఆయనదేనా?"

"ఏమో ధనలక్ష్మి నువ్వు విచిత్రంగా మాట్లాడుతావు. ఇన్ని వాదనలు మగా ళ్ళకు కోపం తెప్పించవా ? అందుకే అతడు నీ మీద అలా విసుక్కుంటాడు" అంది జయమ్మ.

"అవునవును. తిండి పెట్టెటందుకు కా క పో యి నా తిట్టెటందుకన్న ఒక మొగడు గావాలె నాకు. అందికే నాకర్మ యిట్లఋంది. నేను ఏ పిట్టనో, పురుగునో అయితే బాగుండు. వీళ్ళెక్కడి మను షులో. మా కులపోళ్ళకు నాదే తప్పు. నా అన్నకు నాదే తప్పు. అప్పులోళ్ళకు నాదే తప్పు. ఆఖరికి నీకు గూడ నాదే తప్పనిపిస్తున్నాది జయమ్మా" అంది ధనలక్ష్మి.

"అలా అనకు ధనలక్ష్మి. నేను నీది తప్పు అ న లే దు. ఒప్పు అనలేదు. నా కెందుకమ్మా ఒకరి విషయాలు. ఇన్ని మాట్లాడానని తెలిస్తే ఇంకేమన్నా వుందా. మా ఆయన నన్ను నిలువునా చీరేస్తాడు" అంటూ జయమ్మ లేచి గది లోకి వెళ్ళిపోయింది.

కో ట య్యా రెండు రోజులనించీ యింటికి రాలేదు. సామాను నిండుకుంది. తెల్లారే మళ్ళీ యథాప్రకారమే.



వీధి తలుపు దబదబ చప్పుడు కావ టంతో ధనలక్ష్మి ఉలిక్కిపడి లేచింది.

"కోటయ్యా ఓరి కోటయ్యా తలుపు దియ్యరా'' ఎల్లమ్మ గొంతు. బహుశా ఆ వీధి వీధంతా లేచి వుండాలి. అంత బిగ్గరగా అరుస్తున్నది ఎల్లమ్మ. కోటయ్యా రాత్రి యింటికి రాలేదు. టైమెంతయిందో తెలియదు కాని పోలీస్ టౌను లో పన్నెండు గంటలు కొట్టటం ఆమెకు జ్ఞాపకం వుంది. అప్పటిదాకా ఏమీ తో చ క, మామ్మగారికీ నిద్రపట్టక

మాట్లాడుతూ కూర్చున్నారు. పడుకుని ఎక్కువ సేపు కాలేదు. మహా ఐతే రెండైందో లేక మూడో. అంతే. ఎల్లమ్మ యిప్పుడెందుకు మెలకువగా వుందో-ఎందుకింత రాత్రి యింటి మీది కొచ్చిందో-ఎందుకిట్లా అరుస్తుందో ధనలక్ష్మికి అంతు పట్టలేదు.

తలుపు తియ్యాలన్నా భయమేసింది. బహుశా తాగి వచ్చిందేమో. ఈ స్థితిలో తలుపు తీస్తే ఎంత అరుస్తుందో ఏం చేస్తుందో-

"తియ్యవమ్మా. అది తలుపులు విరగ్గొట్టేట్టుంది" అంది జయమ్మ.

ప్రాణాలు బిగబెట్టుకొని సందులోకి నడిచితలుపు చేరుకుంది ధనలక్ష్మి.

"పెయ్యి తెలువకుంట పండుకున్నావురా. తలుపు దియ్యిరా. కిరాయి కక్కుముండా కొడుకా"

ఎల్లమ్మ అరుస్తున్నది.

"ఓ ఎల్లమ్మా ఏమిటా అరుపులు. మమల్ని నిద్ర పోనిస్తవా లేదా!" అంటూ పక్కింండ్ల వాళ్ల మాటలు.

"ఏం జెయ్యాలె బిడ్డా నా సవతి కొడుకున్నడు యింట్ల. వాని మొకం సూశి పోవాల్నని ఒచ్చిన".

ధనలక్ష్మి తలుపు తీసింది.

ఎల్లమ్మ కాళిక లాగుంది

"ఏమే నా కొడుకేంజేస్తున్నడు? బాగ పండు కున్నడా? బాడకావును లేపవే. ఎవ్వని సొమ్ము తిని పన్నదే నా యింట్లో?"

"ఆయన రాత్రి ఇంటికి రాలేదు పెద్దమ్మా" అంది ధనలక్ష్మి.

"నీ పెద్దమ్మ యింట్ల పీనిగెల్ల. నీ ఒరుసల్ఖు తగలబడ. నువ్వు నా బిడ్డవానే? సిగ్గు, సెరం లేని దానా కిరాయి లేకుంట యింక యాడ పండుకోని స్తరే? బజార్ల పండుకున్నాడా? నీ మొగని దగ్గరికే నువ్వుపోరాదె. నువ్వెందు కున్న వీయింట్ల"

"ఆయిన రాలేదు పెద్దమ్మా, బైట నిలబడి ఎందుకు మాట్లాడు తున్నవు, యింట్లకు రారాదు" అంది ధనలక్ష్మి. ఆ రాత్రి కూడా తెరచుకున్న యిరుగు పొరుగుల తలుపుల్ని చూసి

"సిగ్గాస్తున్నాద బిడ్డా. ఇంట్లకొస్తె నీ దగ్గర ఏమున్నదే పద" అని ధనలక్ష్మిని తోసుకుంటూ పెద్ద పెద్ద అంగలతో యింట్లో కొచ్చింది ఎల్లమ్మ.

"ఆ ఆడిబట్ల ముండాకొడుకును పంపిచ్చి నువ్వేం చేస్తున్నవే ఈశ. వాడు పొద్దునొస్తె పొద్దునుండడు. రాత్రి వుండధు. ఆఖరికి ఈ రాత్రి ఒచ్చినా లేకపాయె. అసలు యింటికొస్తున్నడా? నిన్నడ్డం పెట్టుకుని నాటకమాడు తున్నాడు. నువ్వేమొ యిట్ల లేడు. రాలేదు. అని ఒగలు పోతవు. ముండా, ఇప్పుడే నడువు బయటికి. నడువే- బద్మాశ్" అని ఎల్లమ్మ లోపల పడుకున్న హేమను బరబరా బైటికీడ్చింది. ఆ పిల్ల పెద్దగా కేక పెట్టింది భయంతో. ఎల్లమ్మ గొంతు యింకా పెంచి.

"పో ముండా ఏడిస్తే నీ మెడకాయ యిప్పుడే పిసికేస్త. ఇంట్లో నించి యిప్పుడే పోన్రి. ఒక్కసారి అంటే లేదంటివి. రొండుసార్లు లేదంటివి. ఎన్ని సార్లు అడగాల్నె నిన్ను? బజార్ల పండు

కోవే. బజారు ముండా-" అని ఎల్లమ్మ మళ్ళీ లోపలికి పోతుంటే- ధనలక్ష్మి కి కాళ్ళు పట్టు తప్పినై. ఎవరో కొట్టేసి నట్టుగా ఎల్లమ్మ కాళ్లకడ్డం పడి.

"ఓ పెద్దమ్మా ఒక్కనిమిశమాగు. నీ పైసలన్ని తీరుస్త గని యిట్ల ఎల్ల గొట్టకు. నీకు పుణ్యముంటుంది. నన్ను ఒక్క మాట చెప్పనీ- పెద్దమ్మా, సచ్చి నీ కడుపున పుడుత. పెద్దమ్మా, ఇట్ల చెయ్యకు" అంటూ కాళ్లు పట్టుకొని పెద్దగా అరిచింది. కాని ఎల్లమ్మ అప్ప టికే ఆవేశంలో వుంది. మాటకు పది సార్లు 'ముండా' అంటూనే ధనలక్ష్మి జుట్టు పట్టి పైకి లేవదీసి "చెప్పే ఏం చెప్పతవు. మొదట నా కిరాయి గట్టి చెప్పే. అప్పుడే యింట" అంది.

"ఇస్తను. ఎట్లనన్న నీ పైసలిస్త. నీ యింట్ల పనిచేసి నీ అప్పు తీరుస్త. ఇప్పటినించీ పనిచేస్త. నా కేదన్న పని సూపిచ్చి పుణ్యాం కట్టుకో. నువ్వెక్కడ ఏ పని చెయ్యమంటె ఆ పని చేస్త. చెయ్యకపోతె నా మెడ నరుకు. నన్నెళ్ళ గొట్టకు పెద్దమ్మా. మేం బజార్ల వుండ లేము. నా పిల్లల మొకం సూసి పనిప్పిచ్చు పెద్దమ్మా మమ్ములను మాడి పోనియ్యకు నువ్వే దిక్కు."

ఎల్లమ్మ గొంతు చాలా పెద్దది. కాని ఈ క్షణంలో ధనలక్ష్మి గొంతు దాన్ని మించిపోయింది. ఆమె రూపం ఎంత దీనంగ్గా, దయానకంగా వుందో అంత తెగించి కూడా వుంది. ధనలక్ష్మి ఎడమ చేతి గాజు పగిలి కొంత చేతి మీదా, కొంత నుదుటి మీద గాయమయి నెత్తురు కారింది. ఆ గదిలోని చిన్న దీపం బలవంతంగా వెలుగుతున్నది.

"నువ్వు పని చేస్తావు, ముండా. బాగ దొంగ తిండి తిని వాన్ని, వీన్ని ముంచి అప్పులు ఎగ్గొట్టి బలిశిన ముండలు మీరు ఒళ్ళొంచి పని చేస్తారె? ఇట్ల మాట్లాడి తప్పించుకోవే ఇయ్యాల."

గోడకు వాలి, నిలబడి ఏడుస్తున్న ధనలక్ష్మి "ఆ దేవుని మీద ఒట్టు. నేను పని చెయ్యకపోతె నువ్వేమన్న చెయ్యి నన్ను. కాని యిట్ల తిట్టకు పెద్దమ్మా, నువ్వు తిడితె నాకు కోప మొస్తదవి కాదు నాకు అభిమానమున్నదని గాదు. కాని ఇంక తిట్టకు. నేను చచ్చిపొయ్యిన పెద్దమ్మా. నాకింత పని చూపిచ్చి పుణ్యాం కట్టుకో. నువ్వు ఎన్ని తిట్టినా ఇప్పుడు నాకొక్కటే. మొదటి తిట్టుకే మనసు కష్ట పడుతది పెద్దమ్మా. ఇన్ని తిట్లు ఇన్నిసార్లు, ఇన్నాళ్ళు,ఇంత మంది తిట్టినంక ఇంక నాకేమి సిగ్గు పెద్దమ్మా. నీ నోరు ఊరికే పోతది. నువ్వు తిట్టా లనుకుంటె తిట్టు. కావలిస్తె కొట్టు. ఇంకే మన్న చెయ్యి. గని నాకు పని చూపిచ్చు. నన్ను రక్షిచ్చు. నా పిల్ల లను బజారుపాలు జెయ్యకు లేదా ఇంత విషం పెట్టు."

"పదవే. ఇన్ని మాట్లాడే దానివి నా పొలానికి రావే. పని చెయ్యి."

"నీ యిష్టమొచ్చిన పని చెప్పు 'పెద్దమ్మా' నాకోదారి చూపిచ్చు చాలు."

అలిసిపోయినట్టుగా ఎల్లమ్మ మాట్లాడ లేదు.

ధనలక్ష్మి గుమ్మంలో కూలబడి పెద్దమ్మా అంటూ బిగ్గరగా ఏడవటం

మొదలెట్టింది.

ఎల్లమ్మకు అది అర్థం కాలేదు. ఎక్కడో ఏదో ఆమెలో స్పందించినట్టు.

"ఊకో బిడ్డా ఊకో" అంది. కాని ధనలక్ష్మి అట్లా ఏడుస్తూనే వుంది,

"లే బిడ్డా ఏమి చెయ్యాల్నే? వాడు కిరాయి యియ్యకపాయె. నువ్వేమో తిడితె ఏడిస్తివి. నా నోరు మంచిది గాదాయె. నన్నేమి చెయ్యమంటవే మరి. పౌరుశం తోని నువ్వు కూలిపన చేస్తసంటివి"

అంటుంటే ధనలక్ష్మి "పౌరుశంగాదు పెద్దమ్మా. తిండికోసమే పని చేస్త" అంది,

"నువ్వేం జేస్తవే ఆ పని. ఇంటి పట్టున కూసుంటోళ్ళు మీరు–" అంది ఎల్లమ్మ.

"పెద్దమ్మా నీకు కిరాయిసంగతే తెలుసు. గని యింకెంత కతున్నదను కున్నవు. ఎన్నాళ్లీ తిండికి మాడినమో ఎన్నాళ్ళు జయమ్మ దగ్గర, మామ్మగారి దెగ్గర అడుక్కోని తిన్నమో నీకు తెలువదు. రెండేండ్లనించి యిట్ల పైసలొ స్త యని ఆశ సూపిచ్చుకుంట మమ్ములను మాడ్సుతున్నడు. ఇవన్ని ఒద్దు. ఎక్కడన్న పనిచెస్తనన్న పెద్దమ్మా. నువ్వు నమ్ము, నమ్మకపో ఆ మాట అన్నందుకు యింటికి రానన్నాడు. పెద్దమ్మా నేను పనిచేస్తె అయన మర్యాద పోతదట. అట్లగయిన సర్లేనని కులపోళ్ళ యిండ్లన్ని తిరిగినా ఎక్కడ ఎవ్వరు పనియ్యలేదు ఒక్కరు, ఒక్కరంటె ఒక్కరు పనియ్యలేదు పెద్దమ్మా. అంతేగాదు పనిచెయొద్దని నీతులు చెప్పిన్రు. ఆఖరికి ఒగమ్మ దగ్గర అడిగి అప్పడాల పిడి తెచ్చుకుంటె మా అన్న పుణ్యాత్ముడొచ్చి అది గూడ చెయ్యొద్దన్నడు. చేస్తె యిగ రానన్నడు."

"పనిచేస్తె తప్పేందే. తప్పనోళ్ళన్ని మొకంమీద దన్ను. నీ మొగడు గాక పోతెపాయె. వాడు వుండేమి నిన్ను సాదుతున్నడని. ఇగో నేను ఒక్కటేమాట చెప్పుతున్న. రేపటినించి నువ్వు నాదగ్గర పనిజెయి. ఎవ్వడు నీ యింటికి రాకుంట నేను సూస్త. కష్టంలవున్న ఆడదానివి– నీకు యింటి కిరాయ మాఫ్‌చేస్త, రోజు రెండు రూపాయెలిస్త సరేనా!"

"చాలు నీ అప్పంత తీరుస్త. ఇంత మాత్రం ధైర్యమియ్యి పెద్దమ్మా"

"నీ మొకం! అప్పు నువ్వేం తీరుస్తవే. ఆ పైసలన్ని వానిదగ్గర ఒసూలుచేస్త. నీ బతుకైతే నువ్వుబతుకు. కాయకష్టానికి జయ్యపడొద్దు బిడ్డా. నాకేం తక్కువైందని నేను పొలానికి పోతనే. ముప్పై బర్రెలున్నాయి. ఇరవై ఎకరాల పొలముంది. ఇంక ఎందుకు కష్టపడుతనను కున్నావు. కష్టపడితెనే లచ్చిమి బిడ్డా. ఒళ్ళు దాచుకుంటె తాళిలి. పనిచేసుకోవాలె. సంపాయిచ్చుకోని తినాలి.



పొద్దునే వంటచేసి తను తిని పిల్లలకు పెట్టి, పిల్లలను కాస్త చూడమని

జయమ్మతో చెప్పి పొలానికి ప్రయాణ మైంది ధనలక్ష్మి.

ఎల్లమ్మ పొలం ఊరి పొలిమేరల్లో వుంది. అక్కడ ఎల్లమ్మ వ్యక్తిత్వమే మరొకటి.

"ఇదిగో ఈరమ్మా, ఇక్కడ్రాయే. ఇద్దరు కలిసి ఈ గడ్డి నరుకున్రి. ఎడ్లకు మేత తయారు చేయిన్రి" అంటూ దూరంగా పనిచేస్తున్న ఈరమ్మను పిలుచుకొచ్చింది.

"ఈమెవ్వరమ్మా మీ సుట్టమా?"

"ఆఁ. నీకేటె అదొక సుట్టం గని పని-పనిచేయిన్రె."

ఎల్లమ్మకు పొలంపనులన్నీ వచ్చు. తన దగ్గరి కూలీలందరికన్నా బాగా పని చెయ్యగలదు. ఎప్పుడైనా వాళ్ళు కొంత అజాగ్రత్తగ పనిచేస్తున్నారని తెలిస్తే వెళ్ళి చూపించి "ఇట్ల చెయ్యవే మాయమ్మా ఈ నాజూకు పనులు చేస్తే కడుపునిండదే ఒగలదానా" అని చెప్తుంది. కొడుకులు పాతిక ముప్పై ఏళ్ళ వాళ్ళు - ఆమె అదుపాజ్ఞల్లో పనిచెయ్యాల్సిందే. ఇంటిదగ్గర బర్రెలు - వాటికి స్నానాలు చేయించటం, మేత వెయ్యటం, పాలు, పెరుగు, పేడ పిడకలు చేసి అమ్మటం అంతా ఈమె అజమాయిషీలోనే కొడుకులు చేస్తారు. అక్కడ పాల అమ్మకం కాగానే పొలానికి పరిగెత్తుకొస్తుంది. లాభంతో మరిన్ని బర్రెలు కొంటుంది. చిట్టీలు కడుతుంది. అట్లాగ పదెకరాల పొలాన్ని యిరవై ఎకరాలు చేసింది. ఆమెకు దగ్గు దమ్ము ఐనా రోజంతా పనిచేస్తుంది - చేయిస్తుంది. సాయంత్రమయ్యే సరికియింటికి కల్లు కుండ తెప్పిస్తుంది. ఇంటిల్లిపాదీ పూటుగా తాగుతారు. కూలీలు బాగావింటే, "బిడ్డా చెల్లే" అంటుంది. పనిచెయ్యక పోతే "ముండా, కష్టపడకుంట తింటె పెయ్యి కెట్ల పడ్తతే" అనీ అంటుంది.

ఆమె నలుగురు కొడుకులూ రౌడీలే. ఒక్కొక్కడూ రాక్షసుడిలా పెరిగాడు. కాని తల్లి ముందర కుక్కపిల్లల్లాగా నక్కుతారు. ఆ యింట్లో తిరుగులేని వ్యక్తి ఆమె

వీళ్ళందరికీ పనులు పురమాయిస్తూ కోప్పడుతూ తిరుగుతూ నే-మధ్య మధ్యన ధనలక్ష్మి దగ్గరకొచ్చి,

"ఆ ఒక్క పని గంతసేపు చేస్తె ఎట్ల బిడ్డా. దా. దా. ఇగ నడువు. ఈ ఎరువు తట్టలు అక్కడ యిచ్చిరా. పో. దబదబ నడువుజెర. ఇట్ల నడిస్తె పనిగాదు బిడ్డా, పని చెయ్యి పైసలు తీసుకో" అంటూ హెచ్చరించింది.

సాయంత్రం అందరూ కూలి కోసం ఆమె చుట్టూ చేరినప్పుడు గాని ధనలక్ష్మికి తెలియలేదు ఆ పొలంలో అంత మంది పని చేస్తున్నారని. ముప్పైకి పైగా కూలీలున్నారు. అందరూ పోయిన తర్వాత ధనలక్ష్మికి రెండు రూపాయలిచ్చింది.

"ఇగో, అందరికి రూపాయి బారాన యిస్తె నీకు రెండు రూపాయలిస్తున్న. పో. రోజు యింక పొద్దుగాల్నే రావాలె. బాగా పని చెయ్యాలె. పో. పో. యిగ ఒండుకోని తినుపో" అంది.

ఒళ్ళంతా నొప్పులతో యింటి మొహం పట్టింది ధనలక్ష్మి. వెంట మరో ముగ్గురు

ఆడవాళ్ళున్నారు.

"యాడ వుంటరమ్మ ?"

"ఎల్లమ్మ యింట్లనే వుంటం ?"

"నీ మొగడేం చేస్తడమ్మ ?"

"ఎంతమంది పిల్లలమ్మ ?"

వాళ్ళందరూ ఒక్కే షావుకారు దగ్గర వెచ్చాలు కొంటారు. ధనలక్ష్మి కూడా అక్కడే ఆగింది. ఆ షావుకారు ఓ రోజు ఓ పావాలా తక్కువైనా వూరుకుంటాడు తెల్లారి తీర్చొచ్చు.

రోజంతా తల్లిని విడిచివున్న పిల్లలు ఆమెను చూడగానే దగ్గరకొచ్చారు.

"అమ్మా, చెల్లె ఒకటే ఏడుపు. ఎంత ఎత్తుకున్న ఊకోతేదే" అంది హేమ.

"ఒంటి గంటకు తిన్నరా బిడ్డా ?" అని అడిగింది ధనలక్ష్మి చిన్న పిల్లను తీసుకుంటూ.

"ఆఁ. నేను తిన్న. చెల్లె అన్నం తిన లేదు. పాలు తాగలేదు" అంది హేమ.

"ఎట్ల బిడ్డా, ఎట్లన్న చేసి చెల్లెకు పాలుతాప్పిచ్చాలె. మరి నేను రోజు పనికి పోతి. ఇగరోజు చెల్లెను నువ్వే సూసు కోవాలె. జయమ్మా, పిల్లలు నిన్ను సతా యిచ్చినార్రి.?" అంది.

"ఏమీ లేదుళే. అయ్యో. చూడు మొహమెట్లాగై పోయింది. ఎంత కష్ట పడ్డావో పాపం" అంది జయమ్మ.

మామ్మగారు కూడా లేచివచ్చి,

"వచ్చావా ధనలక్ష్మి. నీకెక్కడి కష్టాలొచ్చాయి తల్లీ, వెళ్ళమ్మా, వెళ్ళు, స్నానం చేసి ఒండుకొని యింత తిను. అప్పుడు గాని మనిషివి గావు" అంది.

వంట చేస్తూ ధనలక్ష్మి వూరుకోలేక

"ఎవరన్నా ఒచ్చిపొయ్యిర్రా ?" అని అడిగింది హేమను.

"లే ద మ్మా. ఎవ్వరూ రాలేదు. నాయినెక్కడికి పొయ్యిండమ్మ, ఒస్త లేడు, ?" అంది హేమ.

"నా కే ం తె లు సే. ఎక్కడికి పొయ్యిండో. మనల్ని ఈ యింట్ల వుంచితే మనమే బ తు కు త మ ను కు న్న డు. యాడున్నా తన పొట్ట తను సూసు కుంటున్నడు. అట్లనే మన పొట్టకు మనం తెచ్చుకుంటె యింతకోపమాయె"

ఇంతలో జయమ్మ,

"ధనలక్ష్మి అన్నం వొండుకో. పప్పు నా దగ్గరున్నది తీసుకో. ఇప్పుడింక కూరలు కూడా ఎక్కడ చేసుకుంటావు. యిప్పటికే పొద్దుపోయింది " అంది ఓ గిన్నె హేమ చేతికిస్తూ.

ఒద్దు జయమ్మా. ఇగో. కూ ర గాయలు తెచ్చిన "ఉండనీలే రేపటి కొస్తాయి " అంటూ అక్కడే కూర్చుని,

"ఏం చేశావు ధనలక్ష్మి, ఏం పని చేయించింది ?" అని అడిగింది.

"ఏదో, అందరు చేసిన పనే నేను చేశిన, అక్కడ నా అసుంటోళ్ళు యింక చాల మంది వున్నరు"

జయమ్మ అంతటితో ఆగలేదు. ఇంకా గుచ్చిగుచ్చి అడిగింది.

"ఏం పని ? ఎక్కడ ? బా గా కష్టమా ? రోజూ యింతేనా ? పాపం, పిల్లలు ఎట్లా ?"

"వాళ్ళ కోసమే గదనమ్మ పని చేసేది. ఇంట్ల వాళ్ల మొకం సూసుకుంట

కూసుంటె తిండి వొచ్చిందా? ఏడిస్తె ఏడుస్తరు. ఇంత తిండి తింటే ఏడిస్తందు కన్న బలమొస్తది" అంది ధనలక్ష్మి

"నువ్వు ఎట్లాగైనా ధైర్యవంతురాలివి ధనలక్ష్మి. అమ్మో, నాలాంటిదైతే చావ నైనా చస్తుంది గాని యిట్లా చెయ్యలేదు" అంది జయమ్మ.

"ఎందుకు సస్తరు జయమ్మా, అను కునుడేగని ఎవ్వరు సావరు.

నాలుగురోజులు తిండికి మాడితే అన్ని సుకుమాగాలు పోతయి"అంది ధనలక్ష్మి.

"కాదులే.ఎట్లాగైనా నీదిమొండిధైర్యం నువ్వు గనక అప్పుడంత సహించావు. యిప్పుడిట్టా కష్టపడుతున్నావుగాని అమ్మో. నేనైతేనా వురేసుకునే దాన్ని"

"ఏమో, ఒక్కదాన్నైతె నేను అంతే చేస్తునేమొ గని ఈ పిల్లలను ఎవ్వరికిచ్చి పోవాలె జయమ్మా. ఇప్ప టికే వీళ్ళు బికారులు. ఇగనేను గూడ సస్తె బిచ్చగాళ్లల్ల గలువరా?"

జయమ్మ ఏదో విషయం సీరియస్‌గా ఆలోచిస్తున్నట్టుగా చాలా సేపు మాట్లాడలేదు. తర్వాత మౌనంగా గదిలోకి వెళ్ళి గడియ వేసుకుంది.



## 6

బురదలో తిరగడంవల్ల కాళ్ళకు పుళ్ళు యినాయి ధనలక్ష్మికి. రోజూ సాయం త్రం వచ్చి కాళ్ళకు పసుపు, నూనె పెట్టుకుని పడుకునేది. ఇప్పుడు ఆమెలో ఓ రకమైన ఉత్సాహం, దీక్ష కనిపిస్తు న్నాయి. ఒళ్ళు బాగా అలసిపోతున్నది. ఎల్లమ్మ దెప్పి పొడుస్తున్నది. కాని పొలం పనులు చురుకుగా చెయ్యగలుగు తున్నది.

"కొత్త మురిపెమన్నట్లు పనిచెయ్య కమ్మ. నువ్వెంత చేసినా అది అనే మాట లంటనే వుంటది" అన్నారు తోటి కూలీలు.

ఇంటికి వచ్చి మళ్ళీ ఎవరూ అప్పుల సంగతి అడగనేలేదు. ఒకసారి మాత్రం సైకిలు టాక్సీవాడు వచ్చాడు. ఎల్లమ్మ పేరు చెప్పింది ధనలక్ష్మి. వాడు కాసేపు గొడవ చేశాడు. ఆ తెల్లారి ఎల్లమ్మ కొడుకు వాడికి తెలియ చెప్పాడు.

కోటయ్య ఇంటికి రావటం మానే శాడు.

"ఎన్నాళ్ళుంటయమ్మ ఈ పనులు. ఇక్కణ్ణే చేస్తవా లేకపోతె మావోలె అన్ని పనులకు ఒస్తవా?" అన్నది ఓయమ్మ. వీళ్ళిక్కడికి వస్తే వీళ్ళ మొగుళ్ళు ఉప్పరి పనులకో, సున్నం వెయ్యటానికో, కూరగాయలు అమ్మ టానికో పోతారు. ఇక్కడ పనులు లేక పోతే వీళ్ళు వాళ్ళ వెంటపోతారు. సీజన్ వస్తే రేగిపళ్ళు, జామపళ్ళు, సీతాఫలాలు అమ్ముకుంటూ తిరుగుతారు.

"నీ ఒక్క దాని కూలి తోని ఎట్ల బతుకుతవమ్మ. నీ మొగుడేమన్న తెస్తడా యింట్లకు?"

"ఆయిన తెస్తే నాకీ కష్టమెందు

కుంటది?" అని ధనలక్ష్మి జవాబు.

"అయ్యో అట్లంటవు నీ మొగడింత, నువ్వింత పనిచేస్తే తప్పేంది?" అంటారు వాళ్ళు.

పిల్లలు కూడా అలవాటు పడ్డారు. ధనలక్ష్మి వండిపెట్టి పోతుంది. ఇంట్లోని మిగతా చిన్నచిన్న పనులు హేమ చేసు కుంటుంది. చెల్లెలి గుడ్డలు మార్చటం, తినిపించటం కూడా ఆ పిల్లకు అలవా టైనాయి.

"నువ్వేమన్న చిట్టి కద్తవమ్మా?"

"నాకు తిండికే సాలదు. ఇంక చిట్టి లెక్కడ?" అంది ధనలక్ష్మి.

"అయ్యో అట్లంటె ఎట్లనమ్మ.ఒచ్చిన దాంట్లనే మిగిలిచ్చుకోవాలె. లేకపోతె రేపు ఎట్లపొయ్యి ఎట్లొస్తదో"

ధనలక్ష్మి కది తెలుసు. కాని కూడ బెట్టేదెట్లా?

ధనలక్ష్మి పనికి పోయిన ఒక మధ్యా హ్నం కోటయ్యొ యింటికి వచ్చాడు. తండ్రిని చూడగానే హేమ లేచి,

"ఇగోనే. చెల్లె, నాయనొచ్చిండు" అని కేకేసింది. సంతోషంతో కోటయ్య కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"దా బిడ్డా. బాగున్నా రే?" అంటూ పిల్లల్ని చెంతకు తీసుకున్నాడు.

"మీ అమ్మేన్నదా బిడ్డా?" అని అడిగాడు.

"లేదు నాయనా పనికి బొయ్యింది. పొద్దుగూకిందాక రాదు" అంది హేమ.

కోటయ్య ఈవల వరండాలో గోడకు చేరగిలబడి కూర్చున్నాడు.

జయమ్మా, మామ్మగారు పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

"బాగున్నావా, కోటయ్యా?" అంది మామ్మగారు.

"ఇగో. ఇట్లున్న మామ్మగారూ" అన్నాడు కోటయ్య. అతని గుడ్డలు బాగా మాసి వున్నాయి. మొహం పీక్క పోయింది. మనిషి అసలే సన్నం. ఇప్ప డింకా ఎముకలు తేలినాయి. గొంతు బల హీనంగా వుంది. కళ్లు ఎర్రగా వున్నాయి. గడ్డం పెరిగింది. జుత్తు దుమ్ము రేగి పోయింది.

"పోవమ్మా హేమా, మీ నాన్నకు మంచినీళ్ళు తెచ్చియ్యి" అంది మామ్మ గారు.

"ఒద్దు బిడ్డా మంచినీళ్ళొద్దు. ఏమొ ద్దులే. ఈ యింట్ల యింక నాకేమొద్దు. మిమ్ములను సూశి పోయె తందుకొచ్చిన బిడ్డా" అని,

"అమ్మగారూ, పిల్లలు కలల వొస్తు న్నరు. నన్ను అడిగినట్టు, నా కోసం ఏడుస్తున్నట్టు అనిపించింది. ఒక్కసారి సూద్దామని ఒచ్చిన" అన్నాడు కోటయ్య.

"తప్పేమిటి బాబూ. నువ్వు వస్తే ఎవరొద్దంటారు. నీ పిల్లల దగ్గరకు నువ్వు రాకపోతే యింకెవరొస్తారు?" అంది మామ్మగారు.

"అట్లనకున్రి అమ్మగారూ, నేను రావొద్దనే అదింత చేసింది. మీకు తెలు వదు దాని సంగతి. అది నా మీద పగ బట్టింది. అది మొదట్నించి అంతే నన్ను చూస్తే సైసదు, ఎట్లనో ఒకట్ల నన్ను ఒదిలిచ్చుకున్నది. అంత నా కర్మ అమ్మగారూ" అన్నాడు కోటయ్య.

"ఏమో.కోటయ్య బాబూ. ధనలక్ష్మి కూడా చాలా ఓర్చుకుంది" అని మామ్మ

గారంటే.

"అమ్మగారూ. మీకు తెలువదు. దాని యేశాలు నేను మొదటినించి సూస్తనే వున్న నేను అప్పులు చేసిన సంగతి నిజమే. అమ్మగారూ నాది తప్పైతే మాత్రం ఇంటికొచ్చిన అప్పులోణ్ణి వాడే మనకు బాకీ వున్నట్టు, "నాకు తెలువదు నాతోని మాట్లాడకు" అంటె వానికెట్లుంట దమ్మా. మనది కింద చెయ్యి ఐనప్పుడు మనం అణిగి వుండాలె"

దానికా బుద్దేలేక పాయె. అది ఎట్లనన్న నన్ను బద్నాం చెయ్యాల్నని పట్టు బట్టింది. ఐనా అవన్ని యిప్పుడెందు కమ్మగారూ. దాని పంతం నెగ్గిచ్చు కున్నది. పిల్లలను సూడుౘని. వీళ్ళ మొకాలు సూసి మాట్లాడుౘని. పొద్దుందాక వాళ్ళనిట్ల విడిసి పెట్టటందుకు దానికి చేతుకెట్ల ఒచ్చినయి. వాల్లకో స్నానం లేదు. జడేసుడు లేదు. బట్టలేసుడులేదు. కుక్కలకు పడేశినట్టు యింత కూడు పడేస్తే అయిపోతదా? అమ్మగారూ, తల్లి వున్నదెందుకు ? అంత పిల్లల రాత అమ్మగారూ, అది ఇంటికి నన్ను రానియ్యకుంట చేసింది. తను పిల్లల్ని ఇడిసి పెట్టింది" అన్నాడు కోటయ్య కళ్ళు తుడుచుకుంటూ.

ఆ సాయంత్రం ధనలక్ష్మి ఇంటికి రాగానే పిల్లలు చెప్పారు. ధనలక్ష్మి సంతోషించింది అతడికింకా పిల్లల మీద మనసున్నందుకు.

"ఇంట్ల అన్నముండె. తిని పొమ్మ నొద్దా?" అంది హేమతో.

"నీళ్ళే తాగనన్నడమ్మ" అంది హేమ.

"ఊఁ. పెండ్లాం చేతి కూడు తినే టందుకే అభిమానమొచ్చింది. పైసలు సంపాయిస్త లేడు గాని" అంది ధనలక్ష్మి.

"మళ్ళ ఒస్తనన్నడా?"

"ఏమో. ఎప్పుడన్న ఒస్తనన్నడు."

"ఎక్కడుంటున్నడట?"

"ఏమోనే ఏమి చెప్పలేదు."

"ధనలక్ష్మి. అతనెక్కడైనా కనిపిస్తే యింటికి రమ్మనవమ్మా మనిషి ఎట్లాగైయిపోయినాడో పాపం ఈ చలి రోజుల్లో ఎక్కడుంటున్నాడో ఏమో" అంది మామ్మగారు.

"అదేంది అట్లంటరు మామ్మగారూ, నేను రావద్దన్ననా ? తినొద్దన్ననా ? పండుకోవొద్దన్ననా? పెద్ద మనుషులు మీరు చెప్పొద్దా మామ్మగారూ. ఇంక నా మీద నన్న కోపం. మీరు చెపితె వింటడు. ఈసారి వొస్తె చెప్పుౘని" అంది ధనలక్ష్మి.

"ఇగో మల్ల ఒస్తె నాయనను అన్నం తిని పొమ్మను. అట్లాగే పోనియ్యకు" అని మరీ మరీ చెప్పింది హేమతో.

మరోనాడు కోటయ్య చేతిలో రెండు బూందీ పొట్లాలు పట్టుకుని వచ్చాడు. ఈసారి కొంచెం మెరుగు. గుడ్డలు పాతవే గాని శుభ్రంగా వున్నాయి. తల దువ్వు కున్నాడు.

"ఎక్కడైనా కుదిరిందాకోటయ్యా?" అంది మామ్మగారు.

"నేను కూలి మనిషిని గాదు అమ్మగారూ. మా వ్యవహారం మాది. ఏదో నడుస్తున్నది" అన్నాడు కోటయ్య. ఎడమ చేతికి కట్టుకట్టి వుంది. అది చూపిస్తూ

"ఇగో అమ్మగారూ, అది వాళ్ళతోని ఏమి చెప్పిందో ఏమో. మొన్న ఒగడు నన్ను పట్టుకోని సైకిలు చెయిన్‌తోని కొట్టిండు. నేనిక్కడకొ స్తలేనని ఎక్కడ పడితె అక్కణ్ణె పట్టుకొని ఇజ్జత్ తీస్తున్న రమ్మగారూ. అన్ని తెలిసే అది ఈ పనిల చేరింది సరె. అప్పులు యియ్యాల వుంటయి, రేపు తీరుతయిగని మనసుల పుండు మానదు అమ్మగారూ. అది రోజు రోజుకూ పెద్దగయితది. నేను దానికింత అపకారమేమి చేసిన? నాకు తెలిసి ఏమి చెయ్యలేదు".

"ఏమో బాబూ మీ లోపలి విషయాలు నాకేం తెలుస్తాయి. ఏదో యిద్దరూ కలిసి వుండాలని అన్నాను.అంతేగాని నాకివన్నీ ఏం తెలుసు?" అంది మామ్మగారు.

కోటయ్య తను తెచ్చిన రెండు తీపి బూందీ పొట్లాలను పిల్లలకు చెరోటి యిచ్చాడు.

"నాయనా అమ్మ నిన్ను అన్నం తినమన్నది. అమ్మొచ్చిందాక యిక్కణ్ణే వుండు నాయనా" అంది హేమ.

"ఉంటనే. ఆ రోజువాస్తె అట్లనే వుంట. ఇగో ఈ రూపాయి తీసుకోని ఏమన్న కొనుక్కోరి" అంటూ రూపాయి హేమ చేతిలో పెట్టాడు.

"మిమ్మల్ని ఘుట్లా సూడలేను బిడ్డా. మిమ్మల్ని మంచి యింట్ల వుంచుతనే. ఇంక నాలుగు రోజులు ఓపిక పట్టురి. మీకు మంచి బట్టలు తెస్త. బొమ్మలు తెస్త"

భోజనం ముగించి శివాజీ గది బయటి కొచ్చాడు.

"బాగున్నారా బాబూ" అని అడిగాడు కోటయ్య.

శివాజీ "ఊఁ" అన్నాడు. కోటయ్యను చూస్తె అతడికి కోపంగా వుంది.

"నౌకరీ బాగ నడుస్తున్నదా?"

"ఆఁ నౌకరీ బాగానే వుంది, ఇల్లే బాగలేదు" అన్నాడు శివాజీ. కోటయ్య ఏమిటన్నట్టు చూశాడు

"మేం యిల్లు మార్చేస్తున్నామయ్యా" అన్నాడు శివాజీ.

"ఏదో చవకలో వుందిగదాని యిల్లు తీసుకుంటే మరీ యింత కనా కష్టమా. ఒకతేమో వంటమనిషి, ఒకతి కూలి మనిషి. ఇంటిమీదికి ప్రతి వెధవా దండయాత్ర చేస్తాడు. మీ మూలంగా మా ఆవిడ వినకూడని బూతులన్నీ విన్నది. ఈ వెధవ సావాసాలతో మా కాపురం పాడయ్యేటట్టుంది. ఎదుటిగుండా మగణ్ణి వెళ్ళగొట్టి ఘగరాయుడులా తిరుగుతున్న ఆడదాన్ని చూస్తుంటే ఎప్పుడో మా ఆడదీ అలాగే చేస్తుంది. అని ఆగి "ఏం మగాడివయ్యా? అది రానివ్వదు. నువ్వు రావు. ఆఁ. ఇదేం సంసారుల కొంపలాలేదు. మీ లాంటి వాళ్ళ కోసం స్పెషల్‌గా కట్టినట్లుంది" అన్నాడు వెకిలిగా.

కోటయ్య గొంతు తగ్గించి

"బాబూ రోజులు నావి కావు" అన్నాడు.

"ఆడది నీదే గదా?" అన్నాడు శివాజీ.

కోటయ్య తలొంచుకున్నాడు.

"ఏం కులం మీది ?" అన్నాడు శివాజీ తెలియనట్లు

కోటయ్య మళ్ళీ మౌనం.

"ఆడదాని నోరు మూయించ లేక పోతే మగాడు పెళ్ళి చేసుకోవద్దు అసలు. నీకు ఇబ్బందైతే పుట్టింటికి గెంటెయ్యలేక పొయ్యావ్, అలాగ రోడ్లమీద ఒదిలి పెట్టడం కన్నా ?"

కోటయ్య చాలా సేపు మాట్లాడ కుండా కూర్చుని గబుక్కున లేచి వెళ్ళి పోయాడు.

శివాజీ గదిలోకెళ్ళి,

"ఒసేవ్. నువ్వు దానికి మిగిలిన అన్నం, కూరలు యిచ్చి సగం పాడు చేశావే? ఐనా అదంటే నీకు అంత ప్రేమ ఒలికి పోతుందేవిటో?" అన్నాడు

"ఛ. అలా అంటారేం నాకేం ప్రేమ ఆవిడంటే."

"ఆవిడా— ఆహా ఎంత గౌరవం. నువ్వు గూడా కూలీ పని చేసుకుని బ్రతకాల్సిన ముండవేనే— రోజంతా అది నీకేమి చెబుతుందే?—"

"అట్లా అనకండి- ఇల్లు మారుస్తా మన్నారుగా మార్చండి త్వరగా"

"ఊఁ. మార్చాలి.నీ అబ్బ కడతాడా ఎక్కువ కిరాయి. నీ వంటి ముండలు ఈ యింట్లోనే చాహాలి పీనుగా అన్నాడు

జయమ్మ నవ్వి "పోండి" అంది.



పొలంరో కూలీలు చాలా మంది యిప్పుడు పళ్ల బుట్టలు తలల మీద పెట్టుకుని బేరాలు చేసుకుంటున్నారు. సీజన్‌లో ముప్పైమంది దాకా వున్న కూలీలు యిప్పుడు ఐదారుగురే మిగి లారు. ఎల్లమ్మ తన కోడండ్లలో యిద్దర్ని పొలం మీదకి తెచ్చింది. కొడు కుల చేత మరింత పనిచేయిస్తున్నది. వెళ్ళిన కూలీలను తిడుతుంటుంది.

"దొంగ ముండలు. పబ్బంగడుపు కోని పోతరు. కూలి గావాల్నంటె కాళ్లు గడుపులు మొక్కుతారు. అమ్ముకునుడు రాంగనే చెప్పా చెయ్యకుంటపోతరు. ఇసుంటోల్లను మాడ్చి సంపాలెగని కూలియ్యొద్దు"

కూలీల సంఖ్య తగ్గటంతో ధనలక్ష్మి పనెక్కువైంది. తనను ఆపదలో ఆదు కున్న ఎల్లమ్మను చూస్తే ఆమెకు కృత జ్ఞత.

"నువ్వు ఫికరు చెయ్యకు బిడ్డా. మా యింట్లనే వుండిపో. పనిచేసుకుంటోళ్లకు ఎక్కడైతేనేమి బిడ్డా. మా తోనే వుండు ఆ కర్మ నీకే రాశిస్తపో. నీ పెద్ద పిల్లను గూడ ఈడికి తీసుకురా చేతి కింద వుంటది" అంది ఎల్లమ్మ.

"ఒద్దు పెద్దమ్మా. వాళ్ళను నీ డ పట్టున వుండని జెర" అంది ధనలక్ష్మి.

ఏమను కున్నాదోగాని ఎల్లమ్మ మళ్ళీ అడగలేదు ఆ విషయం.

ఒకప్పుడు తనతో పనిచేసిన కూలీలు కనిపించి,

"ఇంక అక్కడే వున్నావు. మేము రోజుకు నాలుగైదు రూపాయిలు చేసు కుంటున్నం" అన్నప్పుడు ధనలక్ష్మికి కూడా ఆశ పుట్టక పోలేదు. నిజానికి తను అట్లా బజార్లు తిరిగి అమ్ముకోవటం

ఆమెకింకా సిగ్గు చేటే. ఓ చోట పని చేస్తే గుట్టుగా వుంటుందనీ, తిరిగితే అందరికీ తెలుస్తుందనీ ఆమె అభిప్రాయం కాని కూలీరేటు పెంచమని గూడా ఆమె ఎల్లమ్మను అడగలేదు. పెద్దకూతుర్ని పొలానికి లాగకుండా వుండ గలిగి నందుకు, ఎల్లమ్మ మాటకు ఎదురు చెప్ప

గలిగినందుకు ఆమెకు సంతోషంగా వుంది. ఎల్లమ్మ మంచిదేననీ, కొంచెం బతిమాలి పనులు చేయించుకోవచ్చుననీ ఆమె వుద్దేశం. అందుకు సాక్ష్యంగా ఎల్లమ్మ అప్పుడప్పుడూ తన పొలంలోని కూరగాయలిస్తుంది ధనలక్ష్మి ఓ రోజు "ఇన్ని పాలు తీసుకపొయ్యి పిల్లలకు తాపవే. నువ్విన్ని పాలు తీసుక పోతెనె మాకు తరిగి పోతదా బిడ్డా. రేపట్నించి రా" అంది.

అప్పటి నుంచి ధనలక్ష్మి పొలంలో పని త్వరగా ముగించి కూరగాయలు ఏరుతున్న వాళ్ళ దగ్గర కెళ్ళి తనూ ఓ గంపెడు కూరగాయలు ఏరింది. తెల్లవారక ముందే ఎల్లమ్మ యింటికిపోయి, బర్రెల దగ్గర గడ్డివేసి, పాలచెంబులు తోముకొచ్చి వచ్చిన వాళ్ళందరికీ పాలు పోసినదాకా సహాయం చేసింది. ఐతేనేం ఆమెకు రెండు ఖర్చులు తగ్గిపోయినాయి.

ధనలక్ష్మికి అసలుపనితోపాటు ఈ పనులు కుడా తోడుకావటంతో ఒళ్ళంతా విపరీతంగా అలిసి పోయినా, "ఎల్లమ్మ మంచిది. నాచేత పని చేయించుకున్నా, కడుపుకింత పెడతన్నది" అన్న అభిప్రాయంసడలలేదు. బైటిపనులతోనే తల్లికి సరిపోవటంవల్ల, యింటి పని భారమంతా హేమ మీద పడింది. ఆ పిల్లే వూడుస్తుంది. చెల్లెలి అవసరాలు చూస్తుంది. వండి పెడుతుంది. ధనలక్ష్మికి యిది బాధగానే వుంది. పెద్ద పిల్లను బడికి పంపలేక పోవటం ఆమెకు విచారం కల్గిస్తున్నది. ఊళ్ళో వున్నప్పుడెప్పుడో మొదటి వాచకం చదువుకుంది. ఇక్కడి కొచ్చినప్పటినించీ అది చదువే మరచి పోయింది. చిన్నదాన్ని తను వెంట తీసుకుపోతే దీన్ని బడికి పంపొచ్చు. ఆ మాటే ఎల్లమ్మతో అంటే.

"ఏం బిడ్డో. పిల్లల్ని ఎంటేసుకొచ్చి ఈడ కూసుంటవా? ఇది బాగలేదు. బిడ్డో. పిల్లలతోని పనెట్లయితది? నీ ఎంట ఒచ్చెటోళ్ళు నీకు ఆసరయ్యేటట్టుండాలె గని నీకు అడ్డం పెట్టొద్దు" అంది ఎల్లమ్మ.

అప్పటితో హేమ బడికి పోయే అవకాశం పోయింది. ధనలక్ష్మిని ఓదార్చటానికన్నట్టు ఎల్లమ్మ, "ఆడ పోరలకు సదు వెందుకే? ఇంటిపని నేర్పిచ్చు. నాకు సదువా స్తదా? నా కోడండ్లకు సదువా సదా? నా కొడుకులు గూడ సదుపుకోలేదు. ఐనా మాకేం తక్కువ? దేనితోని పైసలు సంపాయిస్తె అదే సదువు. ఇట్లయితె సంపాయి స్తలేనా? నల్గురికి పెడ్తలేనా? ఈ సదువు మీద మోజు అంత మీ వోల్లల్లనే వుంటది" అంది.

అప్పటికి ధనలక్ష్మి ఉదయం నాల్గింటినించి సాయంత్రం ఆరింటిదాకా పని చేస్తూనే వుంది. కాని ఏమీ మిగల్చలేక పోతోంది. ముఖ్యంగా తోటి కూలీలు కూడా పావలో, అర్ధో మిగిల్చి నెలానెలా చిట్టీలు కడుతున్నారని జ్ఞాపకం వచ్చి

సప్పుడు ఆమె ప్రాణం జివ్వుమంటుంది. ఇంక ఎక్కువ ఎలా కష్టపడటమో, ఎలా ఎక్కువ సంపాదించటమో తెలియ లేదు. తను యింత కష్టపడుతున్నందుకు కోటయ్యా కూడా యింతో అంతో తెస్తే ఒకరి కూలీ తిండికి పోయినా, ఒకరిది మిగిలేదిగదా అనుకుంది కొన్నిసార్లు. కాని అతడికి అంత శ్రద్ధే వుంటే తనకీ గతిఎందుకు పట్టేది? ఇలాగ ఆలోచిస్తున్న ధనలక్ష్మికి ఓ నాడు మెరుపులాంటి ఆలోచన తట్టింది. పెద్ద కూతురు వంట పని చెయ్యగలుగుతున్నది. అదిచిన్నదే. ఇంకా కుర్ర చేష్టలు పోలేదు. కాని బాధ్య తలవల్ల, తమ పరిస్థితులు చూస్తుండటం వల్ల అదిప్పుడు చాలా విషయాలు అర్థం చేసుకోగలుగుతుంది.

ఎల్లమ్మ దగ్గర రెండు రూపాయలు అప్పుచేసి అప్పడాల సామాను మళ్ళీ తీసుకొచ్చింది. తను రాత్రంతా కూర్చుని దాన్ని కూడా బలవంతంగా కూర్చోబెట్టి అప్పడాలు వొత్తటం నేర్పించింది. మొదట కాసేపు సరదా అనిపించినా కాసేపటికి "అం. ఇవన్నీ ఎవరు చేస్తరు? చేతులు నొస్తున్నాయి" అంది హేమ.

"అయ్యో అట్లాంటవేమే దరిద్రురాలా పొద్దుమీకి అన్నంలకు అప్పడాలు చెయ్యావే. నేను ఎన్నని చెయా లె నాలుగు అప్పడాలు చేస్తందకు చేతులు నొస్తయి? బాగ తిని కూసుంటందుకు మరిగినవు" అంది ధనలక్ష్మి. కూతుర్ని తిట్టటం ఆమెకు యిష్టం వుండదు కాని కోప్పడైనా సరే పని నేర్పించాలని ఆమె ఆరాటం. ఆట్లాగ అన్నంలోకి అంటూ హేమ నేర్చుకున్న అప్పడాలు రోజూ యాభైకి తగ్గకుండా చెయ్యాలని నిర్ణ యించింది ధనలక్ష్మి ఓపికున్నప్పుడు తనూ కొన్ని చేసేది.

కూతుర్ని అప్పడాల ముసలమ్మకు పరిచయం చేసింది హేమ, చెల్లెల్ని ఎత్తుకుని పోయి సాయంత్రం వరకు రూపాయో, రూపాయన్నరో తీసుకొ స్తుంది. అందుకుగాను ధనలక్ష్మి కూతు రికి చాలా ఆశలు పెట్టింది.

"బిడ్డా, మనం పని కష్టమను కోవొద్దే. నీకు గౌనులు చినిగి పొయ్యా నయి సూడు. కొత్త బట్టలు కుట్టిస్త. ఒకనాడు సీన్మా సూపిస్త" అంది.

ధనలక్ష్మి సినిమా చూసి నాలుగేళ్ళ యింది. అప్పుడు చిన్నది పుట్టలేదు. హేమకు ఆరేళ్ళు.

సినిమా అనే మాట ఆ పిల్లకు ఎక్కడలేని ఆశ తెచ్చింది. రోజూ సినిమా కోసం అడగటమే. కాని డబ్బులు సినిమా మీద పెట్టడం ధన లక్ష్మికి యిష్టం లేదు- ఎట్లాగైనా చిట్టీ కట్టాలనే తప్ప.

ఒకనాడు హేమ అన్నం కూడా మానేసి ఏడుస్తూ కూర్చుంటే యిక తప్ప దన్నట్టు ధనలక్ష్మి ఆ పిల్లను సినిమా హాల్లోకి పంపించి తను చిన్నదాన్ని వేసు కుని ఈవల కూర్చుంది సినిమా ఐందాకా.

రెండు రోజుల్లో హేమ మళ్ళా 'సీన్మా' అంది.

"అమ్మో, అట్ల ఊకె సూడొద్దే. ఒక్కసారికి డెబ్బై పైసలు ఆ పైసల తోని మీకు బూంది కొనిపెడుతుంటి గద. నాలుగుసార్లు సీన్మా పైసలు

కూడ బెట్టుకుంటె నీకు గౌను బట్ట ఒస్తది." అంది ధనలక్ష్మి.

"సీన్మా బాగుంటదే. రంగుల సీన్మానే" అంది హేమ అనుభవాన్ని నెమరు వేసుకుంటూ.

"బాగుంటె ఏంది బిడ్డా. కడుపుల కొచ్చెనా కాలుకొచ్చెనా? పైసలు చాన వుంటె అట్లనే సూడొచ్చు. ఏదో ఒగ సారంటె సూస్తివి. ఊకె సూడొద్దు. నెలకోసారి సూద్దువు గనిలే" అంది ధనలక్ష్మి రాజీకివస్తూ.

మిగతా యిరవై తొమ్మిది రోజులు ఎట్లాగడుస్తాయని లెక్క బెట్టుకుంటూ గడిపింది హేమ. కనీసం ఆ ఆశతో నైనా కూతురు అప్పడాలు ఒత్తుతున్నందుకు ధనలక్ష్మికి సంతోషంగా వుంది. కూతుర్ని గూడ సంపాదనా పరురాల్ని చేశానని ఆమెకు తృప్తి.

"ఈసారి నువు గూడరావే సీన్మాకు. బాగుంటదే అమ్మా" అంది హేమ.

"నా కొద్దు బిడ్డా నేను చాన సూశిన. మీరే సూడక పోతిరి".

కాని హేమ తల్లిని ఒదిలి పెట్టలేదు. కూతురి మాట తోసెయ్యలేక వెళ్ళింది. సెకండ్ షో, పెద్దక్యూ. రోజూ ఎనిమిదింటికి పడుకునే పిల్ల సినిమా వదిలింతర్వాత కూడా నిద్ర పోలేదు. ధనలక్ష్మికి సినిమా ఏలా వుందో తెలియలేదు. ప్రతిసారి కూతురు "అగో అదెంత బాగున్నది." అన్నప్పుడల్లా ఆమె విసుక్కుంది. నూటనలభై పైసలు దండగైనాయనీ. ఆ మూడు గంటలైనా ఆమెను తీరిగ్గా బెంగ పడనివ్వకుండా కూతురు విసిగించింది.

ఇంకెప్పుడూ ఇలా రాకూడదని నిర్ణయించుకుంది ధనలక్ష్మి.

"ఈ ఇంట్ల వుంటే నేను ఎల్లమ్మ గగ్గర పనిచెయ్యక తప్పదు. మనం పైసలు జమ చేసుకోని ఈ యిల్లు ఖాళీ చేద్దామే. అప్పుడు నేను గూడ యింట్ల కూసుండి అప్పడాలు చేస్త. నువ్వు బడికి పోవొచ్చు" అంది కూతురితో.



ఎదురింటి వాళ్ళ మేడ మీద అప్పడాలు ఆరబెట్టుతున్న హేమకు కింద సైకిలు మీద తండ్రి కనిపించాడు. ఒక్కక్షణం పరికించి చూసిగాని పోల్చుకోలేకపోయింది. అతడు ఇస్త్రీ చేసిన పాంటు, బుష్షర్టూ, కొత్త చెప్పులు వేసుకున్నాడు. చలువ కళ్ళద్దాలు, చేతికి వాచీ. సైకిలు గుంటిముందాపి, కళ్ళద్దాలు తీసింతర్వాత గాని ఆ పిల్ల సరిగ్గా గుర్తు పట్టలేదు. గడ్డం నున్నగా వుంది. క్రాపు చేయించుకున్నాడు. చక్కగా తల దువ్వకున్నాడు,

సంతోషంతో పైనించి 'నాయినా!' అంటూ కేకేసింది. అప్పడాలను అక్కడే వదిలి చెల్లెల్ని చంకనేసుకుని పరుగెత్తు కొచ్చింది.

"అక్కడేం చేస్తున్నవు బిడ్డా?"

అంటూ చిన్న కూతుర్ని తీసుకున్నాడు కోటయ్య.

"అప్పడాలు ఎండబెడుతున్న ఇన్నాళ్లు ఎక్కడికి పొయ్యినవు నాయనా?" అంది హేమ తండ్రిదగ్గరకు చేరుతూ, ఆ పిల్లకు పాంటూ, షర్టూ స్పర్శ కొత్తగాతోచింది. జేబులోని కళ్ళద్దాలనూ, చేతివాచీని వింతగా చూసింది.

"ఇంట్లకు రా నాయినా" అంది.

సైకిల్ హాండిల్‌కు వేసిన సంచీ తీస్కుని యింట్లోకి నడిచాడు కోటయ్య.

శివాజీ అప్పుడే డ్యూటీకిపోతున్నాడు. కోటయ్యలోని మార్పు చూసి,

"ఓహో, ఏంసేటూ, ఎటో వచ్చినావు? ఈ మధ్యన రానట్టుంది" అన్నాడు.

కోటయ్య చిన్నపిల్లను ముద్దాడుతూ,

"ఏదో బిజినెస్ ఒకదగ్గర కూర్చునే నౌకరి కాదుగదా నాది" అన్నాడు.

"ఊఁ బిజినెస్ బాగున్నట్టుందే?"

"ఏం బాగు లేవయ్యా నెల జీతిగాళ్ళంత సుఖం మాకెక్కడిది? మీరే హాయి మేం బాగుంటె సూసి ఏడుస్తరు తప్పు లేనప్పుడు ఒక్కడు అయ్యో అనడు, లోకం అట్ల వున్నది" అన్నాడు కోటయ్య,

శివాజీకి మాట్లాడాలనే వుంది. కాని కోటయ్య ధోరణి అందు కనుకూలంగా లేదు.

"సేటూ వ్యాప్రామరి. ఇదిగో. సిగరెట్" అంటూ ఆఫర్ చేశాడు శివాజీ.

"ఒద్దు బాబూ. నాది అదికాదు." అంటూ కోటయ్య తన బ్రాండ్ సిగరెట్టు పాకెట్ బైటికి తీశాడు. శివాజీ వెలిగించాడు.

"సరే కలుస్తాను. హల్లో బేబీ." అంటూ కోటయ్య చేతుల్లోని పిల్లను బుగ్గ మీద తట్టి వెళ్ళి పోయాడు.

"ఏం కోటయ్య బాబూ. చాలా రోజులకు పిల్లలు జ్ఞాపకం వచ్చారు?" అంది మామ్మగారు.

"లక్ష పనులు. తీరికెక్కడిది ?" అంటూ కోటయ్య "ఇగో బిడ్డా. ఈ పండు తీసుకో" అంటూ సంచిలోంచి ఓ పెద్ద ఆపిల్ పండు తీసి పిల్లలకు చెరోముక్క కోసిచ్చాడు చాకుతో.

"అమ్మ గారూ మీరుకూడ ఒకటి తీసుకోండ్రి" అంటూ ఆమెకూ,

"ఇగో చెల్లే ఇది వుండనీ" అంటూ జయమ్మకో పండూ యిచ్చాడు.

వాళ్ళు ఒద్దంటూనే తీసుకున్నారు. మిగిలిన పళ్ల సంచీ కూతురి కిచ్చి యింట్లో పెట్టమన్నాడు.

"అమ్మగారూ, ఇయ్యాళ ఎక్కడా పోలేదు. పని దొరుకలేదా ?" అన్నాడు.

"రోజూ ఎవరింట్లో పనుంటుంది బాబూ. అసలే రోజులు మండి పోతున్నాయి. వంటలు చేయించి నలుగురికి పెట్టే స్తోమతు తగ్గి పోతున్నది. నాకూ ఒంట్లో యిదివరకున్న సత్తా లేదు."

"ఔనౌను. ఎంత కాలముంటది" అన్నాడు కోటయ్య.

తండ్రి హోదానుచూసి హేమ ఆశగా,

"నాయినా, సినిమాకు తీసుక పో" అంది.

"అయ్యో, సినిమా ఏం భాగ్యం బిడ్డా పోదాంగని ఆ అప్పడా

లెందుకే ?" అన్నాడు కోటయ్య పాత అనుమానం మళ్ళీ జ్ఞాపకం వచ్చి.

"ఇప్పుడు నేను అప్పడాలు చేస్తున్న గదా. రోజు అరవై చేస్తున్న" అంది హేమ.

"నువ్వు అప్పడాలు చేస్తున్నావు బిడ్డా! నీకు ఎంతగతి పట్టిందే! ఆఖరికి నిన్ను గూడ ఆ పని చేయిస్తున్నదే అది. దానికి చేతులెట్లొచ్చినయే నీతోని పని చెయ్యిస్తందుకు. అదేమొ రోజంతా తిరిగొస్తది. నిన్నేమొ ఇంట్లకూసోని పని చెయ్యమంటది. నీ సంపాదన తింటున్నదే అది!" అన్నాడు కోటయ్య కోపంగా.

"అమ్మగారూ, మీరేమన్న అనుకొని నేనిది సూడలేను. ఇదేమన్యాయమమ్మా, సిగ్గిడిసి అదంటె కూలిచేస్తున్నది. పిల్లల తోని గూడ చేయిస్తాది? మీరు పెద్దమనుషులు, అది ఈ లుచ్చాపనులు చేస్తుంటె సూసుకుంట కూసున్నారా? దాని మొకం మీద చెప్పుతీసుకోని కొట్టి అట్ల చెయ్యొద్దే అని చెప్పొద్దా?" అన్నాడు.

"ఆమె సంసారం ఆమెది. డబ్బు సరిపోలే దంటుంది. నేనేం చెప్పను నాయనా? ఐనా నేను ఆర్చేదాన్నా తీర్చేదాన్నా?" అంది మామ్మగారు.

"ఊహూం. కూలిపైసలు సరిపోవని దానికిప్పుడు తెలిసిందా? అసలది ఒళ్ళు తీటబట్టి కూలిచేస్తున్నది. ఇంత పిల్ల తోని అది యింటిపని చేయిస్తాది? ఒంటి చెయ్యిస్తాది? అందరు దానోల్నె కూలిముండలు కావల్నని దాని మనసు లుందేమొ."

హేమకు యిదీ సరిగా అర్థంకావటం లేదు. కాని తండ్రి కోపం ఆ పిల్లకు సంతోషంగా వుంది. మారిన తండ్రి వైఖరి ధైర్యం తెప్పిస్తున్నది. పైగా పళ్ళు, స్వీట్లూ, తండ్రిని వదిలిపెట్టకూడదని ఆ పిల్ల వుద్దేశం.

"నాయినా, నువ్వెప్పుడిక్కణ్ణే వుండే, ఎక్కడ పోవద్దు" అంది.

"నేను యిక్కడెందుకుంటాను బిడ్డా. నేను వేరే యింట్ల వుంటున్న" అన్నాడు కోటయ్య.

"మేం గూడ ఒస్తం నాయనా మమ్ముల్ను తీసుకపో" అని మారాం చేసింది హేమ.

పిల్లలట్లా మారాం చెయ్యటం కోటయ్యకు గర్వకారణం.

"తీసుకపోతనే ఒకనాడుతీస్కపోత. మీ అమ్మకు బుద్ధిచెప్పి తీస్కపోత. మీరే దాన్ని చెప్పుతోని కొట్టున్రే. మీ కోసం మీ కోసం అని యింత చేశినాది అది. మీతోనే దానికి బుద్ధిచెప్పిస్త" అన్నాడు కోటయ్య.

"నాయినా ఇయ్యాళ సీన్మాకు తీసుకపో" అంది హేమ.

"ఒద్దుబిడ్డా చెల్లె వున్నదిగదా. చెల్లె ఏడుస్తది. ఇంకెప్పుడన్న తీస్కపోతలే" అన్నాడు కోటయ్య.

"ఫరవాలేదులే అన్నయ్యా. చిన్నదాన్ని నా దగ్గర ఒదిలిపో. సాయంత్రం వరకు వస్తుంది ధనలక్ష్మి" అంది జయమ్మ.

కోటయ్యాకాసేపు ఆలోచించి,

"ఒద్దమ్మా మే మే ఇంకో నాడు పోతం. పోసీ బజారుదాక తీసుకపొయ్యి బొమ్మలు, బట్టలు కొనిస్త దాని" అంటూ కోటయ్య పిల్లలను తయారుచేసి

హేమను సైకిలు వెనకా, చిన్నదాన్ని ముందరా కూర్చోబెట్టుకుని వెళ్ళి పోయాడు.

ధనలక్ష్మి యింటికి చేరేసరికి పిల్లలు యింకా తిరిగి రాలేదు, జరిగ్గిన సంగతి తెలుసుకొని నోరు మెదపలేక పోయింది.

"మంచిదే పిల్లలు అట్లనన్న సంతోషిస్తారు" అనుకుంది.

కాని చీకటైంది-రాత్రైంది.

కోటయ్యా జాడలేదు, పిల్లల జాడ లేదు.

"బజారుకేనా పోయింది:" అని అడిగింది.

కాని ఆమె మాట ఎవ్వరికీ వినిపించ లేదు.

"వాళ్ళొచ్చింం తర్వాత తినొచ్చులే" అనుకుంది. ఆ రాత్రి ఆమె అన్నం తినలేదు.

నిద్రపోలేదు.



7

తెల్లారింది.

ధనలక్ష్మి పొలానికి పోలేదు. వంట చేసుకోలేదు. "గది ముందర కూర్చున్నది. ఆమెకు ఏడవాలని వున్నది. ఉబికి వచ్చే కన్నీటిని ఎప్పటికప్పుడే తుడుచుకుంటూ గంభీరంగా వున్నది.

"ఏదో కాస్త ఎంగిలి పడవమ్మా ధనలక్ష్మి. నీ పిల్లలు ఎక్కడికీ పోరులే. తండ్రి వెంటనే పోయారు గదా పిల్లలు. సినిమాలు చూపించి అన్నీ కొనిచ్చి తన దగ్గరే వుంచుకున్నాడేమో ఓ రాత్రికి అసలతను తీసుకుపోనన్నాడు. వీళ్ళే వెంటబడి వెళ్ళినారు. లే. వాళ్ళు వచ్చే టప్పటికి వండిపెట్టు" అంది జయమ్మ.

"అన్నం గూడ తినే వస్తారు. ఒండు డెందుకు? వాళ్ళెతే రానీ" అంది ధన లక్ష్మి.

మామ్మగారికి ఆ ఉదయమే వంట పని తగిలింది. జయమ్మ ఒక్కత్తే వుంది.

"నిన్న మీ ఆయన పళ్ళు తెచ్చి నాడేమో సంచీ యింట్లోనే వుంది. పోనీ అవైనా తిని యిన్ని నీళ్ళు తాగు అట్లా బెంగ పెట్టుకుని కూర్చోకు" అంది జయమ్మ.

ధనలక్ష్మి వెళ్ళి బైట గుమ్మంలో నిలబడింది. వీధంతా యిటూ అటూ పరికించింది. ఆమె మనసు రగుల్కొం టున్నది. జయమ్మ అన్న తర్వాత ఆ పళ్ళు పెంట మీద పారేసి రావాలని పించింది. పొద్దున్న ఎల్లమ్మతో చెబితే

"వాని మొకం వాడెన్నాళ్ళు వుంచు కుంటడే పిల్లలను! నీ ముందల తన ప్రతాపం సూపిచ్చుకోవాలని తీస్కపొయ్యిండు. వానికి పిల్లలను సాదే తెలివుంటే యిట్లెందుకుంటడే. ఎవ్వని నెత్తి మీదనో చెయ్యి పెట్టి రెండు రోజులు తెల్లగ పుల్లగ తిరుగతడు. సంగతి తెలు వంగనే మళ్ల వాడొచ్చి నాలుగుదన్ని అయన్ని గుంజుకపోతె ఎప్పట్లోలె



చతుర

ఐతడు. వాడు బాగుపడే మనిషి కాదు. నీ పిల్లలను నువ్వే వుంచుకో అని తెచ్చి పడేస్తడు సూడు" అంది ఎల్లమ్మ.

కాని -మధ్యాహ్నమైంది.

ఇంటిముందర కూర్చుండే తెలిసిన వాళ్ల వచ్చి

"ఏమిటీ? ఎందుకు కూర్చున్నావు?" అని అడుగుతున్నారు. తను పైకి "ఊరికినే" అంది. కాని నిస్సహాయతతో, నిరీక్షణతో, భయంతో మనసు బేజారై పోతున్నది.

జయమ్మ పడుకుని లేచి, ధనలక్ష్మి కనిపించక పోవటంతో బైటికెళ్ళి చూసింది. ధనలక్ష్మి ఆవల గుమ్మంలో కూర్చుని వున్నది.

"ఓ ధనలక్ష్మి, అదేమిటమ్మా. పొద్దవుతున్నది. అయ్యో యిదేం అన్యాయం. అప్పట్నించీ యిక్కడే కూర్చున్నావా? ఇంట్లోకిరా. ఇంత కాఫీ చేసిస్తాను తాగు. నువ్వు మరీ అనుమానం మనిషివి ధనలక్ష్మి. తండ్రి వెంట పిల్లలు పోయినా నీ కింత అనుమానమా? ఎక్కడికి పోతారు, వాళ్ళు వస్తారుగాని నువ్వైతే యింట్లోకి రా"

ధనలక్ష్మి మాట్లాడలేదు. ఇటు తిరుగ లేదు.

"ఇదిగో నన్ను నమ్ము. రాత్రినించి మంచి నీళ్లయినా ముట్టుకోక పోవటం బాగాలేదు కనీసం కాసేపు అట్లా నడుం వాలుద్దువు గానిరా. పొద్దుట్నించీ అలా కూర్చుంటే అందరూ ఏమనుకుంటారు. రా" అంది జయమ్మ ధనలక్ష్మి చెయ్యి పట్టుకుని లేపుతూ.

"ఒద్దు. జయమ్మా, నన్నిడువు, ఒస్తలే.....ఎక్కడైనా కూర్చునుదేగ ఇక్కణ్ణే కూర్చోనీ" అని చెయ్యి విడిపించుకుంది ధనలక్ష్మి. ఆమెమాట పదునైంది. ఆమె గొంతులో కోపం కనిపిస్తున్నది. ఆమె విదిలించుకోవటంలో మొరటుతనమున్నది.

"నీ యిష్టమమ్మా మంచిమాటచెప్పినా నీకు కోపమొస్తుంది. పలకరించటమే తప్పైనట్టుంది" అంది జయమ్మ విసురుగా వెనక్కి తిరిగి.

ధనలక్ష్మి లేచి జయమ్మ వెంట వచ్చి, "నా మనసు బాగాలేదు జయమ్మా. నువ్వే సూడు. నన్నింట్లకొచ్చి ఏం చెయ్యమంటవు? అన్నీ సూసుకుంట నువ్వు గూడ నా మీద కోపం తెచ్చుకుంటె నేనేంగాను జయమ్మా. నా బతుకిట్లై పోయింది. ఆఖరికి నా పిల్లల్ని గూడ వేరు చేసి ఏం పుణ్యం కట్టుకుంటాడు!" అంది ధనలక్ష్మి ఏడుస్తూ.

"ఏమో ధనలక్ష్మి. నువ్వు అనవసరంగా భయపడు తున్నావు. లేక లేక తీసుకు పోయాడు గదా. వాళ్ల సరదాలన్నీ తీర్చి తీసుకొస్తాడు ?" ఇంకేం చేస్తాడు? అంది జయమ్మ.

"ఏమో పెద్దదాని కంటె సరె" దానికి సినిమాల షోకున్నది. బట్టల షోకున్నది గని చిన్న పోరి; అదింక నోట్ల పాలు గూడ మరువ లేదు. రోజు రొమ్ము పెట్టుకోని పండుకుంటది. అదెట్లుంటదమ్మా. నేను పొయ్యి వొచ్చే టప్పటికే అదంత ఏడుస్తది. హయ్యో. ఇంకేం జెయ్యనుదేవుడో. ఒక్కసారి సావొచ్చినా బాగుండు. ఇగ నా వశము గాదు దేవుడో" అంటూ శోకాలు ప్రారంభిం

చింది.

జయమ్మ తనకోసం కాఫీ చేసుకుని అందులోనే కొంచెం ధనలక్ష్మి కిచ్చింది. ధనలక్ష్మి అక్కడ కాసేపు కూర్చుని మళ్ళీ గుమ్మంలో కెళ్ళి కూలబడింది. సాయంత్రం కూరగాయల బళ్ళు వస్తున్నాయి గంపల వాళ్ళు తిరుగుతున్నారు.

ఓ కూరగాయల మనిషి అటుపోతూ.

"ఓ లచ్చమ్మా, ఇయ్యాల పనికి పోలేదా? అంటూ ధనలక్ష్మి దగ్గర కొచ్చింది.

"పోలేదు బాగున్నావా బాలమ్మా?" అంది ధనలక్ష్మి.

"ఇంక దాందెగ్గర్నే వున్నావా? అది నీకు ఎక్కువ కూలిస్తున్నా ఏమిదా?" అంది బాలమ్మ.

"అదే కూలి. దానింట్ల వున్నందుకు దాందెగ్గెర పని చెయ్యకపోతే వూకుంటాది మరి. ఈ యిల్లు యిడిస్తె దాని దెగ్గెర కూలి గూడ మానేస్త" అంది ధనలక్ష్మి.

"మా యెంట రారాదు కూరగాయలు యిస్తం అమ్మకికి. దాని కూలి కంటె ఎక్కువే గిట్టుతది" అంది బాలమ్మ.

"మొదట దాని యిల్లు ఖాలి చెయ్యాలె. అప్పుడు వేరే పని చెయ్యాలె. అసలే దాని నోరు మంచిది గాదు. దాంతోని ఒగ మాటందుకు. ఇంక నాలుగు రోజుల కోసం."

"ఇల్లు దొరుకుత లేదా? మా బస్తీల యిల్లు సూపిస్తరా" అంది బాలమ్మ.

ధనలక్ష్మి మాట్లాడ లేదు.

బాలమ్మ కొంచెం సేపు కూర్చుని.

"ఊఁ. నీ మొగడొస్తున్నడా? ఇప్పుడు బాగుంటున్నడా?" అని అడిగింది.

"నిన్న ఒచ్చిండట. నేను పొలందగ్గిర సచ్చిన. బట్టలు బొమ్మలు కొనిస్తనని పిల్లలను తీస్క పొయ్యిండట. ఇప్పటి దాకా జాడ లేదు."

"అయ్యో అంత గరువమెచ్చిందా ఒక్కసారే, ఇప్పటి దాకా ఏం కొనిస్తున్నడమ్మ పిల్లలను తీస్కపోతె నువ్వేం జేస్తవో సూడాలను కుంటున్నాడేమొ ఇట్లనన్న వాని కాళ్ల మీద పడాల్న నేమొ."

తన మాటలన్నీ బాలమ్మ అన్నట్ట అనిపించింది ధనలక్ష్మికి.

"ఏం జెయాలమ్మా. వాని పగంత యిట్ల తీర్చుకుంటున్నడు. నాకేం తెలుసని బాలమ్మా, ఏం జెయ్యాను? యాడికి పోను? నా మనసుల మనసు లేదు బాలమ్మా. నా వుసురు ముడుతది. ఆఖరికి యిట్ల గూడ నాకు మనసు నిమ్మళం లేకుండ చేస్తున్నడు."

"ఇంక ఇంకసేపున్నంక ఎల్లమ్మ కొడుకు లొస్తారు. వాళ్ళకు జెప్పు. ఇసుంటి పనులల్ల మశూర్. వాన్ని యానొన్ని పట్టుకోని నాలుగు తన్ని పిల్లలను తెస్తరు" అంటూ గంప నెత్తుకుని వెళ్ళి పోయింది బాలమ్మ.

చీకటిపడింది. చలికాలం ఇళ్ళ తలుపులు త్వరగా మూతబడుతున్నాయి. "ఈ రాత్రిగూడా వాళ్ళు రారు" అనిపించింది. అలా అనిపించటంతో ఆమెకు తన మీద తనకు నమ్మకం సడలిపోయింది. తనకెవ్వరూ సహాయం చెయ్యరు. తననెవ్వరూ ఒంటరిగా బ్రతుక

నివ్వరు. తన పిల్లల్ని తన దగ్గర ఉండ నివ్వరు. భర్త తోడుగా వుంటేతప్ప తను బతకటానికి వీల్లేదు. తన పక్షం ఎవ్వరూ మాట్లాడరు. అన్నిటికీ, ఎప్పటికీ తనదే తప్పు. తను యిలా బతకటమే తప్పు. పోనీ పిల్లలు అక్కడే సుఖంగా వుంటారేమో, బాగా డబ్బు సంపాదించాడేమో. కానీ, చిన్నపిల్ల అది వుండలేదు. పాల కోసం బెంగపెట్టుకుని ఏడ్చి ఏడ్చి అలసిపోయిందేమో. అంత చంటిపిల్లను తన నుంచి దూరం చెయ్యటానికి చేతులెలా వచ్చినాయి అతడికి ? తనమీద పగ సాధించటం కోసం దాన్ని హింసిస్తాడా ? వాళ్ళెక్కడున్నారో ఎలా తెలుస్తుంది ? కాళ్ళమీద పడైనా పిల్లల్ని తెచ్చుకునేది.

అలాగ గుమ్మంలో కూర్చుంటే ఎంత రాత్రైందో తెలియలేదు. కానీ ఆకలితో తల తిరిగింది. వీధిలో జనసంచారం లేదు. ఇంట్లోకొచ్చి ఎప్పుడో చేసిన ఓ రొట్టెముక్క వుంటే తిని మంచినీళ్ళు తాగింది. ఎంతకూ రాత్రి గడవనట్టే వుంది. ప్రతి నిమిషమూ, ప్రతి క్షణమూ పిల్లలు మనసులో మెదిలారు. ప్రతిసారీ, చిన్నది ఏడుస్తున్నట్లే, దాని గొంతు తడారిపోతున్నట్లే, అది 'అమ్మా' అని తన పైటతీసి రొమ్ము నోట్లో పెట్టుకున్నట్టే అనిపించి కలవరపడేది. కన్నీళ్లు వచ్చేవి. రెండు మూడుసార్లు నిద్రలేచి పెద్దగా ఏడ్చి మళ్ళీ తెలుసుకుని మానేసేది. చచ్చిపోయినా బాగుండును అనిపించేది. మళ్ళీ, చంటిదానికోసమైనా బతకాలనిపించేది. వాళ్ళు దొరక్కపోతే తను చావటం ఖాయమనిపించింది.

ఎదుటింట్లో గోలతో ఆమె క్షణం తన విషయం మరచి అది ఆలకించింది.

"ఒచ్చేవారం గిరిజా, మా అత్తయ్యా వస్తున్నారు. ఉత్తరం వచ్చింది" శివాజీ గొంతు.

"వస్తే ?"

"ఇదివరకులాగా నువ్వు వాళ్లు రాగానే మాట్లాడకుండా మొహం మాడ్చుకుని ఏడమొహం, పెడమొహంగా వున్నావో వాళ్ళ ముందరే నీ సిగ్గు తీస్తాను జాగ్రత్త".

"ఈ ఒక్కగదిలో మనం వుండటమే యిబ్బందిగా వుంది. ఇంకా వాళ్ళుకూడా ఎక్కడ పడుకుంటారు? వాళ్ళను మీ బంధువులింట్లోనో, ఎక్కడో వుంచితే బావుండదా?" అంది జయమ్మ.

"ఆయ్ వెధవముండా. వాళ్ళు అంత దూరంనించి క్రిస్మస్ శలవులకు ఈ ఊరొస్తుంటే, ఎక్కడో వుంచమంటావే, కుళ్ళుముండా. ఏం వాళ్ళకు నాలుగు రోజులు చేస్తే నీ చేతులు పడిపోతాయా? ఇట్లాంటి వెధవ వేషాలు వేయొద్దని నేను ముందరే చెబుతున్నాను నీకు. ఇహ నీ యిష్టం. వాళ్ళను చూడటం అంత కళ్ళమంటగా వుంటే నువ్వే పుట్టింటికి వెళ్ళి చావు వాళ్ళను రావొద్దనటానికి నువ్వెవత్తివే ?"

"వంటంటే చేసిపెడ్తానుగానీ, వాళ్ళ ముందర కూడా నన్ను యిష్టమొచ్చినట్లు తిడతారు. నా ముందర ఆ అమ్మాయితో పెళ్ళాంతో మాట్లాడినట్టు అన్నీ మాట్లాడతారు. నాకెట్లా వుంటుంది?"

శివాజీ బిగ్గరగా నవ్వి,

"పేడమొహందానా, నీతో ఏం

మాట్లాడాలే? ఐనా ఎవర్నెక్కడుంచాలో నాకు తెలుసు. నీ పని యిప్పటికే కుక్క సింహాసనం మీద కూచున్నట్టుగా వుంది. అది నీలాగా వెధవ మొద్దుగాదు. చదువు కుంది. మాటకు మళ్ళీ తెలివిగా జవాబు ఇస్తుంది".

"నేనుకూడా అట్లా మాట్లాడితే వూరు కోరుగామరి. నన్నేమో జవాబిస్తే మొహం వాచేలా తిడతారు. వాళ్ళేం మాట్లాడినా బాగానే వుంటుంది".

"ఛట్ నీతో నాకేమిటే. ఏదో ఇంత మాత్రం అద్వాన్నుగా చెప్పాను సంతోషించు. ఈ వారంలో ఒళ్ళు రెడీచేసుకుని జాగ్రత్తగా మసలుకున్నావాసరే. లేదా, ముండా ఆ దండెం కర్ర నీ వీపుమీద విరుగుతుంది. తరువాత నేను చెడ్డవాణ్ణంటే లాభంలేదు".

"మీరెందుకు చెడ్డవాళ్ళు. నేనే చెడ్డదాన్ని" అంది జయమ్మ.

"ముండా..... నీకు పెడసరంగా మాట్లాడటం కూడా అలవాటైందా?"

జయమ్మ చెంప ఛెళ్ళుమంది.

"ఏడుస్తున్నావా ? ఏం, ఎవరు వినాలనే నీ ఏడుపు?"

"ఇంకా వాళ్లు రాలేదుగా ఇప్పుడన్న ఏడవనివ్వండి. వాళ్లొచ్చిన తర్వాత ఏడవ కూడదుగా".

"ఊఁ. చూస్తాను చూస్తాను. వాళ్ళు వెళ్ళేటప్పుడు నీ గురించి ఏమైనా అనుకున్నట్లుగా నాకు తెలిసిందా ఇక నీ అంతు చూస్తాను".

ధనలక్ష్మికి నిద్ర తేలిపోయింది.

శివాజీ గురక వినిపించింది. జయమ్మ వెక్కిళ్ళు తను నిద్రపోయేదాకా వినిపించాయి.

అట్లాగే ఆమెకు తెల్లవారింది.

ఇంకా మబ్బుండగానే ఎల్లమ్మ దగ్గరకు పోయింది.

"రా బిడ్డా. ఇగో ఈ బర్రెలను కడుగుజెర. ఏమాయె నీ పిల్లలొచ్చినా?" అంది ఎల్లమ్మ.

ధనలక్ష్మి చేతిలోని గ్లాసు కిందపెట్టి కొబ్బరిపీచు తీసుకుని బర్రెను తోముతూ,

"లేదు పెద్దమ్మా. ఎట్లనన్న నువ్వే మద్దతుచెయ్యాలె. రెండురోజులాయె— యాడికి తీస్కపొయ్యిండో పత్తాలేదు. పెద్దమ్మా నీ కాళ్ళు మొక్కుత. నువ్వే నన్నీ ఆపద నుంచి కాపాడాలె" అంది.

"వాడు యాడికి పోతడు బిడ్డా. నీ కంటికక్కనిపిచ్చకుంట దాగుంటడుగని. అప్పులోళ్ళనించి తప్పిచ్చుకోని యాడికి పోతడే, ఉండు. మావోణ్ణి పిలుస్త." అని "అడివయ్యా. ఓరి అడివయ్యా. ఇట్లరా బిడ్డా? కోటయ్యా యాడుంటడురా: జెర వాణ్ణి పట్టుకోవాలె. ఇగో మొన్న లచ్చువమ్మ పొలానికి వచ్చినప్పుడు వాడు పిల్లల్నెత్తుకపొయ్యిండు, బద్మాష్ ముండాకొడుకు" అంది.

"ఏమో యాడుంటడో దొంగ బాడుకావు" అన్నాడు అడివయ్యా.

"అట్లనకు బిడ్డా. ఆడదాని ఘోష, జెరవాని పని జెయ్యి బిడ్డ ఎట్లగన్నా, నువ్వు పట్టుకురా, నేను జాడిచ్చి అడుగుతగని. పిల్లలు లేరని యిది పొలానికొస్త లేదు" అంది ఎల్లమ్మ.

"యాడికి పోతడే. రెండు చౌరస్తల్ల కాస్తె సరి" అన్నాడు అడివయ్యా.

"బిడ్డా. బిడ్డా ఆ పనే చెయ్యిరా. ఇయ్యాల సైకిలు తీసుకొనిపొయ్యి పట్టుక రారాఅట్లాగే మస పైసలు గూడ అడుగు వాడేమున్న ఎక్కువ తక్కువ మాట్లాడితె

ఈడ్సుక రా రా."

"ఆ. ఆ. పోతలే" అన్నాడు అడివయ్య బట్టలను తోలుకుని పాలు పిండటానికి పోతూ,

"ఇం కే ం, ఇగి దొరుకుతడులే. ఇయ్యాళ నువ్వు పనికిరా, ఫి క రు చెయ్యకు" అంది ఎల్లమ్మ.

"జెర గట్టిగ చెప్పు పెద్దమ్మా. మల్ల మరిశిపోతడు" అంది ధనలక్ష్మి.

"ఆడసుంటోడు గాదే. నీ కెందుకు పొద్దుమీకె తలికి నీ పిల్లల్ని నీకు ఒప్ప జెప్పుతగని నువ్వైతె పనికి రాపో జెల్ది" అంది ఎల్లమ్మ.

ధనలక్ష్మి వచ్చేటప్పటికి జయమ్మ యింకా ముక్కు చీదుతునే వుంది. శివాజీ డ్యూటీకి పోవటంవల్ల ఆమె యింకా బాహాటంగా యేడుస్తున్నది.

"పాడు బతుకు దానితో ఏడిస్తే ఏడ వనీ నా ముందరే దానితో కులకాలేమో. అ ప్పు డు గా ని తృ ప్తి గలగదేమో. నన్నెంత హింసిస్తే తనకంత సంతోష మేమో. చూ స్తా ను చూ స్తా ను. ఇదీ ఎన్నాళ్ళు సాగుతుందో. ఎదురు చెప్పక పోబట్టే కదా ఇంత లోకువ. ధనలక్ష్మి ఎప్పుడో నీలాగే నేనూ చేస్తాను చూడు" అంది జయమ్మ.

ధనలక్ష్మి ఏమీ మాట్లాడక పంటచేసుకుని పొలానికి పోయింది.



మధ్యాహ్నమైనా ధనలక్ష్మికి వెంట తీసుకపోయిన అన్నం తినాలనిపించలేదు. మిగతా కూలీలు, ఎల్లమ్మ అందరూ తింటుంటే తనూ వెళ్ళి కూర్చుని అయిష్టంగానే అన్నం కలిపింది.

"అ ట్ల కూ సో కే పిచ్చిదానా. మావోడు పొయ్యిండు గద. తీసుకొ స్త డులే" అంది ఎల్లమ్మ,

"పిల్లల్లేకపోతె ఎట్లుంటది ఎల్లమ్మా. నువ్వెంత చెప్పినా ఆమె ఫికరు ఆమెది"

"ఔనే మరేం జేస్తము ! వాడొచ్చిం దాక ఓపిక ప ట్టా లె. వాడొచ్చినంక కోపమంత తీర్చుకోవాలె. ఉండుండు వానిపని చెపుత."

ఇంతలోనే అడివయ్య ఒక సైకిలు మీద, వెనకే కోటయ్య మరో సైకిలు మీదా వచ్చారు.

కోటయ్య మ ం చి దు స్తు ల లో చలువ కళ్ళద్దాలతో ఠీవిగా వున్నాడు.

"ఏం ఎల్లమ్మక్కా నా కోసమేమో దొంగోని కోసం పంపినట్టు పంపినవు నీ కొడుకును" అన్నాడు కళ్ళద్దాలు తీసి పట్టుకుని.

"నీ అక్కనోట్లె పున్నుబడ. ఇంక ఏమక్కరా ? నువ్వు దొంగోనికన్న అన్యాయమైపోతివి. నీ కేమొచ్చిందిరా పోరలను దీసుకోని అట్ల పొయ్యినవు ?" అంది ఎల్లమ్మ తినటం ఆపి.

"ఎవ్వరి పోరలను?"

"మల్ల అదే మాట. అట్ల తల్లిదగ్గర లేకుంట తీసుక పోతారురా. రెండు రోజులాయె. అది తింటలేదు. ఫికరు పెట్టుకోని కూసున్నది" అంది ఎల్లమ్మ.

"దానికి లేని ఫికరు నీకున్నట్టుంది. నువ్వేశాన మాట్లాడుతున్నావు" అన్నాడు కోటయ్య సైకిలుకు స్టాండువేసి జేబులోంచి సిగరెట్టు తీసి అడివయ్యకొకటిచ్చి వెలిగించాడు.

"ఎవ్వరు మాట్లాడేదేంది? నీకున్న పగ నా మీద తీసుకోరాదు. పిల్లల్నెందుకు ఏరు చేస్తున్నవు? ఆ చిన్నపిల్ల పాలులేక సస్తె నీ కండ్లు సల్లబడతాయా? అంత మొగోనివైతే నేనున్నప్పుడు నా కండ్ల ముందల తీసుకపోవలిశింది. నేను లేంది సూశి ఎత్తుక పొయ్యినావు?" అంది ధనలక్ష్మి.

"థూ థూ! నీ మీద నాకు పగేందే. నీ అసుంటోళ్ళకు పదిమందికి కూలిప నిచ్చిస్త. తక్కువ బుద్ధిదానా. నీ ఆలోచన ఎంతసేపు పగమీదనే వుంటది. నువ్వు పగ కోసం కూలి చేస్తున్నవు గని నాకేం తక్కువైందే! నీ వోలె వాళ్ళను గూడ కూలీలను జెయ్యొద్దని తీసుక పొయ్యిన అక్కడ వాళ్లు సుఖంగ వున్నారు" కోటయ్య ప్రతిమాటలోనూ ఆమె మీద ఏవగింపు కనిపించింది.

"అట్లంటవేంరా. అదేం తప్పు పని చేసింది? నువ్వట్ల దాన్ని యిడిశి పొయ్యినందుకు పనిచేస్తె తప్పారా? నేను చేస్తలేనారా?" అంది ఎల్లమ్మ.

"సరె. సరె. ఈ నీతులన్ని నేను గూడ మాట్లాడుత. పనిచెయ్యిచ్చుకుంటోళ్లు అట్లనే మాట్లాడతరు. అది నా పెండ్లామైనందుకు నేనంటున్నా. నా దగ్గర కూలి పనిజెయ్యవే. ఆ లంబడోళ్లతోని కలిశిపని జెయ్యి. తప్పేంది?" అన్నాడు కోటయ్య.

"ఏమిరో, శాన శాన మాట్లాడుతున్నావు. ఇంత నీల్గుడు ఎక్కణ్ణించి ఒచ్చిందిరో. ఇంత మాట్లాడేటోనివి నా నా పైసలిచ్చి మాట్లాడురో."

"నీ పైసల సంగతి నీ కొడుక్కు చెప్పినలే. యాడికి పోవు" అన్నాడు కోటయ్య.

ఎల్లమ్మ అభిమానం అడ్డొచ్చి,

"నా పైసలు నా కొడుక్కేందిరా చెప్పేది! నా తోని చెప్పు. ఇప్పుడియ్యరా" అంది అరుస్తూ

"ఊకోవే. అది నేను తర్వాత చెబుతాలే. నా జిమ్మేదారి. పొద్దుమీకి అంత చెపుత గని ఊకో" అన్నాడు అడివయ్య.

ఎల్లమ్మ ఇంక ఆ విషయం కదపలేదు.

"దాని పిల్లలను దాని కియ్యరా. దాన్ని ఏడిపిస్తే నీకేమొస్తదిరా" అంది సముదాయిస్తూ.

"అరె మళ్ళ అదేమాట. నేను యాడికి తీస్కపోయిన. ఈడనే దీని సుట్టాలోళ్ళింట్ల వుంచిన."

"యాడా?"

"ఈడనే. శంకరమ్మోళ్ళని, దీని సుట్టాలున్నారు. ఇది నిన్నడిగింది గని

మావోళ్ళెనెవర్నయిన్నా అడిగిండా? పని గావాల్నని యింటింటికి దిరిగి మాకుల పోళ్ళల నా పేరు బద్నామ్ చేశింది గని పిల్లలకోసం యాడికన్నా దిరిగిందా? సక్కగ నీ దగ్గరకొచ్చింది."

"ఏమే, ఎవర్నడుగ లేదా?" అంది ఎల్లమ్మ ధనలక్ష్మితో

"అదెందుకడుగుతుంది! మీదికట్ల నిన్నడిగింది. లోపల దానికెంత ఖుషీ గున్నదని— పిల్లల జంజాటం పొయ్యిం దని."

"పో నీ, దానికి చెప్పి తీస్కపోవొద్దరా. ఇంత ఫికరుండేదిగాదుగద" అంది ఎల్లమ్మ.

"ఇగో. ఎల్లమ్మా, నేను మంచి మాట తోని చెప్తున్న. నువ్వు దానికి కూలి పనిస్తె— అది దానిష్టం. నీ యిష్టం, గని నువ్వు, మా సంసారం సంగతులు నాతోని మాట్లాడకు. వాట్లల్ల దఖల్ తీసుకోకు. అది ఇట్ల చెయ్యిబట్టి నా పేరు గూడ అందరి నోళ్ళల్ల పడుతున్నది. నువ్వేమన్న చెప్పేదుంటె దానికి చెప్పు. దాన్ని నీ దగ్గర కూలిపని చెయ్యిచ్చుకో, బానిస పని చెయ్యిచ్చుకో గని నా సంగతి, నా పిల్లలసంగతి నా తోని చెప్పకు. మళ్ల నేనేమన్న జవాబిస్తె నువ్వు మనసునొచ్చుకోవద్దు" అన్నాడు కోటయ్య.

"అయ్యో! కూలి పని చేశినంత మాత్రాన అది నీ పెండ్లాం గాకుంట పొయ్యినాదిరా. కావలిస్తె నాలుగు తన్నైన నా దగ్గరకు తీసుకోవాలె," అంది ఎల్లమ్మ.

"మళ్ళ, అదేమాట. నా సంగతి నువ్వు మాట్లాడొద్దు. అది నా పెండ్లాం అయితే నాతోని మాట్లాడుతది అప్పుడే నేనుదానికి జవాబిస్త. అంతేగని నువ్వు నడుమ తీర్పు జెప్పకు" అన్నాడు కోటయ్య

"సరె. మీ యిష్టం బిడ్డ. అది నిన్న ట్నించి నా వెంట బడ్డది. నువ్వొచ్చినవు, దానికి చెప్పినవు. సంపోయె. ఇగ మీరు మీరు ఏం జేసుకుంటె నాకెందుకు ఏమే, ఇన్నవు గద. మళ్ళ మళ్ళ నా దగ్గరికి రాకు. నన్నడుగకు, నీ మొగడు యిక్కణ్ణే వున్నడు. మాట్లాడు. ఏమొ, మంచికిపోతే చెడు అయ్యిందన్నట్టు వీడు నన్ను పట్టుకొని అంటున్నాడు. నీ కోసం వానితోని నేను మాటలు పడాల్నే? హుం "దరిద్రం ముండలు. సంసారం జేశే మొకాలు కావు. వాళ్లతోని, వీళ్లతోని చెప్పుకోని ఏడుస్తరు. మీరు మీరు కలిసి ఏట్లె పడుర్రి" అని ఎల్లమ్మ అంటుంటే,

"ఆ సగతి దానికి చెప్పు. నేను మళ్లా కలుస్త" అని అడివయ్యను దూరం తీసుకపోయి ఏదో చెప్పి కోటయ్య వెళ్ళిపోయాడు.

"లేవు లేవు ఈణ్ణే పొద్దుబాయె. పని జెయ్యరా యిగ" అంది ఎల్లమ్మ చుట్టూ చేరిన కూలీలను అదిలిస్తూ.

వాళ్ళు పోగానే ధనలక్ష్మి,

"పెద్దమ్మా. ఒకసారి నేను పిల్లలను సూశొస్త. మనసు బాగ లేదు" అంది.

"పోవే. నా కోసం కూలిచేస్తున్నవా. పొద్దటినించి ఏడుసుకుంటనే కూసుంటివి పో పో" అంటూ వెళ్ళిపోయింది ఎల్లమ్మ.

ధనలక్ష్మి పిల్లలకోసం బయల్దేరింది.

సాధ్యమైనంత తొందరగా పిల్లల్ని చూడాలని మనసు తహతహ లాడి పోతోంది. కాని కోటయ్యా మాటలవల్ల భయపడుతోంది. పిల్లల మనసు విరిచే శాదేమో. తన గురించి ఏమేం చెప్పాడో ఇన్నాళ్లు తను కష్టపడితే ఒక్కరోజుతో తనవైపు తిప్పుకోగలడా? పొలంనించి చాల దూరమే ఐనా నడిచింది.

హేమ శంకరమ్మ వాళ్ల యింటి ముందర ఆడుకుంటోంది. స్కిప్పింగ్ చేస్తోంది.

"అమ్మా" అంటూ దగ్గరకొచ్చింది. ధనలక్ష్మికి ఏడు పొగలేదు.

"బాగున్నారు బిడ్డా?" అందిహేమను దగ్గరకు తీసుకుని. లోపల్నించి శంక రమ్మ చిన్నపిల్ల నెత్తుకుని వచ్చింది.

"రా. ధనలక్ష్మి, రా. నువ్వు మొన్ననే ఒ స్తవనుకున్న రెండురోజులు పిల్లల్నిడిసి బాగనే వున్నవు" అంది.

ధనలక్ష్మి పిల్లను తీసుకుని గుండె లకు హత్తుకుని ఇంకా బిగ్గరగా ఏడ్చింది.

"నాకు చెప్పలేదక్కా. పిల్లలు యాడున్నరో తెలువక నేను యెంత యిదయిపొయ్యిన్నను కున్నవు!" అంది కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"అయ్యో. చెప్పలేదా? ఐనా ఎక్క డికి పోతరులే. మా యింట్ల పిల్లలే లేరాయె. తెచ్చి రెండు రోజులుంచుకో అంటె అట్లనే అన్నం. నువ్వెక్కణ్ణో పనిచేస్తున్నవని చెప్పిండు. అన్నంతపని చేస్తున్నవన్న మాట. పంతం నెగ్గిచ్చు కున్నవు" అంది శంకరమ్మ చిరు నవ్వుతో.

ధనలక్ష్మి మాట్లాడలేదు. పిల్లనుఒళ్లో వేసుకోని రొమ్ము నోట్లో పెట్టి తల నిమురుతూ కూర్చుంది.

"పాలు ఏమంత అలవాటు లేదమ్మ. రాత్రి జెరసేపు ఏడ్చింది అంతే రోజంతా బాగనే ఆడుకుంటది. అన్నం తిన్నది పాలు తాగింది. అదిగాక పెద్దదానికి బాగ సనువైంది. బాగనే వున్నరు పిల్లలు" అంది శంకరమ్మ.

హేమ కూడా వచ్చి పక్కన కూర్చుంది.

"నాతో చెప్పి రావొద్దానే" అంది ధనలక్ష్మి హేమతో.

"బజారుకు తీసుకొచ్చిండు. అక్క ణ్ణించి యిక్కడి కొచ్చినం. చిన్నమ్మ వుండు మంచె వున్నం. ఇయ్యాళ తీసు కొస్త నన్నడు. అంతలకే నువ్వొచ్చి నవు. నాయన చెప్పిండా?" అంది హేమ.

పిల్ల పాలు తాగాక రొమ్ముతో ఆడు కుంటుంది.

"లేదు. నేనే ఒచ్చిన" అంది ధన లక్ష్మి.

"యాడ పని చేస్తున్నవు ధనలక్ష్మి."

"మా యింటామె పొలంల."

"పాపం. ఇప్పుడు బాగానే వున్నాడు గద కోటయ్యా. ఇగ మానెయ్య రాదు. కోటయ్యా చెప్పుకోని ఒకటే బాధ పడు తడు. నిజమే. మనం ఆ పని చేసుడు ఏం బాగుంటుంది. ఒకరికొకరు మాట్లా డుకోని కలిశి వుండుర్రి. ఎన్నాళ్లమ్మ పంతాలు. మీరేమి చిన్న పిల్లలు గారు. పిల్లలు పెరుగుతున్నారు. మిమ్ములను సూశి వాళ్ళ మనసులు గూడ పాడై తాయి" అంది శంకరమ్మ.

ధనలక్ష్మి ఏమీ మాట్లాడలేదు.

ఆమెకు మాట్లాడే ఓపిక లేదు.

"మంచో చెడో మొగోళ్లతోనే మన బతుకు. వాళ్ళు పట్టు పట్టిన్రని మనం పట్టు పడితె ఐతదా' పట్టు- విడుపు అని ఊకెనా అన్నారా! ఇట్లచేస్తె ఆఖరికి పాడేయ్యేది నీ సంసారమే. నీ పిల్లలే ఎటుకాకుంట ఐతరు. వాళ్ళేదో మగ పిల్లలన్నట్టన్న గాకపాయె. ఇద్దరికి ఇద్దరు ఆడపిల్లలేనాయిరి. వాళ్ళ పెళ్ళిళ్లు ఏం బెట్టి చేస్తవు? ఒగరి మాట గాక పోతె ఒగరి మాటన్నా వినాలె. అట్ల మనోళ్ళందర్ని కాదని చేసుడు మంచిది కాదు. రేపు యింట్ల నాలుగు కార్యాలు జరిగే దున్నది. ఎవరన్న వచ్చేది పొయ్యేది వుంటది. ఇట్ల నీ దారి నువ్వు సూసుకుంటసంటె నీకు బాగుంటదేమొ గని సూశెటోళ్ళకు బాగుండదు. తర్వాత నీ యిష్టం" అంది శంకరమ్మ.

"ఇప్పుడిట్ల మాట్లాడుతున్నరు గని నేను పని చేస్తున్నప్పుడు ఇల్లు ఎట్లుం డెనో నీకు తెలుసు. నేను నీ దగ్గరికి గూడ ఒచ్చి అంత చెప్పలేదా?"

"అగో, ఆ పట్టుదలే నిన్నిందాకా తెచ్చింది. ఇంట్ల మొగోళ్ళెందుకున్న రమ్మా. మన పని, వాళ్ళు ఏమన్నా తెచ్చి పడేస్తె ఒండుడు. లేకపోతె పడుండుడు. ఇప్పటికైన నువ్వు సరిగ్గ ఆలోచించు. నీ కోసంగాక పోతె పాయె, పిల్లల కోస మన్నా ఆ పని మానెయ్యి. ఇన్నాళ్ళు ఇంత కష్టపడ్డవు. ఏనుగు పొయ్యి తోక మిగిలిందన్నట్లు అన్ని కష్టాలు అయి పొయ్యేటప్పుడే నీకీ బుద్ధి పుట్టింది. ఎందు కిట్ల తొందర పడ్డవు?" అంది శంకరమ్మ.

ధనలక్ష్మి మాట్లాడ లేదు.

హేమ తల్లి భుజం వూపుతూ.

"మొన్న మేం మల్ల సీన్మాకుపొయ్యి నమమ్మా" అంది.

"ఊఁ"

"ఎక్కడను కున్నవు? ఇక్కడ కాదు. చాన దూరం. బస్సుల పొయ్యిన మమ్మా. డబుల్ డెక్కు బస్సు"

"అక్కడ బిస్కోట్లు గూడ కొని చ్చిండు నాయిన. నువ్వు డబుల్ డెక్కు బస్సు ఎక్కినావమ్మా?"

"ఊఁ ఊఁ. ఎక్కలేదు"

"నాయనకు చెప్పితె మల్ల తీస్క పోతడు. మనం పోదాం. అమ్మా-నువ్వె ప్పుడన్న కోకకోల తాగినవే?" అంది హేమ.

ధనలక్ష్మికి అర్థం కాలేదు.

"కోకకోల సీసలల్ల అమ్ముతరు"

"లేదు. తాగలేదు."

"మేం తాగినం. అబ్బ. ఎంత సల్లగుంటది. తియ్యగుంటదే. చెల్లె గూడ తాగింది."

ఆ పిల్ల వుత్సాహానికి అంతులేదు తన జీవితంలోని విచిత్రాలు, కొ... అనుభవాలు అన్నీ చెప్పి తల్లి... ఆశ్చర్యపరచాలని వుబలాటం.

"నువ్వు 'జూ' చూసినవా?" అంది మళ్ళీ.

"ఏందే. ఏం మాట్లాడుతున్నవు ఏమో కొత్త బాస నేర్చుకున్నవ బాగనే వున్నదేశం. రెండు రో... లున్నవో లేదో అంత అట్ల మాట్లా...

చదు

తున్నవూ... అంది ధనలక్ష్మి విసుగ్గా.

"జూ! ఓరే అక్కడ అన్ని పెద్ద పులు, సింహాలుంటయి. తిరిగి, తిరిగి కాళ్ళు నొప్పులు పుట్టి నయి. ఎంత పెద్ద గున్నదను కున్నవు."

"సరె. సరెగ్గ నాయన అంత సూపిచ్చుండుగని, ఇంతకు మీరు వస్తరా యిక్కడే వుంటరా చెప్పునిగ్గ"

"అట్లంటవేం ధలక్ష్మి. చిన్న పిల్ల. అది సంతోషం చెప్పుతుంటె అట్ల విసుక్కుంటావు. నీ బాధదానికి తెలుస్తదా?" అంది శంకమ్మ.

"ఆఁ. అందరికి సంతోషమే. నాకే లేదు"అందిధనలక్ష్మిబ్టూర్చుతూ.

"చేతులతోని సుకున్నావు మరి. ఇప్పుదేమనుకుంటె ఏం లాభం."

"ఇంతకు మీరొ స్తరా. నన్ను పొమ్మంటరే?" అంది హేమతి

"నాయినొచ్చి తీసుకొ గన్నడు జెరసేపుండవే పోదాంగని" అంది హేమ.

"సరె. మీరుండని. నేను పోతున్న" అని ధనలక్ష్మి లేచింది.

"కూసో ధనలక్ష్మి, చా తాగి పో..." అని ధనలక్ష్మిని కూర్చోబెట్టి శంకరమ్మ టీ చేసి తీసుకొచ్చింది

ధనలక్ష్మి మళ్ళీ 'నేను పోతున్న అంది హేమతో. శంకరమ్మ చిన్న పిల్లను ధనలక్ష్మికిచ్చి.

"హేమా, అట్లనొద్దు. అమ్మ వెంటపో. నాయన తర్వాత వస్తడు గని" అంది.

"పద" అంది హేమ అయి ష్టంగా.

ఈసారి ధనలక్ష్మికి నడిచే ఓపిక లేదు. రిక్షా మాట్లాడుకుని ఎక్కింది.

హేమ మళ్ళీ "నాయన రేపు చార్మినార్ సూపిస్త నన్నడు" అంటూ మొదలెట్టింది గాని తల్లి మొహం చూసి మాట్లాడలేదు.

"అన్నం వీళ్ళింట్లనే తిన్నరే?" అని అడిగింది ధనలక్ష్మి.

"ఒక్క పూట యింట్ల తిన్నాం. ఇంకో వూట హోటల్ల. అన్నం తినలే. దోశెలు, ఇడ్లీలు. అక్కడ కుర్చీలు, టేబుళ్ళుంటయమ్మా. వాళ్ళే తెచ్చి స్తరు అన్ని..."

"ఊఁ ఊఁ. మొన్న మీ నాయ నెంట వచ్చినవు. అక్కడ అప్ప డాలు ఎండబెట్టినవు గద. ఏమైత యనుకున్నవే? కాకులొచ్చి తినిపోతే?"

హేమ బిక్క మొహం వేసింది.

"నాయన జెల్ది రమ్మన్నడు. నాకు అవి యాది రాలెదు. నేను చేశినయే గద. మళ్ళీ చేస్తనులే" అంది.

రిక్షా దిగి యింట్లో కొచ్చారు. చిన్న పిల్లను దించి.

"ఇగో అప్పడాలు. ఆయాళ దుమ్ము దుమారం వానొచ్చి అంత ముద్దయి పొయినయి. ఏం, పైసలు కండ్లకు కని పిస్తలేవే? ఒకనాటి మురిపానికి చేశిన కష్టం మట్టిపాలు చేస్తావే? దరిద్రపురాలా, మిమ్ములను యింత కష్టపడి పెంచితె ఇయ్యాళ అక్కడి పాట పాడ్తావు? థూ,

కనికరం లేనిముండా. ఎన్ని పైసలు, ఎంతపిండి తెర్లయింది.! కష్టపడకుంట సంపాయించిన్ననుకున్నవే యిది ? ఆ దొంగ సంపాదన మీద అంత మోజు ఒచ్చినాదే? అది దొంగతిండే. నలుగుర్ని ముంచి తిన్నతిండి. పెయికి పట్టదే ? నేను రెక్కలు ముక్కలు చేసుకోని సంపాయిస్తున్ననే ? నాలుగు రోజులల్ల అంత బైట పడ్తది. ఎవ్వరిది కష్టపడ్డ సొమ్మో, ఎవ్వరిది లఫంగ సొమ్మో తెలుస్తది.నీకు జెరమొస్తె ఎవ్వరు నిన్ను దవఖానకు తీస్కపొయ్యింరే? ఎవ్వరు మీరు సావకుంట కష్టపడ్డరే. ఎవ్వరు మీ కోసం రాత్రింబగళ్ళు మేలుకున్న రే? ఇన్నాళ్ళు వాడు యాడికి పొయ్యిండే? అప్పుడు సుద్దపూసోలె 'నాయినాఅప్పులు తీర్చు. అమ్మను తిట్టియ్యకు' అంటివి గదనే ఆ మాటలిప్పుడేమాయెనే. కృతజ్ఞత లేని ముండా. ఇప్పుడు అక్కడి చిలుక పలుకులు నేర్చినావే. వాడు బాగ నేర్పిచ్చి, అవ్వి, ఇవ్వి కొనిచ్చి సీన్మాలు సూపిచ్చి నీ మనసు విరిచేశిండే. అంత యిష్టం లేనోళ్ళు యిన్నాళ్ళు నాదగ్గరుండి నా ప్రాణాలెందు తీశ్నే? నా తోని ఈ కూలిపనెందుకు చెయ్యినిచ్చిన్నే. ఆ నాడే నెత్తురు కక్కుకోని సావొద్దానే. ఇంక నా వుసురు ఎందుకు పోసుకుంటున్న రే? పో. ఇగ నా దగ్గరుండొద్దు. ఇద్దర అడికేపొయ్యి సావున్రి. నేనుగూడ వు పోసుకోని సస్త, నా పీడ మీకొద్దు. ? పీడ సోక్తొద్దు. నేనింత కష్టపడితె ఈ రోజు అందరికి తప్పైనాది. ముండలారా సావున్రి" అంటూ నిస్సహాయంగా పడ్డ పిల్లను గొడ్డును బాదినట్లు చెయ్యి నొప్పి పెట్టేదాకా బాదిం ఈ మధ్య ఆ పిల్ల ఏమందో, ఎంతేడ్చిందో ఆమె విని పించుకోలేదు. కేకలకు, ఏడ్పులకు, పెడబొబ్బలకు మామ్మగారూ, జయమ్మ వచ్చి విడిపించేయారు. కాని ధనలక్ష్మి ఈ లోకంలోదు. చేతి గాజులు పగిలి చెయ్యి నొపి పెట్టేదాకా, ఒళ్ళు అలిసి తల తిరిగి కూలబడేదాకా కొట్టింది. అట్లాగ ఆ నాడు ప్రాణాలూ ఇంక ఏ చప్పుడు చ్యెటానికి శక్తిలేక సొమ్మ సిల్లి గోడకు చేరగిలబడ్డాయి.

చిన్నల్ల ఏడుపుతో ధనలక్ష్మి కోలు కుంది. న్న దగ్గరకు తీసుకుని అట్లాగే పడుకు. ఎందుకింక బ్రతకటం ? ఊహ తెలిసిన పెద్దదానికి అక్కడి మోజుపట్టుకుంది. దాని తండ్రి దాని కోర్కెన్నీ తీరుస్తున్నాడు. ఇప్పుడది యిక్కడున్నా సుఖపడ లేదు. ఇక చిన్నదా-అది తనకోసం బెంగ పెట్టుకుం టుందని భ్రమపడ్డది గాని అది తను లేన్నా వుండగలదు. ఈ రోజు యిట్లా ఖ చస్తే మాత్రం వాళ్ళు బ్రతుక రూ? చక్కగా బ్రతుకుతారు. మనసు ంపుకోలేక తనే అనవసరంగా భయ పడింది. వాళ్ళకు తనిప్పుడు అవసరం కాదు, మరింక తనెందుకు బ్రతకాలి ?

"ధనలక్ష్మి, ఓ ధ న ల క్ష్మి" అంటూ కుదుపుతూ, లేపుతున్నారు. ఓ వైపు మామ్మగారూ, మరో వైపు జయమ్మా

"ఏమిటమ్మా యిదీ, పిల్లలు, పిల్లలు అని కలవరించి వాళ్ళను అలా కొట్టి చంపుతున్నావు. ఓ ధనలక్ష్మి లేవమ్మా, ఆ పిల్ల కళ్లు తేల వేసి ఎక్కిళ్లు పట్టింది

చూడు. లే. లేచి యిన్ని మంచి నీళ్ళు తాగించు" జయమ్మ అరుస్తున్నది.

"ఇదేమి ఖర్మరో తండ్రీ. ఎవరి మీదనో వున్న కసింతా పిల్లల మీద తీర్చుకుంటున్నావు. ఇందు కోసమేనా వాళ్ళను వెదికి, వెదికి పట్టుకొచ్చింది"

"లేవమ్మా ఆ పిల్ల చచ్చి పోతుంది. నా కాళ్ళు వణుకుతున్నాయి జయమ్మా, ఎవర్నైనా పిలువు"

ధనలక్ష్మి దిగ్గున లేచి కూర్చున్నది.

"ఒద్దమ్మగారూ, ఎవర్ని పిలువక్కుర్ని ఏమి కాదు లేన్రి" అంటూ లేచి కుండలోంచి నీళ్ళు ముంచు కొచ్చింది.

"బాగానే వుంది ఏం కాదంటున్నావా, ఆ పిల్ల వైపు చూసే మాట్లాడుతున్నావా? నీళ్ళు తాగించు మరీ"

ధనలక్ష్మి కూతుర్ని రెక్కపట్టి లేపి తన వైపు తిప్పి

"లే నీళ్ళు తాగు లేవవే" అంది హేమను వూపుతూ.

"నెమ్మది నెమ్మది. ఏం, అది పూర్తిగా చచ్చిందాకా నీ కోపం చల్లారనట్టుంది. హేమా, లే, మా తల్లివిగదూ, కళ్ళు తెరు" అంటూ మామ్మగారు హేమ పక్కనచేరి బుజ్జగించింది.

"బాగానే వుంది కథ ఇంట్లోనేమో ఎవరూ లేరు. ఏదన్నా అఘాయిత్యం జరిగితే ఎంత కావాలి! బాగుందమ్మా మీ కొట్లాటలూ మీరూ నాకు గుండెదడ వస్తున్నది హేమా, లే, లేచి యిలారా" అంది జయమ్మ.

హేమకు యింకా ఎక్కిళ్ళు వస్తూనే వున్నాయి. ఎటో చూస్తున్నది. అది దెబ్బలు తిన్న ఏడుపు గాదు ఏదో భయం పట్టుకున్నట్టుగా మాట్లాడటం లేదు.

"ఏం గాదులే జయమ్మా మీరు జెరసేపు అవతలికి పోన్రి. మేమేం సచ్చిపోముగని మీరు పోన్రి" అని ధనలక్ష్మి మళ్ళీ వెనక్కు వాలింది.

"హేమా యిట్లా రా, అయ్యో! అయ్యో! అది బెదిరి పోయిందమ్మా" అంటూ మామ్మగారు హేమను తీసికెళ్ళి వరండాలో తన వద్ద కూర్చో బెట్టుకుంది.

"ఎన్ని దెబ్బలో వీపు మీద ఇటు చూడు జయమ్మా చేతి వేళ్ళు ఐదు ముద్రలూ పడ్డాయి. పసిగుడ్డు, దానికేం తెలుసునని యిలాగ పగ తీర్చుకుంటున్నదీ. ఒళ్ళు కమిలి పొయ్యిందమ్మా... నేను చూడ లేను తల్లీ, ఈ పంతాలేమిటో, పట్టింపు లేమిటో, కసి తీర్చుకోవటమేమిటో– ఎక్కడి కెళ్ళారమ్మా హేమా, ఎక్కడున్నారు ?" అంటూ మామ్మగారు బుజ్జగిస్తే,

"నాయిన దెగ్గెర్నే– మా చిన్నమ్మ యింట్ల వున్నం" అంది హేమ

"చూశావా, జయమ్మా వాళ్ళేం తప్పు చేశారు? అశుభం, శుభం తెలియని పసిగుడ్డు– తండ్రి రమ్మన్నాడు గదాని పోతే యింత కొట్టి చంపాలా! అయ్యో ఏం కాలం వచ్చిందిరా తండ్రీ! వాళ్ళ తండ్రి వెంట వాళ్ళు వెళ్ళినా చూడలేక పోతోంది తల్లి" అని మామ్మ గారంటే

"ఈ వాళ్ళు చస్తే గాని తన కళ్ళ మంట చల్లారనట్టుందీ పుణ్యాత్మురాలికి. ఆమెకు ఎవరేం చెప్పినా కోపమొస్తుంది మామ్మగారూ, ఏమీ అనకండి తన

కేదైనా కావలస్తే మన దగ్గరకొస్తుంది గాని మనం ఆమెకు నచ్చేంది. ఏమి చెప్పినా యింత పొడుగు కోపమొస్తుంది. ముందు వెనకా చూసుకోకుండా అనేస్తుంది మామ్మగారూ 'నా దగ్గరికి రావొద్దు నాతో మాట్లాడొద్దు నాతో మాట్లాడొద్దు ఇవే మాటలు అంత అభిమానం వున్నది ఎప్పటికీ అట్లాగే వుండాలె తన అవసరానికి పూసుకు పూసుకు తిరగటమెందుకుమరీ ? ఈవిడే మొగుడై, అయనే పెళ్లాం కావలసింది. ఈవిడ ధోరణి చూస్తే అంత కోపం, పౌరుషం మళ్ళీ. మగదన్న గౌరవమన్నా లేకుండా అతడు తీసుకు పోయిన పిల్లల్ని అట్లా చావబాదుతుంధా!"

"కలికాలం జయమ్మా కలికాలం. నా జన్మలో ఎప్పుడూ చూడలేదు తల్లీ, ఇన్నేళ్ళు బతికి ఇవాళ చూస్తున్నాను పెళ్ళాం మొగుడి మీద బరితెగించి తిరగబడటం"

"ఆడవాళ్ళకే యింత పౌరుషంవుంటే యిక మగాళ్ళకెంత వుండాలో. ఈవిడ యింత గౌరవించినా, యింకా పిల్లల కోసం మనసు చంపుకోలేనిది అతడే వున్నట్టుంది" అంది జయమ్మ

"ఇంక మాట్లాడకు జయమ్మా, చూస్తుంటే, ఆమె మనల్ని కూడా నాలుగు దులిపేటట్టుంది అసలే ముసలి పీనుగని లేవలేను మాటకు మాట అనలేను"

బాగానే వుంది పీడ ఈ యింట్లో వుండటమే నేరమైనట్లుంది. ఈ బరితెగించిన. ఆడవాళ్ళు ఎంతకైనా సమర్థులే. మీకేం మామ్మగారూ, మీరు పనికి పోతారు ఇట్లాంటి వాళ్ళను పెట్టుకుని రోజంతా యింట్లో వుండాల్సింది నేను. మా అయనేమన్నా సరే ఎట్లాగైనా యిల్లు మార్చేస్తాం మామ్మగారూ"

హేమ వరండాలోనే నిద్రపోయింది. ధనలక్ష్మి ఒక్క మాటా మాట్లాడలేదు. ఆమె వీళ్ళ మాటలు వింటుందో, లేదో అసలు ఈ లోకంలో వుందోలేదో అన్నట్టుగా ఎటో శూన్యం లోకి చూస్తున్నాయి కళ్ళు. అప్పుడప్పుడూ కన్నీళ్ళు తుడుచుకోవటం తప్ప ఆమెలో చలనం లేదు.



తెల్లవారు జామున పెద్ద చప్పుడుతో యింటి ముందర ట్రక్కు ఆగింది

"తలుపు తలుపు ఓసేవ్, తలుపు" శివాజీ గొంతు.

జయమ్మ ఉలిక్కిపడి లేచి వెళ్ళి తలుపు తీసింది

"ఇంకేం మొద్దునిద్దే. ఎవరొచ్చారో చూడు పద అత్తయ్యా, గిరిజా పద లోపలికి తీసికెళ్ళవే" అంటూ గదమాయించాడు శివాజీ.

"రండి" అంది జయమ్మ, శివాజీ ట్రక్కులోంచి తీసి అక్కడ పెట్టిన సూట్ కేసును తీసుకుని యింట్లోకి నడుస్తూ.

"ఆగండి, చిన్న దీపం వుంది

లాంతరు వెలిగిస్తాను" అంది ముందర నడిచి

"అక్కర్లేదు జయా, ఇంకాసేపట్లో తెల్లారుతుంది ఇప్పుడు లాంతరెందుకూ" అంది గిరిజ తల్లి

"బావా, ఏమిటీ, యింకా ఈ యిల్లేనా? ఇది మార్చవల్లే వుంది. బాగా సేవ్ చేస్తున్నావు" అంది గిరిజ స్వెటర్ విప్పి మడత పెటుకుంటూ.

"ఏదో ఒకటి, నాకైతే ఆఫీసే యిల్లాయె. ఎప్పుడో ఓసారి వచ్చి తినిపోవటమేగా ఇంక వుండేది, అదే దానికి యింతకన్నా మంచి ఇల్లెందుకు"

"అయ్యో అట్లా అనకు. ఇంట్లో కరెంటు గూడా లేదు. పాపం, అక్కయ్యకు ఎంత యిబ్బందిగా వుంటుందో" అంది గిరిజ.

"ఇంట్లో తిరుగుతుంటే అదే కరెంటు తీగ. చూడు దాని అందం, దాని తెలివి, ఏమే నీ గురించేలే చెప్పేది. వెళ్ళు, త్వరగా నీళ్ళు వెచ్చబెట్టు. మొహాలు కడుక్కుంటారు వాళ్ళింకా వారంరోజులు నీతో యిబ్బంది పడాలిలే వెళ్ళు" అని జయమ్మకు పని పురమాయించాడు. గిరిజ తల్లి కూడా వెళ్ళి జయమ్మకు సాయం చెయ్యబోయింది.

"రా అత్తయ్యా, వంటిల్లు దాని స్పెషల్ ఫీల్డు, దాని రాజ్యంలోకి మీరు అడుగెట్టొద్దు. ఇలా రండి" అంటూ లోపల్నించి ఓ కుర్చీ, ఓ స్టూలు, మరో చిన్న ముక్కాలిపీటా తెచ్చి ఈవల వేశాడు

"రా గిరిజా కూర్చో" అని చెయ్యి పట్టుకుని కుర్చీమీద కూర్చోబెట్టాడు. తను ముక్కాలి పీట మీద కూర్చున్నాడు.

"ఊఁ కాలేజి ఎలా వుంది. ఏమే, గిరిజా, రోజూ నన్నెన్నిసార్లు జ్ఞాపకం చేసుకుంటావే?" అన్నాడు.

గిరిజ తల్లి కూడా వచ్చి స్టూలుమీద కూర్చుంది

"నెలకోసారి నీ మనియార్డరు వచ్చినప్పుడల్లా" అంది గిరిజ నవ్వుతూ.

"మొద్దూ అలాగేనా అతడితో మాట్లాడటం! మంచీ, మర్యాదా లేకుండా పోతున్నాయి నీకు" అంది గిరిజ తల్లి చిరుకోపంతో.

"అననీ అత్తయ్యా అననీ నన్నుకపోతే యింకెవర్నంటుంది. దాని పొగరంతా యిట్లా గాదు అణిగేది"

"ఆఁ ఎట్లా మరీ?" అంది గిరిజ రాగం తీస్తూ "టైం రావాలి ఆ రోజు చూపిస్తానే నా తడాఖా"

అన్నాడు శివాజీ ఆమె నవ్వులో నవ్వు కలుపుతూ.

"అక్కా.వింటున్నావా బావ మాటలు జాగ్రత్త అక్కోయ్. మీ ఆయన్ను అదుపులో పెట్టుకో. దేశంలో ఆడపిల్లల్ని క్షేమంగా వుండనిచ్చేటట్టు లేడీ మహానుభావుడు" అంది గిరిజ కేకేస్తూ.

"ఉష్, దాన్ని డిస్టర్బు చెయ్యకు, అది లోపల తపస్సు చేసుకుంటోంది"

"అక్కా నీ కోసమే తపస్సు చేస్తున్నదిలే, నువ్వెవ్వరికోసం చేస్తున్నావు కొంగ తపస్సు?"

"చాల్లే ఏమిటా మాటలు, సమయం

సందర్భం లేకుండా" అంది గిరిజ తల్లి.

లోపల్నించి జయమ్మ,

"నీళ్ళు వెచ్చబడ్డాయి'' మొహాలు కడుక్కుంటారా?''అంది గొంతు పెగల దీసుకుని.

గిరిజ మొహం కడుక్కుని రాగానే,

"ఏమే, కాఫీ అయిందా, త్వరగాతే, అడిగిందాకా యివ్వొద్దనుకున్నావేమిటి?" అన్నాడు శివాజీ.

"ఇదిగో ఒక్క నిమిషం, డికాషన్ వడబోస్తున్నాను"

"ఇన్‌స్టంట్ కాఫీ ఏం లేదా బావా?" అంది గిరిజ.

"అసలే అది తీరిక ఎక్కువై ఏం చెయ్యాలో తోచక చస్తుంది, ఇక ఇన్‌స్టంట్ కాఫీ, ప్రెషర్ కుక్కర్లూ ఐతే..." అని ఏదో అనబోయి మాటలు దొరక్క నవ్వుతున్నాడు శివాజీ,

"కాదు బావా టేస్ట్" అంది గిరిజ.

"గిరిజా, ఓ సేవ్. నీకు దాని సంగతి తెలియదు అట్లాగ దాని గురించి జోక్సు వేసి నన్ను చంపకు, సాయంత్రం ఓ టిన్ను కొందాంలే, అదిక్కడి కొచ్చిన కొత్తలో కాఫీ గింజలకూ, పత్తి గింజలకూ తేడా తెలియక చచ్చింద"అని శివాజీ మళ్ళీ ఒకటే నవ్వు.

జయమ్మ కాఫీ తెచ్చింది రెండు గ్లాసుల్లో.

"చూశావా, అక్కా, నువ్వు మరీ అలుసిస్తున్నావు బావకు, నేనైతే నా, ఈసరికి ఒక్కొక్క మాటకూ లెక్క పెట్టి నూర్ గుంజీలు తీయించేదాన్ని" అంది గిరిజ.

"అదీ తీయించేదేగాని లెక్కలు రావు, ఏమే, పన్నెండో ఎక్కం చదువు" అని శివాజీ-ఒక్కటే, నవ్వు

జయమ్మ లోపలికెళ్ళింది బలవంతంగా చిరునవ్వు నవ్వుతూ.

"అత్తయ్య కూడా వచ్చింది. కాఫీ తే, ఇంక. టిఫిన్ సంగతి చెప్పు, ఏదన్నా మంచి రుచికరమైన టిఫిన్ చేస్తావా, లేక హోటలుకు పొమ్మంటావా, గిరిజా, నీకేమిటిష్టం?"

"చూశావా, నాకేది ఇష్టమో గూడా నీకు తెలియదు, డిస్క్వాలిఫైడ్" అంది గిరిజ

"ఉప్మా చెయ్యమంటారా?"

"యస్, జీడిపప్పు వేసి మరీ, ప్లస్ కొబ్బరిపచ్చడి, ఏం గిరిజా, నీకు ఇష్టమే గదూ. గారెలు, అది గారెల స్పెషలిస్టు"

"ఏదో ఒకటి కానీ" అంది గిరిజ,

"పప్పు నాన బొయ్యాలి, రేపు చేస్తాను లెండి గారెలు"

గిరిజ స్నానం చేసి వచ్చి తన టాయ్ లెట్ డబ్బా తీసుకుని కూర్చుంది

శివాజీ ఆబగా ఆమెకేసి చూస్తూ కూర్చున్నాడు,

"బావా. కాస్త ముక్కాలిపీట యిలా యివ్వు, అద్దం పెట్టుకోవాలి" అంది గిరిజ.

శివాజీ ముక్కాలి పీట ఇచ్చి ఓ చిరు చాప తెచ్చుకుని కూర్చున్నాడు.

"ఇంతకూ యివాల్టి ప్రోగ్రాం చెప్ప లేదు, రోజంతా ఇక్కడే కూర్చోమంటావా ఏమిటి మమ్మల్ని?"

''డోన్ట్ వర్రీ గిరిజా, నా ట్రక్కు వస్తుంది ఆగు" అన్నాడు శివాజీ.

"ఏమిటీ ట్రక్కును చూస్తూ కూర్చోనా? ట్రక్కు నీదే అయినట్టు మాట్లాడుతున్నావే?" అంది గిరిజ. ముసిముసి నవ్వులు నవ్వుతూ, అద్దంలో గిరిజ మొహంతో తన మొహం కలిపి మరీ మాట్లాడుతున్నాడు శివాజీ.

"ఒసేవ్ నువ్వేది కట్టుకుంటావు. నైలెక్సు తియ్యనా, జార్జెట్ తియ్యనా?" అంది గిరిజ తల్లి వాళ్ల ట్రంకు తెరుస్తూ.

గిరిజ శివాజీవైపు చూసింది.

"కాస్త పచ్చిమిరపకాయలు పట్టు కొస్తారూ, నిన్న ఇంటిముందరికి ఏ బండీ రాలేదు" అంది జయమ్మ గది గుమ్మంలో నిలుచుని

"నువ్వు కొనుక్కొచ్చుకుని తగ లడద్దూ. పొద్దున్నే మొదలెట్టావు చదవ టం" అన్నాడు చిరాకుపడిపోతూ.

"మిగతా సామాను కూడా కావాలి. ఇలారండి చెబుతాను" అంది జయమ్మ.

"అక్కా నీకే చీర యిష్టమో చెప్పు" అంది గిరిజ నవ్వుతూ.

"నన్నడుగు. దానికి తొమ్మిది గజాల ముతక హేండ్లూం చీర యిష్టం"

"పాపం, అక్కేం చేస్తుందిలే. నువ్వు అంత మంచి చీరలు తెస్తావు అక్కకు".

"చెప్పు త్వరగా" అంటూ శివాజీ విసురుగా లోపలికెళ్లాడు.

సంచి పట్టుకుని ఈవలకొచ్చి, ట్రంకులో వెదికి చిన్న బంగారు పువ్వు లున్న ఎర్ర నైలెక్సు చీరతీసి గిరిజమీద వేసి "ఇది కట్టుకో" అన్నాడు సంతో షంతో పొంగిపోతూ.

"మైగాడ్. ఇదిప్పుడు కట్టుకోనా?" అంది గిరిజ చిలిపిగా.

"నిన్నెవరూ ఎత్తుకుపోకుండా నేను చూస్తానులే".

"ఆఁ. చూస్తావు దొంగకు తాళం చెవులిచ్చినట్టే" అంది గిరిజ.

"హహ్హహ్హ వన్ మినిట్. ఇప్పుడే వస్తాను" అంటూ హడావిడిగా శివాజీ బజారుకెళ్ళాడు.

అతడు వచ్చేసరికి గిరిజ ఆ ఎర్రటి చీరలో ముస్తాబై కూర్చుంది.

రాగానే, గిరిజను చూసి ముగ్ధుడై,

"స్టన్నింగ్. థాంక్యూ" అన్నాడు.

"షటప్" అంది గిరిజ కృత్రిమ కోపంతో.

టిఫిన్ చేసేసరికి ట్రక్కు వచ్చింది.

"ఒసేవ్, మేం అలా గోలకొండ చూసి మధ్యాహ్నంవరకు వస్తాంగాని నువ్వు వంట చేసిపెట్టు. ఇదిగో, ఇంకా ఏమన్నా కావలిస్తే కొనుక్కురాగానీ మళ్ళీ అదిలేదు, ఇదిలేదు అని మాత్రం ఏడవకు" అంటూ జయమ్మకు రెండు రూపాయలిచ్చి,

"పద గిరిజా" అంటూ గిరిజ భుజం మీద తట్టి బయల్దేరాడు శివాజీ.

"ఇంతకూ నీకు మీ ఔరంగజేబు పర్మిషనిచ్చాడా బావా. ట్రక్కు తిప్పు తున్నావుగాని" అంది గిరిజ.

"వీర శివాజీని. వాణ్ణి చంపేస్తాను, హొడిచేస్తాను" అన్నాడు శివాజీ సంతో షంతో ఎగురుతూ.

వాళ్ళు వెళ్ళిన తర్వాత జయమ్మ విడిచిన గుడ్డలన్నీ నానబెట్టి ఉతకటానికి కూర్చుంది.

"జయమ్మా, వీళ్లేనా ఒస్తారన్నది?" అని పలకరించింది మామ్మగారు. కానీ,

జయమ్మ మాట్లాడలేదు.

ధనలక్ష్మికి కూడా పలకరించాలని లేదు. ఆమె ఎవర్నీ మాట్లాడించకుండా గబగబా వంట చేసుకుని పొలానికి పోయింది. ఆ తర్వాత హేమ చెల్లెలికి స్నానం చేయించి, గుడ్డలేసి, అన్నం తినిపించింది.

పొలంలో ఎల్లమ్మ వైఖరి మారినట్టుగా గ్రహించింది ధనలక్ష్మి. ఆమె ఊరికే చిర్రుబుర్రులాడుతున్నది. ధనలక్ష్మి ఎరువు కలుపుతుంటే,

"నీది పనిచేశె మొకమోలె లేదు. జల్దిజల్ది చెయ్యి" అంది ఎల్లమ్మ.

ధనలక్ష్మి తల లేపకుండా పని చేస్తూనే వుంది.

"ఏమే, పిల్లలు దొరికిన్రా ?" అంది మళ్ళీ.

"ఆఁ దొరికిన్రు"

"మరి అంత యిది చేస్తివేమే, వాడు ఎత్తుకపొయ్యి దాశినట్టు చెప్పితివేమే, తాకట్లదానా. ఏడ్సి బెదిరిస్తావు అందర్నీ! నీ మొగడేగదనే తీస్కపొయ్యింది. ఇంకెవడో తీస్కపొయ్యినట్లు మా ఇజ్జత్ తీస్తివిగదనే. నిన్న వాడొచ్చి మాట్లాడుతుంటె ఒకటనకపోతివి, రెండనకపోతివి, పాతేసిన గుంజోలె సూస్కుంట నిలబడితి. వాడేమొ నన్ను తిట్టె. మీరు మీరు కొట్లాడుకుంటె నడుమ నేనేం చేశిన్నే? ఛీ అసుంటోళ్ళమీద కనికరం సూపిచ్చుడే పాపమే"

"అదిగాదు పెద్దమ్మా"అని ధనలక్ష్మి అనబోతుంటే,

"మల్ల మాట్లాడుతవు తెగిచ్చిన ముండా. మొగనిమీద చెప్పుకుంట తిరుగుతావు వూరంత. నువ్వు మాట్లాడుతున్నవని కూలిస్తె వాడొచ్చి నన్ను అంటాడు. వానితోని సంసారం జెయ్యని దానివి పెండ్లెందుకు జేసుకున్నావేమతి. ఇడిశిపెట్టరాదు. నీకు ఇజ్జతున్నదిగని వానికి లేదానే ? నువ్వు మొగణ్ణి కొట్టి మొరబెట్టే ముండవ్"

అని యింకా ఏమేమో తిట్టుకుంటూ పోయింది ఎల్లమ్మ.

ధనలక్ష్మికి భయం మొదలైంది.

సాయంత్రం కూలీ తీసుకునివచ్చింది. ఎల్లమ్మ తనను ఓ రకమైన వెగటుతో చూస్తున్నట్టుగా తెలుస్తుంది.

ఇంటికి వచ్చేసరికి యిల్లు చీకటిగా వుంది. మామ్మగారి గది తాళం వేసి వున్నది. జయమ్మ వున్నది గాని దీపం వెలిగించలేదు. తమ గదిలోనే కాస్త వెలుగున్నది.

ధనలక్ష్మి "జయమ్మా, జయమ్మా" అంటూ పిలించింది.

జయమ్మ మాట్లాడలేదు.

గదిలోకి తొంగిచూసి, "జయమ్మా" అంది మరోసారి. జయమ్మ కళ్లు తుడుచుకుంటూ "ఊఁ" అంది.

"వాళ్ళు లేరా? యాడికి పోయిన్రు"

"సినిమాకు"

"ఏడ్వకు జయమ్మా" అంది ధనలక్ష్మి.

జయమ్మ ఏడవటం లేదు. ఆమెకు కన్నీళ్ళు అతి బలవంతగా వస్తున్నాయి. ధనలక్ష్మి గదిలోకి వెళ్ళి దీపం వెలిగించింది.

"ఇప్పటిసంచీ ఎందుకు. వాళ్ళు ఎప్పుడో పదింటికిగాని రారు"

ధనలక్ష్మికి మాట్లాడాలనే వుంది. కాని మాట్లాడకుండానే చాలా విషయాలు అర్థమవుతున్నాయి. తను జయమ్మను ఏమని ఊరడిస్తుంది ?

ధనలక్ష్మిని గమనించకుండా లోపల రోలుదగ్గర కూర్చుని గారెలకోసం పిండి రుబ్బటం మొదలెట్టింది జయమ్మ.

"వాళ్ళెన్నాళ్ళుంటరట ?" అంది ధనలక్ష్మి.

"వాళ్ళిష్టమొచ్చినన్నాళ్ళుంటారు"

రాత్రి తొమ్మిదింటికి శివాజీ, గిరిజా, గిరిజ తల్లీ వచ్చారు నవ్వుకుంటూ.

"జనం సినిమాకొస్తారో, సినిమా చూసే ఆడాళ్లను చూడ్డానికొస్తారో అబ్బబ్బ వెధవ పబ్లిక్" అంది గిరిజ విసుక్కుంటూ.

"ఏమేవ్ వేణ్ణీళ్ళు" శివాజీకేక.

జయమ్మ బిక్కమొహంతో,

"అయ్యో మీరిప్పుడే రారనుకుని వెచ్చబెట్టలేదు. రెండు నిమిషాలాగండి" అంది.

"ఏం, రాక అక్కడే పడుకుంటా మనుకున్నావా? తొరగా ఏడుపు. ఒక వైపు చలి. ఆకలి. ఇంకా ఆగాలి. మీ మనుషులనుకున్నావా ఇంకేమన్నానా?"

"ఏమో నీ సంగతిమాత్రం అక్క బాగానే తెలుసుంటుంది" అంది గిరి

"అబ్బబ్బ. ఒక్కసారి ఒక ట వదిలిపెట్టవుగదా. ఎందుకే అట్లా చేస్తావు" అంది గిరిజ తల్లి.

జయమ్మ ముగ్గుర్నీ భోజనాలకు లేపింది.

"నువ్వూ కూర్చో అక్కా

"నేను తర్వాత లేస్తా మీరు లేవండి" అంది జయమ్మ.

"ఏం కంచాలు ా? బావా నువ్వూ ఒక్క కంచంలో ండి."

"అమ్మో. అనాకేమన్నా మిగులు స్తుందా, ఒక్క కంచంలో తింటే-" శివాజీ నవ్వు, పరిహాసం.

"పోనీ మ్వరం ఒక్క కంచంలో తిందాం" మ శివాజీ.

"నువ్వూ నాకు మిగల్చవుగా."

వీళ్ల భోజనాలు చెయ్యగానే జయమ్మ ఈవల శివాజీకోసం ఓ పక్కా, లోపల మూడు క్కలూ వేసింది.

"ఛీ. ఇక్కడో పక్క ఎక్కువ వెయ్యాలంది" అని శివాజీ.

"నీ, అమ్మా, నేనూ ఆవల పడుకుంటాం. మీరు లోపలికి రండి."

ఛ. మధ్య అదెందుకూ అన్నిటికీ" ాజీకి చక్కిలిగింతల నవ్వు.

మర్నాడు ఉదయం టిఫిన్ చేసేప్పుడు, "ఇవాళ అక్కయ్యను గూడా సికెడదాం బావా" అంది గిరిజ.

"ఇవాళ గుడికెడుతున్నామా?"

"మరీ అట్లా మాట్లాడకు అక్కయ్యకు కోపమొచ్చిందంటే నిన్నింటికి రానివ్వదు."

"హమ్మయ్య. అట్లాగైనా బ్రతికిపోతాను."

"నువ్వలాగే అను. అక్కయ్యా. కాస్త ఈయన్ను దార్లోపెట్టుకోవమ్మా" అని,

"బావా నేను సీరియస్‌గా అడుగుతున్నాను. అక్కయ్యను యివాళ సినిమాకు తీసికెళ్లాల్సిందే" అంది గిరిజ.

"ఇంగ్లీషు సినిమానోయ్. అదెం

దుకూ. ఆ సినిమాకు అదొస్తే ఎలుగ్గొడ్డొచ్చినట్టుగా చూస్తారు. మనం వేరే టిక్కట్టు పెట్టుకోవచ్చు దానికోసం'' శివాజీ నవ్వు.

"నో నో టూమచ్. అక్కయ్యా నువ్వు రెడీగావుండు. ఎలా తీసుకుపోడో నేనూ చూస్తాను."

జయమ్మ ఏమీ మాట్లాడటం లేదు.

"చూశావా. అదంతే. నువ్వు యిన్ని మాట్లాడినా అదొక్క మాట మాట్లాడిందా. వంట తప్ప దానికింకేమీ తెలియదు.''

"నీతో సంసారమాయె. నీలాంటి రసికుడితో యింకేం మాట్లాడుతుంది మరి. నేనైతేనా నిన్నీసరికి...''

"ఏం చేసేదానివి?'' అన్నాడు శివాజీ మీదికి వంగి.

"ఆవకాయ పెట్టేదాన్ని''

"ఏయ్, గిరిజా'' అంది తల్లి వార్న్ చేస్తూ.

"నేనంటే అంత యిష్టమన్నమాట. రోజూ కొంచెం నంజుకు తినేదానివి''

"అమ్మా, మనం సాయంత్రం వెళ్లిపోదామే'' అంది గిరిజ మొహం మాడ్చి.

"సినిమాకు పోదామే" అన్నాడు శివాజీ గిరిజను అనుకరిస్తూ.

"ఆఁ ఈపాటి సినిమాలు మా వూళ్లో లేవని యింతదూరం వచ్చాం''

"సినిమాకోసం కాదులే. నాకోసమే వచ్చాననుకో.

"ఛీ నీతో మాట్లాడనే తప్పు'' అని గిరిజ వెళ్ళి జయమ్మ పక్కన కూర్చుంది.

"అక్కా ఈరోజు మనం నలుగురం సినిమాకెడదాం ఏం''

"ఆఁ ఇంగ్లీషు సినిమాకి రెడీకా" అన్నాడు శివాజీ.

"అబ్బబ్బ. అక్కడికి నీకు ఇంగ్లీషు సినిమా అర్థమైనట్టూ, అక్కయ్యకే కానట్టు."

"అర్థం కాకపోతే నువ్వు చెబుతావుగా'' అన్నాడు శివాజీ గదిలో కొచ్చి వాళ్ల పక్కనే కూర్చుంటూ.

"ఆఁ. చెబుతాను. మొదట ఎబిసిడీలు నేర్చుకో''

కాసేపు కూర్చుని శివాజీ, "నేను కాస్త ఆఫీసుదాకా వెళ్ళి ఐదింటికల్లా వస్తాను. మీరు రెడీగా వుండండి" అన్నాడు.

"ఆహా. ఇదీ మర్యాద. మేం వస్తే నువ్వు ఆఫీసుకు పోతావు"

"చాల్లే. నీ కోసం యింట్లో కూర్చుంటే వుద్యోగం చేసినట్టే" అని గిరిజ తల్లి అతణ్ణి ఈవలికి పిలిచి,

"కాస్త ఆ రెండువందలూ ప్రయత్నించు బాబూ. ఈ మొద్దును ట్యూషన్ అన్నా పెట్టి చదివించాలి. దీనికి వుట్టి పెంకెతనం తప్ప ఆలోచనలేదు" అంది.

"అలాగే. అలాగే. ఇప్పుడేం తొందర. ఇంకా వారం రోజులుంటారుగా. తెస్తానులే అత్తయ్యా" అంటూ మళ్ళీ లోపలికొచ్చి,

"గిరిజా వస్తాను. సాయంత్రం రెడీగా వుండండి" అని వెళ్ళిపోయాడు.



సాయంత్రం శివాజీ ఓ పెద్ద పువ్వుల పొట్లం తీసుకొచ్చాడు. 'ఇదిగో' అంటూ గిరిజకు అందించాడు.

అప్పటికే ముగ్గురు ఆడవాళ్ళు రెడీగా వున్నారు

జయమ్మ పాలు వెచ్చబెట్టి కాఫీ కలుపుకొచ్చింది.

"ఇన్ని పువ్వులేం చేసుకుంటాం బావా. రెండు చిన్న దండలైతే సరి పొయ్యేవిగా" అంది గిరిజ.

"అంతేనా మరది రోజూ పువ్వుల కోసం అంతగోల చేస్తుందే?" అన్నాడు శివాజీ

"నేనెప్పు డడిగాను? మీరెప్పుడు తెచ్చారు?" అంది జయమ్మ.

"చూశావా చూశావా. నీ బండారం బయటపడింది" అంది గిరిజ.

"దానికి పువ్వులు కూడానా, అదెన్ని చేసుకున్నా గాడిదకు సింగారం చేసినట్టే వుంటుంది. అదిగో దాని మొహంచూడు" అన్నాడు శివాజీ కొంత గాయపడి.

గిరిజ కొంచెం దండ తీసుకుని, మిగతాది జయమ్మకిచ్చింది. జయమ్మ అదంతా మడిచి కొప్పులో పెట్టుకుంది.

"అయ్యో పువ్వులట్లా పాడుచేస్తావేమే వెధవా! పువ్వులు పెట్టుకుంటే అంద మొస్తుందదే, ఊరికే అన్నారా..." అని శివాజీ అంటుంటే.

"చాల్లెండి మీ చదవటం. టైమ యింది త్వరగా పదండి. మే మెప్పుడో రెడీఐ కూర్చున్నాం" అంది జయమ్మ ఈవలికివచ్చి తాళం చేతిలో పట్టుకుని.

"ఏమిటీ నువ్వెక్కడికే?"

"సినిమాకు పొద్దున్న చెప్పలేదూ ?"

"నేనా? నిన్నా? సినిమాకు తీసుకు పోవాలా ? ఓసి అత్యాశముండా" అంటున్న శివాజీతో జయమ్మ విసుగ్గా,

"అబ్బ వాళ్ళు వస్తున్నారు. నేనూ వస్తే ఏంపదండీ ఈ ఒక్కరోజు" అంది.

"ఊరోక్క బావా రానీరాదూ" అంది గిరిజ.

"ఏం, వీళ్ళ అండచూసుకుని మాటలు పేలుస్తున్నావు. నేన్నీకు సినిమాకు తీసి కెడతానని చెప్పానుటే దొంగముండా" అంటూ శివాజీ చెయ్యి పైకెత్తాడు.

"బావా బావా ఏమిటది. పొద్దున్న అనలేదూ. పోదాంపద" అంది గిరిజ.

శివాజీ గమ్మత్తుగా, అసహ్యంగా నవ్వుతూ, "అహ్హహ అదా, దాని ఆశ ఎంతవరకుందో తెలుసుకోవాలని అన్నాను. మా వెంట సినిమాకొస్తావుటే, ఇంకా నీ పేద మొహానికి సినిమా కూడానా రాస్కెల్. నోరు మూసుకుని యింట్లో పడుండు. ఎక్కువగా పేలావో జాగ్రత్త. వీళ్ళముందరే నీకు సన్మానం చేస్తాను."

"ఎందుకట్లా మాట్లాడుతారు నోటి కొచ్చినట్లల్లా. వీళ్ళను వెంటేసుకుని మీరు వూరంతా తిరిగొస్తే, నోటికొచ్చిం దల్లా మాట్లాడితే తప్పులేదు గాని నేను

సినిమాకొస్తే మీకు తప్పొచ్చింది? మీకు అన్ని సౌకర్యాలూ చూడాలి. అన్నీ చేసి పెట్టాలి. కాని మీతోబాటు ఒక్క సినిమా చూసే హక్కు నాకు లేదా? మీరేమన్నా అనండి. నేనివ్వాళ సినిమాకు వచ్చి తీరతాను"

"బావా నువ్వు మాట్లాడకు. నువ్వు రా అక్కయ్యా. బావ ఎలా వద్దంటాడో నేనూ చూస్తాను" అంటూ గిరిజ జయమ్మ చెయ్యి తీసుకుంది.

జయమ్మ చెయ్యి విదిలించుకుని "మీ అనుగ్రహమేం అక్కర్లేదు. నా భర్త వెంట నేను వస్తాను ఎలా తీసుకుపోరో చూస్తాను" అంది.

ఒక్క క్షణం శివాజీకిది అంతుబట్టలేదు.

"ఆయ్. అప్రాచ్యపుముండా. నువ్వు నన్ను యిన్ని మాటలనగలవా? ఏదో వీళ్ళ ముందర ఎందుకు నీ సిగ్గుతియ్యాలని వూరుకుంటే నువ్వింకా పెట్రేగి పోతున్నావా పద. మొదట నీ పనిచేసి మరీ సినిమాకు పోతాం" అని తనఫాంటు బెల్టు ఊడదీశాడు.

"ముండా ఇవ్వాళ నిన్నిక్కడ పాతేసి మరీ పోతాం. నన్నెదిరించి మాట్లాడతావా నువ్వు.హుఁ. ఎంతధైర్యం నీ అబ్బ సొమ్మురిదనుకున్నావా సినిమాకు పోవటానికి. నీకన్నా గాడిదను తీసుకుపోతే నయమే. ఇప్పుడు నీ చర్మం ఒలుస్తాను చూడు. వీళ్ళ ముందరే నీ పొగరు అణిచి నా తడాఖా చూపిస్తాను. వెధవ. నోర్మూసుకుని వంటింట్లో పడుండాల్సిన ముండవి. నువ్వు సినిమా కొస్తావా పద. నిన్ను సినిమా హాలుదాకా చర్మం ఊడదీస్తూ ఊరేగిస్తాను" అంటూ జయమ్మ జుట్టు అంది పుచ్చుకున్నాడు. ఒక వైపు నించి గిరిజా మరో వైపు నించి ఆమె తల్లీ జయమ్మను దూరం లాగుతున్నారు. కాని శివాజీ పట్టు విడువ లేదు. వాళ్ళ చేతుల పైనించి జయమ్మ వీపు మీద బెల్ట్ బక్కల్‌తో గుద్దుతున్నాడు. కాళ్ళతో తన్నుతున్నాడు. ఎక్కడ పడితే అక్కడ. ఎక్కడ అవకాశం దొరికితే అక్కడ పట్టు దొరికిన జుట్టు ఊడి వచ్చేటట్టుగా పీకేస్తున్నాడు. తిట్ల వర్షం కురిపిస్తున్నాడు.

"బావా మనిషివా, పశువ్వా నువ్వు. ఛీ. ఇదేనా నీ తెలివి. ఆడదాన్నలా కొడతారా" అంటూ గిరిజ పెడబొబ్బలు పెడుతుంది. కాని శివాజీ తిట్లకు అంతు లేదు. అతడి కళ్ళు ఎర్రబడ్డాయి. జుత్తు చెదిరి పోయింది. రొప్పుతున్నాడు. గిరిజ బలవంతంగా పట్టి ఈడ్చింది.

జయమ్మను లోపలికి తోసేశారు.

"ఐందా ముండా. శాస్తి బాగా జరిగిందా. ఏం, శివాజీ అంటే ఏమనుకున్నావే. సినిమా బాగుందా ఆగు. ఇప్పటికి ముగిసిందనుకోకు. నీకు ఇంకా బాగా బుద్ధి చెబుతానుండు" అంటుంటే,

"ఆఁ చాల్లే. ఉద్ధరించావు. నీ ప్రతాపం బాగుందిలే పద" అంటూ గిరిజా, ఆమె తల్లీ అతణ్ణి బయటికి లాక్కెళ్ళారు.

"ఇంతే కావాలి ముండలకు. వీళ్ళు మంచి మాటలతో వినే రకాలు కాదు. బడితె పూజ తప్ప లాభం లేదు"

అంటూ బయటకు నడిచాడు శివాజీ.

గుమ్మంలో విసిరి పడిన జయమ్మ చాలా సేపు లేచే ప్రయత్నం చెయ్య లేదు. కాసేపు ఏడ్చి మానేసింది. గబ గబా లేచి కాళ్లూ, మొహం కడుక్కొచ్చు కుంది. పువ్వులు తలలో సరిగా తురుము కుంది;

ధనలక్ష్మి చూస్తూ కూర్చున్నదల్లా, "ఏమిటి జయమ్మ ఎక్కడికి ప్రయాణం'' అంది. జయమ్మ పలక లేదు. బైట వున్న కుర్చీలూ, స్టూలూ లోపల పెట్టేసింది. బాత్ రూం కెళ్ళి వచ్చి, నొదుట బొట్టు సరిచేసుకుంది. ఒకసారి బైటి గుమ్మం దాకా వెళ్ళి చూసి వచ్చి గదిలోకెళ్ళి చీర సరి చేసుకుంటూ,

తలుపు లేసుకుని గడియ పెట్టుకుంది.

ధనలక్ష్మి "జయమ్మా" అని పిలిచింది. జయమ్మ పలకలేదు. ఆ తర్వాత 'గుప్పు' మన్నట్టుగా చప్పుడైంది. ఆ తలుపు సందుల్లోంచి మంట వెలుగు. ఏదో పెద్ద దివ్విటీ వెలుగు తున్నట్లుగా కనిపించింది. ధనలక్ష్మి కెవ్వుమని కేక వేసింది.

"జయమ్మా" అంది. కాని గొంతు పెగల్లేదు. తడబడే కాళ్ళతో బైటికి పరిగెత్తి

"జయమ్మ కాల్చుకుంది. జయమ్మ కాల్చుకుంది" అని అరిచింది.

"ఏమిటీ ?"

ఎవరికీ ఆ ముక్క వెంటనే అర్థం కాలేదు. క్షణంలో యింటి నిండా జనం మూగారు. ధనలక్ష్మి పిల్లల్ని దగ్గరకు హత్తుకుని, బైటికి రాకున్రని బిడ్డా. భయ పడుతరు" అంది.

తలుపులు బద్దలు చేసిం తర్వాత అప్పటికే మాడిపోయిన జయమ్మ దేహం కనిపించింది.

ఇంటినిండా, వరండా నిండా కిటకిట లాడే జనం ధనలక్ష్మి గది దాకా మూగారు.

"ఎట్లా కాల్చుకుంది. ఎట్లా కాల్చు కొన్నది ?"

"అయ్యో. ఒళ్ళంతా మాడి పోయింది."

"ప్రాణమింక పోలేదు. జల్ది తీసుక పోని.''

గిలగిలా కొట్టు కుంటోంది. పెద్దగా మూలుగు తోంది. ముట్టుకుంటే కేక లేస్తుంది. తల చితికిన పాము లాగ గిజ గిజ లాడుతోంది.

అలాగే నలుగురు మనుషులు పట్టు కుని లేపారు. చేతుల్లో ఆమె శరీరం గుంటలు పడి పోయింది.

''తొందర పడ్డదమ్మా సస్తె ఏమొచ్చె. వాడు పీడ పొయ్యిందను కుంటడు.''

"ఏమొస్తది? ఆమె బతుకు అంత బాగున్నదన్న మాట. ఇంత ఘోరమైన పని చేసిందంటే ఆమెకు బతుకు ఇం కెంత ఘోరంగా కనిపించి వుంటుందో...''

హాస్పిటల్లో వేసిన కొంచెం సేపటి దాకా ఆమె ప్రాణం పోలేదు. ఆమె చుట్టూ డాక్టర్లు, పోలీసులు చేరి మరణ వాంగ్మూలం రికార్డు చెయ్యడం కోసం కాచుకూర్చున్నారు. కాని కళ్ళు కాలి పోవటం వల్ల ఆమె స్పృహలో వున్న ప్పటికీ మరి చూడ లేక పోయింది. మాట్లాడలేక పోయింది. బలహీనమైన

చతుర

మూల్గు తప్ప ఆమె నించి మరే శబ్దమూ వెలువడ లేదు.

"భర్త ఎక్కడ భర్త ఎక్కడ?" అన్నారు. కాని ఏ సినిమా హాల్లో వున్నాడో తెలుసు కోవటం అసంభవం. ఫస్టుషో ఐతే తప్ప యింటికి రాడు అన్నారు. అదీ ఒకవేళ సినిమాకు పోయినట్టయితే.

గదిని పోలీసులు సీలు చేశారు.

భయంతో ధనలక్ష్మి పిల్లల్ని తీసుకుని బైట కూర్చుంది. ఒక్కతీ రాత్రి యింట్లో గడపలేదు. దయతలిచి ఎదుటింటి వాళ్లు ఆ రాత్రి ఆమెను ఆశ్రయమిచ్చారు.



# 9

ధనలక్ష్మి పొలానికి పోతుండే,

"అమ్మా, మేం గూడ ఒస్తం" అంటూ చెల్లెల్నెత్తుకుని నిలబడింది హేమ.

"మీరు యాడికొస్తరే. అట్ల మాట్లాడతవు కొత్తగ ఇక్కట్ల కూసుంటందుకేం బుట్టె?"

"భయమయితదమ్మా ఇంట్ల వుండ బుద్ధిగాదే" అని ఏడుపు మొహంపెట్టింది హేమ.

"పగటి పూట ఏం బయమే పోసి. ఇవుతల ఆడుకోన్రి. ఇంట్లకు పోవొద్దులే" అంది ధనలక్ష్మి- ఎదురుగా జయమ్మ వాళ్ళ గదికి తాళం వేసి వుంది జ్ఞాపకాలతో ఆ గది భయంకరంగా కనిపిస్తున్నది. తలుపు సందుల్లోంచి యింకా మంటలు కనిపిస్తున్నట్టుగానే వుంది. ఆ ఖాళీ వరండా, గదికి జారిన కప్పు పెంకులు - పెళ్ళలూడుతున్న గోడలు, ఒంటరిగా, పొద్దు బద్దుగా వుంది.

"పద, శంకరమ్మోళ్ళింట్ల వుందురు గని మళ్ళ పొద్దుమీకి సుకొస్త" అని పిల్లల్ని తీసుకుని బయల్దేరింది. అప్పటికే పొద్దుపోయింది. ఎల్లమ్మ ఏమంటుందో?

"ఏమి ధనలక్ష్మి ఇట్ల ఒచ్చినారు" శంకరమ్మ ఇంటి పనిలో వున్నది.

"జెర ఈ పిల్లలను ఈడ వుంచి పోతనక్కా"

"ఒద్దమ్మా కోటయ వాళ్ళను యిక్కడ వుంచుకోవద్దన్నాడు. తనకు యిగ సంబంధం లేదన్నాడు. అదిగాక అయిన యిక్కడికి రాక గిట్ల శాన రోజులాయె"

"అదిగాదక్కా పొలానికి పోతున్న పిల్లలు మొ ఇంట్ల బయమైతుందంటున్రు" అని ధనలక్ష్మి జయమ్మ కథ చెప్పింది. శంకరమ్మ జాలిపడి,

"ఈ ఒక్కనాటి కంటె వుండగని రోజు మాత్రం యిక్కడ వుంచు. నడుమ మాకేం వొచ్చిందమ్మా! రు మీరు బాగానే వుంటరు వాళ్ళిక్కడుండె మొన్న నీకు తప్పొచ్చింది గని ఇయ్యాల అయినరు రాదా? మా యిండ్లమీద ఒడి పోతె మీ పిల్లలకు మేం కాపల వుండాల్నా?"

"ఈ ఒక్కరోజుకే అక్కా రేపటి

నించి న్నిడుగను" అది ధనలక్ష్మి ప్రాధేయపడుతూ.

పొలం చేరగానే,

"ఏమే, ఎంతయింది? ఇప్పుడు తీరిందా బిడ్డా?" అంది ఎల్లమ్మ.

ధనలక్ష్మి ఏదో చెప్పినా వినిపించు కోక.

"సాలు బిడ్డా సెలు నీ కూలీ సాలు. నువ్వు సాలు నీకుసనొద్దు గని ఇట్లరా" అంటూ ధనలక్ష్మిని తీసుకెళ్ళి ఓ చెట్టు కింద కోర్చోబెట్టికనూ కూర్చుంది.

"మొన్న ఏ జేశినవే నువ్వు? వాడు లేకుండ సూశి ల్లలను తెచ్చుకున్నవట. నీకు యింత సీదేందే?"

"ఇప్పటి పొద్దుపోయింది పెద్దమ్మా ఎంత సేపు గాసోవాలె"

"అయ్యో పొద్దు బొయ్యినాది ఎంత సుద్దపూసో మాట్లాడుతున్నవే. అమ్మో నేనేమో న్నుకున్న గని, నీకు శానా తీట బుట్టినే. మొన్న నేను సూశ్నేదా? నీ మొగోచ్చి నిలబడితె వానితోని ఒక్కమాట మాట్లాడినావె? వానితోని పంతమేకోని గెలుస్తనంట వేమే? ఇప్పుడు వానికేమయింది. బాగ తిరుగు తున్నడు. పొయ్యి వానిదగ్గర వుండు. ఇగ ఏదేం చేస్తవు"

"ఒద్దు పెద్దమ్మా ఆ మాటనకు"

ఆ పైసలను నమ్ముకునేఇట్లయినం. అదొంగ సొమ్ము పెద్దమ్మా, ఇయ్యాలుంది. రేపు పోతది. ఒక్కనాటి మురిపానికి పనెందుకు యిడిశి పెట్టాలె నమ్మా"

"దొంగ సొమ్మో దొర సొమ్మో కెందుకే. వాడు తెచ్చిపెడతడు తిను. వాడెట్ల సంపాయిస్తె నీకెందుకే? నీకు తెలువదే వాని సంగతి మొన్న వాడు పాత కిరాయి కట్టిండు. వాడే యింట్ల వుంటనన్నడు. మరి నువ్వు వానిదగ్గర వుండకపోతె నువ్వే ఖాలి జెయ్యి"

"పెద్దమ్మా, అట్లనకు నీకు పుణ్యముంటది నన్ను యింట్లనించి ఎల్లగొట్టకు ఆ కిరాయి నేనే యిస్త. నాలుగు పూటలు మాడయినా సరే నీ కిరాయిస్తగని మమ్ములను ఎల్లగొట్టకు"

"అరె నా యిల్లు నా యిష్టం. నువ్వేంటిదె చెప్పేది? అసలు మీరు వుండుడే యింటికి తాశిలి. మొన్న అదట్ల కాల్సుకోని సచ్చె నువ్వేమొ ఇంత సక్కగ ఎల్లబెడుతుంటివి. ఆ ముసలి ముండను గూడ ఎల్లగొడ్త మీరుపోతె అది పసుల కొట్టం జేస్త"

"ఒద్దు పెద్దమ్మా నా మొగడు నన్నట్ల అన్యాయం జేశిండు. నిన్నే నమ్ముకున్న పెద్దమ్మా అట్ల జెయ్యకు నన్ను" అంది ధనలక్ష్మి ఆమెకు కన్నీళ్లు వచ్చాయి.

"ఓశినీ ఎమన్ననవే అట్ల ఏడ్సుకుంట కూసున్నవు. పాడుముండా, మాటకు ఏడ్సి బెదిరిస్తావు! నా పొలంల ఏడ్వకు తాశిలి ముండా. పో నువ్వు నా యింట్లుండొద్దు. నా పొలంల పని జెయ్యొద్దు. నీ తాశిలి నాకు సుట్టుకుంటది. యాడికన్న పొయ్యి సావు పో" అంది ఎల్లమ్మ ధనలక్ష్మిని వెనక్కు తోసేస్తూ.

"పెద్దమ్మా అట్లనకు నన్నన్యాయం జెయ్యకు. నువ్వు కూలి యియ్యకపోతె యాడికి పోను? ఎందుకట్ల మాట్లాడు తున్నవు పెద్దమ్మా, ఆయన నీతోని ఏం

జెప్పిండు? ఒక్క రోజుల ఎందుకిట్ల మారి పొయ్యినవు? పెద్దమ్మా, ఆయాళ నువ్వే చెప్పలేదా రెక్కలను నమ్ముకుంటే దరిద్రముండదని ఆయన నీకేం చెప్పిండు పెద్దమ్మా, నా మీద'' ఏం చెప్పిండు? నాదెట్ల తప్పో నువ్వేచెప్పు''

''వాడు నీ మీద చెప్పేదేందే. నువ్వు మాడి సావకుంట, నీ సంసారం పాడు గాకుంట కూలిస్తనన్న గని నువ్వు వాని మీద పగ తీసుకుంటందుకు కూలిచ్చి నావె ? అప్పుడేమొ తిండి లేక కూలి చేస్తనన్నవు. ఇప్పుడేమొ వాని దగ్గరికి పొయ్యేతందుకు రోశమొచ్చి కూలి చేస్త నంటున్నవు. మీ కొట్లాటలతోని నాకేందే నువ్వు నిజంగా నీ పిల్లల కోసం కూలి కొప్పుకున్న దానివైతె--యిప్పుడు వాడు బాగానే వున్నడు. పొయ్యి వాని దగ్గ రుండు నువ్వు నీ పిల్లలు సుకంగ వుంటరు. మాటి మాటికి నా కాళ్ళు పట్టు కుంట నంటవు. నా కాళ్ళు పట్టు కుంటం దుకు శెరం లేదు గని, నీమొగని కాళ్ళు పట్టుకు-టందుకు శెరమెందే ?''

''పెద్దమ్మా ఆయన సంగతి నీకు తెలువదు. మీదికి అట్ల మాట్లాడుతడు. ఆయన లోపలేమున్నదో నాకు తెలుసు.''

''ఇగో ఈ దొంగ మాటలే మాట్లా డకే. నీకు అంత అనుమానముంటె యియ్యాళ వాడిక్కడి కొస్తడు. నువ్వు సరేనను. నీ ముందల్నే వానికి అన్ని చెబుత. నేను నిన్ను వానెంట పంపిస్త. వాడేమన్న చేస్తడని బయమయితె నువ్వు మా యింట్లనే వుండు. వాడేమన్న చేస్తె నువ్వు మల్ల నా దెగ్గెరికి రా. అప్పుడు మళ్ళ కూలిస్త. అంతేగని నా మాటకు ఎదురు చెప్పకు. పెద్దమ్మ, పెద్దమ్మ అంటవు. పెద్దముండను చెబు తున్న విను. వానితోని నీకు పంత మొద్దు. మంచిగ కలిశి వుండు [ని. ఇంక నలుగురు పిల్లల్ని కనుని]. నేనేం నీకు చెడ్డ చెబుతలేను. నీకు తెలువదే. వాడిప్పుడు శాన మారి పొయ్యిండు. ఇల్లు కట్టిస్త నంటున్నడు తెలుసా, నా పొలం మునిసిపాలిటోళ్ళ దగ్గర కిరికిరిల పడితె తీర్చిండు. నాలుగు పైసలు అటు యిటు తిప్పుతున్నడు. ఇప్పుడు వాడు నిన్ను మాడ్చడు. ఆయాల నీ కెందుకు కూలిచ్చిన్నే? నువ్వు యింకెక్కడ పోకుంట, నాదగ్గర్నే వుంటె నువ్వు మల్ల ఎప్పుడన్న వాని దెగ్గెరికే పోతవు. మల్ల కలిసుంట రని నేను మొగడు పెండ్లాలను కలిపే దాన్నే. విడదీశే దాన్ని కాదు బిడ్డా. పెద్దదాన్ని చెప్పుతున్న విను నీ కేమి లోపం రాదు మంచిగ తిండి పెడ్తాడు. చీరెలిస్తడు. నా కండ్ల ముందల్నే వుంటవుగదనే. వాడు నిన్ను పాత కోపంతోని కొట్టకుంట సూస్త. నీ పిల్లల పదువుసదువంటివి, ఇన్నాళ్ళు. వాళ్ళను సక్కగా సదివిచ్చుకో. ఇన్నాళ్ళు కష్ట పడ్డవు. ఇప్పుడు సుకపడు. నీకు వాని పైసలు తినే హక్కున్నదే. నువ్వు వాని పిల్లల తల్లివి. వాడు పైసలియ్యక పొయ్యినా నువ్వు గుంజుకోనితినొచ్చే. నీ తల్లి అసుంటి దాన్ని చెపుతున్న విను. మల్లవాని తోని అనకు. నిన్నవాడొచ్చి ఒకటే ఏడుపు. నేనే మిమ్ములను విడ దీస్తునట. నేనే నీకు అన్ని నేర్పి స్తున్నట, ఈ వొయిసుల పెండ్లాం లేక

పోతె ఎట్లా సావను ? నా పిల్లలు ఆగమై పోతుంటె సూసుకుంట కూసోవాల్నా ? అని ఏడ్శిండు పిచ్చి ముండా కొడుకు. నేను వానికి మాటిచ్చిన. మిమ్ములనిద్దర్ని కలిపి మల్ల నా యింట్లోనే వుంచుకుంట నని. బిడ్డా యిన్నాళ్ళు కష్టంల ఆదుకున్న. నా మాట తీశెయ్యకు. మిమ్ములను విడ దీశిన్నని నన్ను బద్నాం చెయ్యకు. ఇగ ఇవన్ని నీకు అక్కర్లేదు వాడొస్తడు కూసో. నేనే మిమ్ములను రిక్షాల కూసోబెట్టి పంపిస్త''

ధనలక్ష్మి మళ్ళీ, "పెద్దమ్మా, అన్ని నువ్వే మాట్లాడకు నన్ను చెప్పనియ్యి" అంది.

"ఇగో బిడ్డా. నేను మంచోళ్ళకు మంచి దాన్ని. మంచి మాటతోని నా మాట యినకపోతివా యిప్పుడే మెడబట్టి గెంటిస్త. ఆనాడు నిన్నుసూశి జాలి పడ్డగని నాకు కోపం తెప్పించకు చెప్తా, ఒక్కటే మాట నా మాట యింటవా యినవా ?"

ధనలక్ష్మి తలవంచుకుని నిలబడింది.

"బిడ్డా ఇగనువ్వు ఏమి ఆలోచిచ్చకు. వాడొస్తడు వాని కాళ్ళు బట్టుకొని ఐందేదో ఐంది మీళ్ళ ఏలుకొమ్మను నేను కూడా చెబుత కలిశి యింటికి పోనిర్రి నువ్వు సుకపడు. వాణ్ణి సుకబెట్టు. పిల్లల్ని సూసుకుంట నీడ పట్టుకు బతుకు మొగణ్ణి అట్ల ఎదిరిచ్చకు బిడ్డా యిగ," అంటూ ఎల్లమ్మ పని కి పోయింది.

క్షణం అక్కడ నిలుచుని, ధనలక్ష్మి గబగబా రోడ్డుపట్టి శంకరమ్మ యింటికి వెళ్ళి పిల్లల్ని తీసుకుని యింటికి వచ్చింది.

వరండాలో మామ్మగారూ ఆమె తమ్ముడూ కూర్చుని వున్నారు.

''ఏం,ధనలక్ష్మి,త్వరగా వచ్చేశావు?'' అంది మామ్మగారు

"ఊకేనే మామ్మగారూ" అంది ధనలక్ష్మి.

"నా ఖర్మగాలి కాలు బెణికిందమ్మా రిక్షాలోపడొచ్చాను.లేవలేక పోతున్నాను" అంది మామ్మగారు మూలుగుతూ.

"ఊఁ చాల్లేయిక చెప్పుకుని ఏడవకు" అన్నాడు ఆమె తమ్ముడు.

పిల్లల్ని ఈవల వదిలి తన సామానంతా రెండు మూటల్లోకి సర్దటం మొదలెట్టింది ధనలక్ష్మి.

''ఎక్కడైనా అప్పుదొరుకుతుందేమో చెప్పు.కనీసం అలాగైనా తీసుకుంటాను" అంటున్నాడు మామ్మగారి తమ్ముడు...

"నాకెవరు తెలుసురా నాయనా అప్పులవాళ్ళు! వుద్యోగం సద్యోగం చేస్తున్నవాడివి నీకు తెలుసుండాలిగాని ముసలి పీనుగను నాకేం తెలుస్తాయి."

"అది సరేలే, పిల్లలు యూనిఫారాలు కుట్టిచ్చేదాకా, స్కూలుకు పోమని కూర్చున్నారు. ఎట్లాగైనా వందరూపాయలు సర్దు."

"నువ్వేమన్నా అనరా. నా దగ్గర చిల్లిగవ్వ కూడా లేదు. ఇక్కడా అక్కడా పని చేసి తెచ్చిన పదీ ఇరవై నీకే యిస్తున్నాను. నేనేం వేరే మూట కట్టడం లేదు. కావాలంటే ఇల్లంతా వెదికి చూడు."

"దాచే దానిని యింట్లో ఎందుకు దాస్తావులే. ఐనా నువ్వీ మధ్య ఏమిచ్చా

పనే – నెలకు యిరవై రోజులు తల నొప్పనీ, నిస్సత్తువగా వుందనీ, కాలి నొప్పనీ, చెయ్యినొప్పనీ రోజుకోనొప్పి చూపించి పని ఎగేస్తున్నావు. మళ్ళీ తెచ్చిందంతా నాకేయిస్తున్నానని అందరి దగ్గరా ఢంకా మాత్రం వేస్తున్నావు."

"ఒరేయ్, ఒరేయ్. ఆ మాట అన టానికి నీకు నోరెలా వచ్చిందిరా? నేనె వరితో చెప్పానా? చావుదగ్గిరైన ముండని. నన్నిలా కాల్చుకు తింటే నీకే మొస్తుందిరా. నా వొంట్లో బావుంటే నేను పనికి పోలేదుట్రా. ఈ ముసలి తనానికి నువ్వే నాకు చెయ్యాల్సింది పోయి, ఇంకా నేను తెచ్చి పడేస్తే తృప్తి పడక, నాలుగు రోజులు నేను మంచం పడితే యిట్లా నా వెంట పడతావేంరా? నీకివ్వక ఇంక నేనెక్కడ దాచుకుంటాను. ఎవరి కోసం దాస్తాను. నీ కోసమే గదుట్రా ఆ వుళ్ళో వున్న ప్రాణాన్ని వుండక యిక్కడికొచ్చి ఈ పని ముందవేసు కున్నాను."

"చాల్లే. చెప్పుకు తిరగటానికి యిదొటి బాగానే దొరికింది. అంత చెయ్యి లేని దానివి వెళ్ళిపో. ఎవడొద్దన్నాడూ? ఏం, నువ్వే నా సంసారమంతా పోషిస్తు న్నట్టు మాట్లాడు తున్నావే. ఎట్లాగైనా చావుదలకు నీకు స్వార్థం పట్టుకుందే. నువ్వు మొదట్నించీ అంతే. ఓ కాణీ యిచ్చి పదేళ్ళు చెప్పుకు తిరుగుతావు. పోతే.. పో. ఎవడి కోసం వంట చేస్తు న్నావూ? నువ్వేదో మల్లె జమ చేసుకోవ టం కోసం వచ్చావు. ఇష్టం లేకపోతే వెళ్ళి ఊళ్ళోనే చావు నాకేం."

"ఆ భూమి నీకే యిస్తిని. ఆ యిల్లు కూడా నువ్వే అమ్ముకుంటివి. ఇప్పుడు నేను వెళ్ళి ఎవరింట్లో వుండను. ఇక్క డేమో నీ యింట్లో వుంటే నీ పెళ్ళాం నా ప్రాణాలు తోడేస్తుందాయె."

"ఆఁ. నీ బుద్ధి మంచిది గనక అందరూ నిన్ను చేరదీస్తారు. ఐనా నేను పందరూపాయలు సర్దవే అంటే యింత భారతం చదువుతావేం."

"ఒరేయ్ అంత మాటనకురా. ఉన్న ఒక్క తమ్ముడివి అట్లా మాట్లాడతా వేంరా. నీ కోసం, నీ పిల్లల కోసం కాదుట్రా నేనిక్కడి కొచ్చింది."

"ఆఁ. అట్లాగే అంటావులే. నువ్వు ఈ ఆదివారంలోగా ఎక్కడైనా డబ్బు సర్దావో సరే. లేకపోతే యింక నువ్వు అక్కడికి రానక్కరర్లేదు. నీ ఢంకా బజాయించు కోనక్కర్లేదు. నువ్వేదో మమ్మల్నుద్ధరిస్తున్నట్టుగా చెప్పుకు తిరగ క్కర్లేదు."

"అనరా అను. ఇన్నాళ్ళు బాగా చేయించుకుని అట్లాగే అనరా. ఛస్తే గుక్కెడు నీళ్ళు పోసేవాళ్ళన్నా లేరు. ఆ పదిరోజులు జ్వరంతో పడితే ఇరుగు పొరుగులన్నా యింత చేశారుగాని నువ్వు నా గుమ్మం తొక్కావుట్రా అప్పుడు."

"ఆఁ. తొక్కుతారు. నువ్వేమో మల్లె కట్టుకుని తల కింద పెట్టుకో. నీ నిర్వాకానికి సంతోషించి అందరూ నీ యింటి కొచ్చి సేవలు చేస్తారు. ఇంతకూ యిప్పుడేమన్నా వుందా లేదా చెప్పు. నువ్విచ్చిందేమన్నా వుంటే నీ చావుకే అవుతుంది. దాంతో మేమేం మేడలూ, మిద్దెలూ కట్టం."

"ఒరే తమ్ముడూ నా దగ్గర లేదురా.

నన్నెందుకట్లా లేదు లేదని పిస్తావురా. ఈ బెణుకు కోసం ఏవన్నా మందు తెచ్చివ్వరా. బాగైంతర్వాత అలాగే ఎక్కడో సర్దుతాను గాని."

"సరె. నా డబ్బు కోసం నువ్వు బెణుకు తగ్గించుకోవద్దులే. నీకు మందులు తేవటానికీ, సేవలు చెయ్యటానికీ మేం తేరగా వున్నామిక్కడ: తీరిగ్గా మూలు గుతూ కూచో. అదే తగ్గుతుంది. నీ దగ్గర కూచుంటే ఈ ఏడుపు తప్ప నా కొరిగే దేమీ లేదు" అంటూ ఆమె తమ్ముడు గబగబా వెళ్ళి పోయాడు.

"చూశావా ధనలక్ష్మి, వాడెలా వెళ్ళి పోయాడో? ఒక్కసారి నా దగ్గర డబ్బు లేదురా అంటే వాడి కంత కోపం వచ్చింది. నా మీద పడేడుస్తాడేమమ్మా వాడు. నేనెక్కణ్ణించి తేనూ! ఎప్పటి కప్పుడు పదీ యిరవై యిస్తే వాడి కళ్ళ కానిపించవు. ఒక్కసారే వందో యాభైయ్యో యిస్తే బాగుండును. కాని అలా జమచేసిందాకానన్నా ఓపిక పట్ట డుగా. నాకు పని దొరికిందని తెలిసిన మర్నాడే హాజరు. ఇంకెక్కడ కూడ బెట్టి వీడికియ్యనూ ?"

ధనలక్ష్మి మూటలు సర్దుకుని ఈవలి కొచ్చింది.

"మామ్మగారూ మేం యిల్లు యిడిచి పోతున్నాం" అంది.

మామ్మగారు ఆశ్చర్యంగా.

"అదేమిటమ్మా, ఎక్కడికి? ఇప్పటి కిప్పుడే ఎక్కడికి ?" అంది.

"ఎల్లమ్మ పొమ్మన్నది మామ్మగారు. మేం పోకపోతే వొచ్చి ఎల్లగొడుతది."

"ఎక్కడికి పోతారమ్మ యిప్పుడు?"

"ఏమో, ఇగ మా బతుకు బజార్ల పడ్డదమ్మగారూ. ఆయన కాళ్ళు పట్టుకోని ఆయన దగ్గర పడుంటె పడుండు, లేక పోతె పొమ్మన్నది."

"ఊఁ. ఏదోమరి అభిమానాలకు పోతే. ఎట్లా. నువ్వే ఆలోచించి చూడు. ఎంత చెడ్డా నీ భర్తే. ఐనా, నేను ఒకరికి చెప్పేదాన్ని కానులే. నా బతుకే యిలా ఏడ్చింది. ఇంకా ఎవరికి ఏం చెప్పనూ" అంది మామ్మగారు.

ధనలక్ష్మి కాసేపు నిలబడి

"మామ్మగారూ, జయమ్మ తన దారి తను చూసుకున్నది. నా బతుకే యింత హీనమై పాయె. నేను ఈ యింట్ల వుండ లేను యిగ. మీరన్న నన్ను సాగనంపున్రి, బతికుంటె మళ్ళీ ఎన్నడన్న కనిపిస్త. మామ్మగారూ ఇన్నాళ్ళు మంచికో చెడ్డకో మా కష్టాలు కడుపుల పెట్టుకోని ఆదుకున్నరు. తిండికి మాడిపోకుంట వున్నదేదో యిచ్చినుప్రి. ఇగ పోతున్నం మామ్మగారూ" అంటూ ధనలక్ష్మి బోరు మన్నది,

మామ్మగారు కూడా ఏడుస్తూ,

"పోయినవాళ్ళే అదృష్టవంతులమ్మా. ఈ దరిద్రపు బతుకు బతికి అందరితో ఛీ అనిపించుకోవటంకన్నా జయమ్మ లాగా పోవటమే నయం. నేనింకెన్నాళ్ళు ఈ కొంపలో మురిగి చావాలో. నాకు మా వూరికి పోవటానికి కూడా ఛార్జీలు లేవమ్మా. కాలు బాగైన తర్వాత ఛార్జీ లన్నా సంపాదించుకుని రైలెక్కుతాను. ఆ చావేదో ఊళ్ళోనే చస్తాను. ముక్కూ మొహం తెలియని వూళ్ళో ఎందుకూ ఈ ప్రాణాన్ని వదలడం".

"ఒస్తను మామ్మగారూ" అంది ధనలక్ష్మి.

"ఆఁ. వెళ్ళమ్మా వెళ్ళు, నిన్నేమన్నా బాధించే మాటలంటే మనసులో పెట్టుకోకు తల్లీ. ముసలిదాన్ని తెలిసో తెలియకో ఏదో అనే వుంటాను. వెళ్ళమ్మా సుఖంగా వుండు. నీ దారి నువ్వు వెతుక్కున్నావు, ఆ నారాయణమూర్తి నిన్ను చల్లగా చూడనీ తల్లీ, అంతా వాడికృప" అంది మామ్మగారు ముక్కు చీదుకుంటూ.

ధనలక్ష్మి హేమతో,

"మామ్మగారికి దండంపెట్టి రావే" అంది.

హేమవచ్చి దండంపెట్టి, "ఒస్త మామ్మగారూ" అంది.

మామ్మగారు చిన్నపిల్లను కూడా ముద్దాడి,

"పోయిరండమ్మా. ఒసేవ్ హేమా, మీ అమ్మకు ఏమీ మిగల్లేదు. మీరన్నా మీ అమ్మకు సాయపడండే. ఇబ్బంది పెట్టకుండా, అమ్మ చెప్పినట్టే నడుచు కోండి...హుఁ. పసి ముండలు దండం పెడితే, చేతిలో పెట్టటానికి ఓ పైసా అన్నా చేతిలోలేదు. ఛండాలపు ముండను వెళ్ళిరా తల్లీ, ఆ చంటిది జాగ్రత్త, వెళ్ళండి"

అని ఏడుస్తూ లేచి వాళ్ళను సాగనంపటానికి గుమ్మందాకా రాబోయిందిగాని బెణుకుతో లేవలేక అక్కడే కూర్చుండి పోయింది.



ధనలక్ష్మి గుమ్మం దిగి, వీధి దాటి చౌరస్తాదగ్గర నిలబడింది.

ఇక ఏ బంధువులింటికీ పోవొద్దని నిశ్చయించుకుంది.

"నాయినదగ్గరికి పోతున్నమా?"అని అడిగింది హేమ. ధనలక్ష్మి మాట్లాడ లేదు.

సాయంత్రం జనం రద్దీగా వున్నారు. ఫుట్ పాత్‌మీద లైట్ స్తంభం. పక్కన ఓ చేతిలో పిల్లా, మరో చేతిలో పెద్ద మూటా, హేమ చేతిలో మరో మూటా. తనకు తెలిసిన కూలీలు అటునించే పోతారు. కానీ ఆమె భయం ఈలోగా ఎల్లమ్మ ఎక్కడ వస్తుందోనని.

కూరగాయలు అమ్ముకుంటూ బాలమ్మ అటుసందు తిరిగింది. ధనలక్ష్మి కేకేసిందికాని బాలమ్మకు వినిపించలేదు. గబగబా రోడ్డుదాటివెళ్ళి మళ్ళీ పిలిచింది. వెనక్కు తిరిగిచూసి ఆగింది.

"ఇక్కడ నిలబడ్డవు లచ్చుమమ్మా, ఊరికి పోతున్నావా ?" అంది.

ధనలక్ష్మికి మాటలు తడబడుతున్నవి.

"నెత్తిమీద బరువున్నది అరుగుమీద దింపుకో" అంది.

బాలమ్మ గంప దించి కూర్చుంది.

"ఎల్లమ్మ మమ్మలను ఎల్లగొట్టింది. రేపట్నించి కూలికి గూడ రానియ్యదు ఇగ''.

"అయ్యో, అదేంది రోగం. ఏమన్న కొట్లాడినవా దాంతోని''

"లేదు. మల్ల నా మొగనిదగ్గరికి పొయ్యి, కాళ్ళుబట్టుకోని ఉండమన్నది. లేకపోతె యింట్లనించి పొమ్మన్నది. నా మొగడు యిప్పుడు భాగా పైసలు సంపా యిస్తున్నడట. దాని బాకీ తీర్చిండట, అందుకని అటుదిక్కుమాట్లాడుతున్నది"

''అది పైసకు గడ్డితింటది. ఎట్లాగైన దాని నియ్యతు మంచిదికాదు. నిన్నింట్ల వుంచుకోని యిన్నాళ్ళు నీతోని కూలి చెయ్యిచ్చుకున్నది. ఇప్పుడు వాడు పైస లిస్తనంటె నిన్ను ఎల్లమంటున్నది. నీ అసుంటోల్లను, నా అసుంటోల్లను ఎంతమందిని ముంచి పొలం పెంచు కున్నదో అది. నీపని నువ్వు చేసుకోని పొట్ట నింపుకుంటె ఎవ్వనికేందమ్మ బయ పడేది. అసలు అది ఎల్లగొట్టిందాక యింట్ల వుండుడు నీదే తప్పు...ఊఁ. మరిప్పుడు యాడికి పోతున్నవు? మీవోల్ల ఇంటికి పోతున్నావా?"

''లేదు నీకోసమే నిలబడ్డ, నువ్వే ఏదన్న దారి సూపిచ్చు బాలమ్మ''

''నేనే అమ్ముకుంట బతుకత నేనేం సూపిస్తనమ్మ. అయినా ఈ వూర్లె ఎల్లమ్మకుతప్ప యిగ ఎవ్వరికి పొలాలు లేవా ఏం? ఖుదానో ఓకాడ పనిచెయ్యి. రెక్కలు సల్లగుంటె కడుపుకే దొరు కదా!"

"కాదు బాలమ్మా. ఇప్పుడు నన్ను ఎక్కడ న్నో మీ యిండ్లల్ల వుంచు. మావోళ్ళు నన్ను రానియ్యరు, నేను పోను. బాలమ్మా, నన్నందరూ ఎల్ల గొడుతున్నరు''

"అట్లంటవేందమ్మ వాళ్లు ఎల్లగొట్టిన దాక వాళ్ళను పూసుకోని తిరుగుతివి. ఇప్పుడేమొ ఎల్లగొట్టిన్నంటివి. అయాల్లనే నాయెంట వొస్తె యిప్పటికెంత మంచిగ వుండేది''

ధనలక్ష్మి బాలమ్మవైపు ఆశగా చూసింది.

"మీరు పొయ్యి ఆడ మండి కాడ నిలబడుండ్రి. అమ్ముకోని అటేవొస్త, మా యింటికి తీస్కపోత''

బాలమ్మ వెళ్ళిపోయింది.

ధనలక్ష్మి మళ్ళీ నడక సాగించింది. పిల్లలు ఆకలంటే ఓ పావలా పకోడీలు కొనిపెట్టింది. అక్కడే పబ్లిక్ నల్లాదగ్గర నీళ్ళు తాగారు. ఓ అరుగుమీద కూర్చుని, రద్దీలో బాలమ్మ ఎక్కడ తప్పిపోతుందో నని అటుగా వెళ్ళే ప్రతి ఆడమనిషినీ జాగ్రత్తగా చూస్తూ కూర్చుంది.

చీకటి పడింతర్వాత బాలమ్మ వచ్చింది.

"పదున్రి."

మధ్యలో ఆగి ఓ కిరాణ కొట్టుదగ్గర కొన్ని ఎండుచాపలూ, యితర వెచ్చాలూ కొనుక్కని యింటిదారిపట్టింది బాలమ్మ. చాలా చిన్న సందులూ, మురుగు కాల్వలూ, మురికిపేటలూ దాటి, ఓ చిన్న గుంపులాగా వున్న పెంకుటిళ్ళ మధ్యకు నడిచారు.

"ఇగోనమ్మ ఇదే మా యిల్లు"

ఆ యింట్లో కరంటు వెలుగుతున్నది.

ఓ చిన్న ట్రాన్సిస్టరు దూలంనుంచే వేళ్లాడ దీశారు. ఆమె మొగుడు అక్కడే కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు. ధనలక్ష్మిని చూసి 'ఎవరు' అన్నాడు.

"నాతో పాటు పొలంలపని చేశేదిలే." అని కొంత చెప్పింది బాలమ్మ.

"కూసో లచ్చుమమ్మా. నేను ఒంట చెయ్యాలె యింక" అని బాలమ్మ కాళ్ళూ చేతులూ కడుక్కొని వంటకుపక్రమించింది.

"రెండు రోజులు ఈడనే వుండుగ్రని. నువ్వు నాలుగు పైసలు సంపాయించి సంక వేరే యిల్లు దీసుకోని వుందువుగని. ఇగో. ఈ గుడిశెకే పదిహేను రూపాయలు కిరాయి తీసుకుంటడు. ఇంక నాలుగు రోజులయితె ఈడగూడ భూమి ధర పెరిగిపోతది, వాడు లేవగొడతడు" అంది బాలమ్మ.

చాపలు తినరుగనక, పచ్చిపులుసుతోనే తమ భోజనాలైన తర్వాత—

"మమ్ములను యాడికి పొమ్మంటవు బాలమ్మా?" అని అడిగింది ధనలక్ష్మి.

"ఇంకేదన్న పొలంలకుపో. అడిచ్చిన పైసలు ఖుగెవ్వరు యిస్తరా ఏంది. నీ పిల్లలను యిండ్లళ్ల పనికి బెట్టు. ఏదో యింత మిగిలింది సగిలింది దొరుకుతది."

"దానికేం పనొస్తదమ్మా"

"అయ్యో అట్లంటవు. నా బిడ్డ నీ పిల్లకంటె చిన్నది. మూడిండ్లల్ల పని చేస్తది. మేం పొద్దుటి పూట ఒండుకోనే ఒండుకోం. అది తెచ్చిందే సరిపోతది ఒక్కొక్కనాడు."

ధనలక్ష్మి మౌనంగా కూర్చుంది.

"ఇంక పండుకో, మల్ల పొద్దున్నే పోవాలె."

"నాకు గూడ యిన్ని కూరగాయలు వేయించరాదు తిరుగుత."

"నాదేంబాయె. ఎ య్య స్త. పొద్దుట్నించి పొద్దు మీకిందాక తిరుగుడుకు అలవాటు గావలె.

లేకపోతె మూడు నాలుగిండ్లు పట్టుకోని నువ్వే పనిజేసుకో."

ధనలక్ష్మికి పెద్ద బెంగ, పిల్లలు ఈ వాతావరణంలో ఎలా వుంటారోనని మళ్ళీ పారిపోయి శంకరమ్మయింటికో, ఎల్లమ్మ వద్దకో చేరుకుని తను యిక్కడ యిలా వుంటున్నానని చెబితే కోటయ్య ఏం చేస్తాడో? పిల్లల్ని తీసుకుపోతాడు.

పిల్లలు ముడుచుకుని పడుకున్నారు. పక్కనే బాలమ్మ పిల్లలు రాత్రంతా అక్కడ కొట్లాటలు, బూతులు, తగవులు, తాగొచ్చిన వాళ్ళ అరుపులు విని పిస్తూనే వున్నాయి మురికికాల్వల వాసన ముక్కులు పగలకొడుతున్నది. బాలమ్మ మొగుడు రాత్రంతా దగ్గుతూ పక్కనే వుమ్మేస్తున్నాడు.



# 10

జనరల్ ఎలెక్షన్లు వచ్చాయి.

నగరమంతా హడావిడిగా వుంది. ఎక్కడ చూసినా జెండాలూ, గోడలమీద

నినాదాలూ, ఫలాన గుర్తుకే ఓటు వెయ్యమని అభ్యర్థనలూ, మీటింగులూ, పార్టీ జెండాలతోతిరిగే జీపులూ, కార్లూ, ఆయా అభ్యర్థుల కోసం తిరిగే కార్యకర్తలూ.

ధనలక్ష్మి వుంటున్న కూలీల పేటలో కూడా మీటింగుల సంరంభం జాస్తిగా వున్నది. రోజుకొక మీటింగులాగ జరుగుతున్నది. ప్రతి యింటికీ కార్యకర్తలు వచ్చి మరీమరీ చెప్పి పోతున్నారు. పిల్లలకు ఎక్కడలేని సంబరం. వాళ్ళకు చిన్న చిన్న జెండాలిచ్చి వూరేగమంటున్నారు. జై కొట్టమంటున్నారు.

ధనలక్ష్మికి ఒక నెల రోజులుగా ఆరోగ్యం బాగులేదు. దగ్గు మొదలైంది. ఏ మాత్రం పనిచేసినా అలుపు వస్తున్నది, దమ్ము వస్తున్నది. రాత్రంగా దగ్గుతుంటూ కూర్చుంటే ప్రొద్దున లేచే ఓపిక వుండటంలేదు. కాని కూలీకి పోక తప్పదు. దగ్గు విపరీతమైనప్పుడు తెల్లారి ఆస్పత్రికి పోవాలనుకుంటుంది. "ఇదేమి దగ్గో, ఏమిటో?" అని అనుమానం వస్తుంది, భయమేస్తుంది. పిల్లలను దూరంగా పడుకో బెడుతుంది. ఆ దగ్గు వాళ్ళకెక్కడ వస్తుందో అని బెంగ పడుతుంది. కాని తెల్లారి దగ్గుతూనే పనికి పోతుంది. "ఆస్పత్రికి రేపుపోవొచ్చులే" అని అశ్రద్ధ. ఈ చిన్న గుడిశెకు కూడా పన్నెండు రూపాయలు కిరాయి.తన కూలీ తిండికే సరిపోదు. అందులోనే కిరాయకు మిగల్చాల్సి, ఇంక పనికి నాగపెట్టే అవకాశం లేదు. కాని ఆమె లేవలేక పోయిన రోజులున్నాయి. ఇరుగు పొరుగు ఇప్పుడు కూడా తనకు చాతకాని రోజుల్లో పిల్లలకు యింత పెట్టాల్సిన పరిస్థితిలోనే వున్నది.

రెండు మూడు సార్లు హేమ,

"ఇక్కడ బాగలేదమ్మా నాయిన దెగ్గరికి పోదాం" అంది. తను చావబాదింది. కాని ఎన్నాళ్ళిలా నెగ్గుకురాగలదు! సాయంత్రమయ్యేసరికి యిద్దరు పిల్లలూ మట్టిలో ఆడిఆడి దుమ్ము కొట్టుకుపోయి చేరతారు వాళ్ళు ఎండలో తిరిగి నల్లబడ్డారు. తిండి లేక చిక్కిపోయారు. అక్కడి సావాసాలతో వాళ్ల యిదివరకున్న తన పిల్లల్లా లేరు. పెద్ద పిల్ల రెండు రోజులు ఒకరింట్లో పనిచేసింది. కాని అది చేసిన పనికి తీసేశారు. దానికి పనిరాదు అందుకోసారి కొట్టింది. ఎవరింట్లో పడితే వాళ్ళింట్లో అణిగిమణిగి పని చెయ్యాలని దానికి తెలియదు. పొద్దున్న లేవదు.ఇప్పుడది తనమాట వినటం మానేసింది.కొట్టినాసరే వినదు. తిడితే పట్టించుకోదు.

"ఎందుకు ఊకె కొడుతవు. నాయిన దగ్గరికి పంపించరాదు."

కొన్నిసార్లు తన అసహాయత్వం మీద నిజంగా విసుగు బుట్టి. వాళ్ళను తీసికెళ్ళి శంకరమ్మ యింట్లోనో, ఎల్లమ్మ దగ్గరో చడీ చప్పుడూ కాకుండా వదిలి రావాలనిపించేది. మరికొన్ని సార్లు తను స్వయంగా కోటయ్యతో మాట్లాడి పిల్లల్ని అతడికి అప్ప జెప్పి రావాలనిపించేది. కాని ఈ ఆలోచనలన్నీ రాత్రి పూటో, దగ్గుతూ లేవలేక పడుకున్నప్పుడో వచ్చేవి. మళ్ళీ కాస్త లేచి పనికి పోగలిగే సత్తువొస్తే "ఎందుకు.ఎక్కడికీ పంపను నేనే సాదుత." అనుకునేది. రోజూ పని గాక రెండు మూడిళ్ళు పట్టుకుని వాకిళ్లూ

డుస్తున్నది. ఇళ్ళలో పనిచేస్తున్నది కాని అది తనశక్తికి మించిపోతున్నది. తీరిక అస్సలు లేదు ఒళ్ళు హూనమై పోతు న్నది.

ఒకనాడు—

ఒక ఎలెక్షను అభ్యర్థి తాలూకు కార్య కర్తలున్న జీపు వచ్చి ఆగింది. చుట్టూ మూగిన పిల్లల్లో హేమ కూడా చెల్లెల్నె త్తుకుని నిలబడ్డది.

"నాయినా" అనికేకేసింది.

కోటయ్య ఆశ్చర్యపడుతూ జీపు దిగాడు.

"ఏమే, మీరు ఈడ వున్నారు ?" అన్నాడు మైకు పక్కవాడికిచ్చి.

"ఇదేం ఏశమే, బిచ్చపోల్లపోరలోలె తయారైనుర్రి. యాడ వుంటున్నారు ?" అంటూ చిన్న పిల్లను తీసుకుని హేమ వెంటనడిచాడు.

"ఇదే నాయినా" అంటూ చూపిం చింది హేమ.

"ఈ గుడిశేనా?" లోపలికి తొంగి చూశాడు. తలుపు పక్కన ధనలక్ష్మి పడుకుని దగ్గుతున్నది. దగ్గువల్ల, అలుపు వల్ల, బలహీనత వల్ల ఆమె బాగా చిక్కి పోయింది. జుత్తు చెదిరి, కళ్ళు వుబ్బి మనిషి అసహ్యంగా తయారై వున్నది.

"రా నాయినా, అమ్మా నాయినొ చ్చిండు. ఇయ్యాల మీ సబ వున్నాదా నాయినా ?"

"ఊఁ. ఊఁ." అంటూ కోటయ్య లోపలి కొచ్చాడు. ధనలక్ష్మి బలవం తంగా లేచి కూర్చుని,

"అశేమ్మే, ఆ పీట యియ్యి" అంది. కోటయ్య పీట తీసుకుని కూర్చున్నాడు.

ధనలక్ష్మికి గొంతు పట్టుకుంది. మాట రాలేదు. కోటయ్య గూడా మాట్లాడ లేదు. గుడిశె చుట్టూ పరికించి చూశాడు. హేమను దగ్గరగా తీసుకుని బుజం మీద చెయ్యేసి కూచోబెట్టున్నాడు

"నాయినా మేం ఒస్తం నీ వెంట తీస్కపో నాయినా" అంది హేమ.

కోటయ్య తన వాచీలో టైం చూసు కుని, షర్టు పై గుండీ తీసుకుని ఊదు కున్నాడు.

"వాళ్ళు ఒస్తమంటున్నరు తీస్కపో" అన్నది ధనలక్ష్మి బలహీనంగా– అతడి వైపు చూడలేక తల కిందికి వాల్చు కుంది.

కోటయ్య ఆమెనూ, పిల్లల్నీ మరొ క్కసారి పరికించి చూశాడు.

ధనలక్ష్మి మళ్ళీ, "వాళ్ళు ఒస్తరట తీస్కపో" అంది.

"యాడికి తీస్కపోవాలె ?"

"నీ ఎంట తీస్కపో. రోజు అడుగు తున్నరు ఒస్తమని. నువ్వు యాడ వున్నవో తెలువక తీస్కరాలేదు" అంది.

"ఎందుకు తీస్కపోవాలె ? తీస్క పొయ్యి ఏంజేసుకోవాలె ?"

"అట్లంటవూ నీ పిల్లలుగారా వాళ్ళు ? నాకు పనికిపొయ్యే ఓపికలేదు. అదిగాక వాళ్ళీడ వుండలేరు"

"మళ్ళ ఎప్పుడు తెచ్చుకుంటవు ? బాగ్గాంగనే తెచ్చుకుంటావా ?"

"ఏమో నాకు బాగైతదో లేదో తెలువదు. సూస్తున్నవుగద ఇక్కడుంటె పిల్లలు ఖరాబై పోతున్నరు"

"ఊఁ. నేను పిల్లలను తీస్కపోతే పీడపొయ్యిందని నువ్వు టింగురంగా అని



చతుర

తిరుగుతవా? నాకిదే పని అనుకున్నావా? పిల్లల సంగతి, గిల్లల సంగతి నాకు తెలువదు. నేను వేరే పనిమీద ఒచ్చిన ఇక్కడికి, పోతున్న" అన్నాడు హేమను వదిలించుకుని అవలికిపోతూ.

"ఇగో ఒక్కమాట" అంటూ దిగ్గున లేచింది ధనలక్ష్మి.

"నాకు చాతకాదు, వాళ్ళిక్కడ వుండ లేరు తీస్కపో. నీతో మాట్లాడేదున్నది, జెర లోపలికిరా" అంది తూలి దర్వాజ పట్టుకుని.

"నాయినా నీ ఎంట ఒస్త, అమ్మను గూడ తీస్కపో నాయినా, అందరం ఒస్తం" అని ఏడుస్తూ హేమ తండ్రి పాంటు పట్టుకుంది.

"ఇడువే పోరీ, మీ అమ్మదగ్గర్నే సుఖపడుని౨. నాకు పనున్నది పోవాలె" అంటూ ఆ పిల్లను తోసేశాడు కోటయ్య.

"నీ కాళ్ళు మొక్కుత. నువ్వు నన్ను ఏమన్న జెయ్యిగని పిల్లల్ని మాత్రం ఇక్కడుంచకు. వాళ్ళ ప్రాణాలన్నీ అక్కణ్ణే వున్నాయి" అని ధనలక్ష్మి అతని కాళ్ళమీద పడిపోయింది.

"ఛత్ చెడిపొయ్యినదానా, నీకు నా కాళ్ళు పట్టుకునే అర్హతలేదు. దూరం నిలబడు. ఏమనుకోని నాతోని మాట్లాడు తున్నవే ? నేను వాళ్ళను తీస్కపోతే నువ్వు నీ యిష్టమొచ్చినట్టు తిరుగొచ్చు ననుకుంటున్నావు. నీ తిరుగుడుకు, నీ సుఖాలకు పిల్లలడ్డమొస్తున్నారు?"

"నన్నుసూశి మాటాడుజెర. నేను సుఖపడుతనని నువ్వేమి ఫికరుచెయ్యకు. నా మొకం సూస్తె నేనెంత సుఖపడు తున్ననో తెలుస్తలేదా. నేను సుఖపడు తున్నట్టే కనిపిస్తున్ననా ?"

"మరేమనుకుని ఒచ్చినవే ? ఏంచేశి బతుకుతనని ఒచ్చినవు? దేంతోని పిల్లలను సాదుతననుకున్నవు ? అఖరికి నేను వాళ్ళను తీస్కపొయ్యినా మల్ల ఎందుకు ఎంట తెచ్చుకున్నవు ? ఆ యాళ ఏం మాటాడినవు ముండా ? వాళ్ళను నువ్వే వుంచుకో, సాదు"

హేమ మరింత బిగ్గరగా,

"నాయినా మమ్ములను తీస్కపో" అని ఏడుపు లంకించుకుంది.

"నాది తప్పే. శిక్షవెయ్యి, కాదనను. గని పిల్లల్ని యిక్కడ యిడిశిపోకు. వాళ్ళు నన్ను నమ్ముకోని ఒచ్చిను౨ నామీద కోపంతోని వాళ్ళను కష్టపెట్టకు. నీ కోపం సల్లారెటట్టు నన్ను హింస పెట్టు, నా తల నరుకు"

"ఇన్నాళ్ళెందుకు తేలేదు మరినా దెగ్గరికి ? వాళ్ళు లేంది బతుకను. వాళ్ళ కోసమే నా బతుకు, వాళ్ళకోసమే అన్నీ అంటివి. మరి వాళ్ళను పంపిచ్చి నువ్వేం చేస్తవు? నువ్వేవని దగ్గరికి పొయ్యి కులుకుతవు?"

"హయ్యో! నా సంగతి నువ్వు అనుమానం పెట్టుకోకు. నే నెవ్వరితోని కులుకను. వీళ్ళు లేకుంట ఒక్క నిమిషము గూడ సుఖపడను. నేనేమిజేస్తె వీళ్ళను తీస్కపోతవో చెప్పు. అదే చేస్తను"

"వాళ్ళను తీసుకోని నువ్వు నా యింటికి రా. నే నెక్కడున్ననో సూడు. నువ్వు చేసిన తప్పేందో జెప్పు. ఎట్ల సరిజేసుకుంటవో గూడ చెప్పు. నేను తీసుకపోతె నీ కెట్ల తృప్తి వుంటది ? వాళ్ళ మీది నీ ప్రేమంత ఏమైపోతది?"

దగ్గిరొరవచ్చి సతమతమై అక్కడే కూలబడింది ధనలక్ష్మి.

"లోపలికి పదే అమ్మా" అంటూ హేమ ఒకవైపు, కోటయ్య ఒకవైపు పట్టుకొని తెచ్చి ఆమెను పడుకోబెట్టారు. కాస్త తేరుకున్న తర్వాత బలహీనమైన గొంతుకతో,

"ప్రేను ఏంది? అక్కర తీరితె అంత ప్రేమనే. ప్రేమతోని కడుపులు నిండు తయా? వాళ్ళను తీస్కపొయ్యి బాగ సూసుకో. అంతేసాలు" అంది.

"నీసంగతి చెప్పవే. నీకు నా మీద మనసు లేదు సరె. మరెవనిమీద మన సున్నది? యాడికి పోవాలనుకుంటు న్నవు? ఏంచేస్తవు?"

"ఇట్లాగాదు ఇగ నువ్వే జెప్పు. నన్నేం జెయ్యమంటవు? ఈ రోగంతోని కూలి జెయ్యలేను. లేస్తె దమ్మొస్తున్నది"

"కూలిచేశి ఎవ్వరు బాగుపడ్డారే? నువ్వు యింక పది జన్మలు కూలిచేశినా యింతే. బాగుపడాల్నంటె నీవోలె కష్ట పడొద్దు."

"తెలివిలేనిదాన్ని. నీకున్నన్ని ఆలో చనలు నా కెక్కడియి? అందికే నా గతి యిట్లయింది గని నువ్వేంచేశి సంపా యించినవు చెప్పు జెర."

"ఏటో ఒగటి. ఏంచేస్తె నీ కెందుకే? ఇంకా సిల్గుడు పోలేదా నీకు? ఇప్పుడు సుద్దపూసోలె. 'చాతకాదు. పిల్లలను తీసుకపో' అంటె తీస్కపోతనను కున్నవా? అప్పట్ది నీ కావురానికి తపొప్పుకో. నువ్వు ఒకొక్కమాట ఎంత సిల్గుడుతోని మాట్లాడినవో. ఏమ న్నవో. ఎందుకట్ల చేశినవో-అన్నిటికి జవాబు చెప్పు. నీ మాటలు నాకు యాది లేవనుకోకు. నేను ఏదీ మరిచిపోలేదు. చెప్పు ఎందుకట్ల చేశినవు. ఇప్పుడు నా పైస సూశి నా యెంట పడుతున్నవు. పైస లాలూచిదానా! నా దగ్గర పైసలు లేన ప్పుడు ఎప్పుడన్న నన్ను దగ్గరికి తీసి నవా? ఇప్పుడు నీ కావురమనిగింది గనుక కాళ్ళబేరాని కొస్తున్నావు. నీ కష్టానికి నే నాదుకోవాలె గని నా కష్టానికి నన్ని డిశి పెడ్తావు? ఏం మొకం పెట్టుకొని నాతోని మాట్లాడుతున్న వే? పిల్లలనునువ్వు తీస్కపొమ్మంటె తీస్కపోవాలె. ఒద్దంటె మానెయ్యాలె? ఏం నువ్వు నాకు ఆజ్ఞ పెడతావే? సిగ్గుశెరంలేని నీచపు ముండా. పైసలకోసం నువ్వేపనన్న చేస్తవు."

ధనలక్ష్మి అతడి మాటలను పట్టిం చుకోనట్టుగా తన ధోరణిలో—

"నాకు అభిమానం లేదు, సిగ్గులేదు. పొట్ట చేతబట్టుకున్నపుడే అన్ని ఇడిశిన. మంచో, చెడ్డో ఇన్నాళ్ళు కష్టపడ్డ. ఇగ పడలేను. అందికే వాళ్లను తీస్కపొమ్మని యింత గనం అడుగుతున్న నువ్వు తిట్టినా, కొట్టినా ఇప్పుడు నాకొక్కటే. నేను వాళ్ళకు తిండి పెట్టలేను. ఇక్కడే వుంటె వాళ్ళు తిండికి సస్తరు. తండ్రి బతికుండంగ పిల్లలు ఎందుకట్ల గావాలె. నేను తప్పు, నా రీతి తప్పు. నేను బతుకుడే తప్పు గని పిల్లల్ని తీసుకపో సరేనా?"

"ఇంక నీతులు మాట్లాడుతున్నావు ముండా! పిల్లలు నిన్ను థూ అంటున్నరు. ఇగనన్న శిగ్గు తెచ్చుకో. నేను అను కున్నది జరిగింది. సాలు బాగు పడా

ల్నంటె ఇప్పటికన్న నా యెంట రా. నా యిల్లు సూడు. నా హోదా సూడు. నా యింటి కెవరొస్తరో సూడు. నేను చెప్పినట్టు విను. నెలరోజుల్ల నీ అదృష్టం మార్చేస్త. ముప్పై ఏండ్లు నిండని ముసల్దానివి. నిన్ను పరుపుల మీద పండబెడ్త పద."

"నాయినా నన్ను మోటర్ల తీస్కపో ఒస్తం నాయినా" అంది హేమ.

"ఇప్పుడొద్దే. రేపు పొద్దున వొచ్చి మిమ్ములనందర్నీ తీసుకపోత. ఇప్పుడు నాకు వేరే అర్జంటు పనున్నది. పొద్దున తయ్యారై వుండుమని" అంటూ జేబు లోంచి ఓ పది రూపాయల నోటు తీసి ధనలక్ష్మి మీద విసిరేసి వెళ్ళిపొయ్యాడు కోటయ్య.

మర్నాటి ఉదయం కోటయ్య జీపును ధనలక్ష్మి గుడిసె ముందర ఆపాడు. అప్పటికే అక్కడ జనం గుమి గూడి వున్నారు. పిల్లలు ఏడుస్తున్నారు. హేమ ఎదురొచ్చి,

"అమ్మ లేదు నాయినా, ఎక్కడికో పొయ్యింది" అంది.

"ఎప్పుడు పొయ్యింది?"

"ఏమో, మేము లేచెటప్పటికే పొయ్యింది."

ఆ వాడలో అడిగారు ఆ బస్తీల అడిగారు. తోటి కూలీల నడిగారు. రోడ్లు వెదికారు. చెరువులూ, కాలవలూ, రైల్వే క్రాసింగులూ గాలించారు. పోలీస్ స్టేషన్‌లో రిపోర్ట్ యిచ్చారు. కాని ధనలక్ష్మి జాడ తెలియలేదు.

కోటయ్య ఆ యిద్దరు ఆడపిల్లల్ని తీసుకుని దీనంగా జీపువైపు నడిచాడు. *



# రబ్బరు బొమ్మలా మెలితిరిగే మనిషి

ఒక్కొక్క సందర్భంలో, అనుకోని సంఘటనలు మానవ జీవిత గమనాన్నే మార్చి వేస్తుంటాయి. సరిగ్గా ఇటువంటిదే జరిగింది పంజాబ్‌లోని కొట్లా సహియా గ్రామానికి చెందిన మనోహర్‌సింగ్ విషయంలో. మూడేళ్ళ వయస్సులో ఉండగా అతను తల్లితో కలసి, ఓ తిరనాళ్ళకి వెళ్ళాడు. అక్కడ ఒక దుకాణంలో, స్ప్రింగ్‌తో తల ఆడిస్తూ నుంచున్న ఒక ఆట బొమ్మని చూశాడు. అమ్మ దగ్గర గారాం చేసి రూపాయి పావలా పెట్టి ఆ బొమ్మని కొనిపించాడు.

ఇంటికి వెళ్ళాక ఆ బొమ్మతో కాసేపు ఆడుకున్నాక అతనిలో ఆ కదలికలపట్ల ఆసక్తి పెరిగి జాగ్రత్తగా అనుకరించటం ప్రారంభించాడు. ముందు అటూఇటూ మెడని త్రిప్పడంతో మొదలైన అతని అనుకరణ, కొద్ది రోజులలోనే మెడని సాగదీయ గలగడం వరకు వచ్చింది. మరికొన్నాళ్ళలో అతను మెడను, పూర్తిగా వెనక్కు కూడా తిప్పగలిగే నేర్పుని సంపాదించాడు.

ఈనాడు మనోహర్‌సింగ్ వయస్సు 28 సంవత్సరాలు ఈ 25 సంవత్సరాల, కఠోర తపస్సువంటి స్వయం శిక్షణలో, అతడు మెడని పన్నెండు అంగుళాల వరకు సాగదీయగలగడం సాధించాడు. మనోహర్‌సింగ్ ఒకసారి స్కూల్లో కబాడీ ఆడుతుండగా, అతని భుజపుకీలు స్థానం తప్పింది. అతను టీమ్‌లో ఉన్నంతకాలం విజయం సాధించిన అతని టీమ్, అతను పాల్గొనకపోయేసరికి ఓడిపోసాగింది. ఈ ఆవేదనభరించలేక అతనొకసారి గట్టిగా చేతినిఝాడించాడు.విచిత్రం

కీలు యథాస్థానంలోకి వచ్చింది. వెంటనే అతను టీమ్‌లో జేరి, ఆడి దానికి మళ్ళీ విజయం సంపాదించిపెట్టాడు. ఆ తర్వాత ఇంటివద్ద కావాలనుకున్నప్పుడు కీలుని స్థానం తప్పించటం తిరిగి యథాస్థానంలో ఉంచడం అభ్యసించసాగాడు. మొదట్లో అది కొంచెం నొప్పి కలిగించినా, ఈనాడు కేవలం ఒక ఊపుతో అతను తన భుజపు కీలుని తప్పించగలడు.

ఈ శిక్షణలతో అతని దేహం కీలుబొమ్మలా, నూనె వేసిన యంత్రంలా ఎటుపడితే అటు సులువుగా తిరగటం సాధించింది. మామూలు మనుష్యులకివి అసాధ్యం. మనోహర్‌సింగ్, ఈనాడు తన శరీరావయవాలతో 31 విచిత్ర బంధాలు వేయగలడు.

"నేనైతే యోగాసనాలు అన్నీ వేయగలను కాని అనుభవమున్న యోగులు కూడా నేను చేసేవి చేయలేరు" అని గర్వంగా అంటాడు ఆరడుగుల ఎత్తైన మనోహర్‌సింగ్. చూస్తేనే కాని నమ్మలేని ఈ అద్భుత విద్యని ప్రదర్శించే శ్రీ సింగ్ శాకాహారి, త్రాగుడు ఎరగడు. హాస్యప్రియుడు- అత్తమామల మీద, భార్యమీద, హాస్యోక్తులు చెప్తూ, అందర్నీ నవ్విస్తుంటాడు.

ఏడేళ్ళ క్రితం పంజాబ్ పోలీసు సర్వీసులో కాన్‌స్టేబుల్‌గా జేరాడు. ఢిల్లీ టి. వి. లో తన విద్యను ప్రదర్శింపబోతున్నాడు. అది తన జీవితంలో పెద్ద మలుపు కావచ్చని ఆశిస్తున్నాడు.

ఇప్పుడు
మీరు చూడబోయే
ఫోటోలు మీకోసం
ప్రత్యేకం

# ప్రశంస

ఆ రోజు ఆఫీసంతా హడావుడిగా వుంది. జగన్నాధానికి మేనేజిమెంట్ వారిచ్చిన కాయితమే ఆ హడావుడికి కారణం. ఆ కాయితం ఒక ఎప్రీసియేషన్ లెటరు. అందులో యిలా వుంది:

"మీరు ఫలానా తారీఖున మాకు యిచ్చిన సలహాకు ఎంతో సంతోషించాము. మీ తెలివిని ప్రశంసిస్తున్నాము."



ఆ కాయితాన్ని చదువుతున్న జగన్నాధం ఉబ్బి తబ్బిబ్బై పోయాడు. కనిపించిన స్నేహితులందరికీ చూపించేశాడు. కనిపించని వార్కి ఫోను చేసి మరీ చెప్పేడు.

ఆ రోజు మొదలు జగన్నాధం దగ్గరనుంచి ఏదో ఒక విషయం మీద మేనేజిమెంట్‌కు సలహాలు రోజుకొకటి అందుతూండేవి. కంపెనీ ఆఫీసుకు వెళ్ళే త్రోవలో చిన్న సైజు కలప ముక్కలు పడివుంటే, ఆ కలప అట్లా పడి వుండటం వల్ల కంపెనీకి ఎంత నష్టమో, త్రోవలో చిన్న చిన్న ఇనుప వూచ ముక్కలుంటే, వాటి ఖరీదుల్ని అణా పైసల్లో కలిపి లెఖ్ఖలు వేసి యింత సొమ్ము వృధా అయిపోతుందని, మేనేజిమెంట్‌కు యింత అశ్రద్ధ పనికిరాదని... యిలా, యిలా అన్నిటిపైనా సలహాలు తెగ గీకి పారేశాడు.

ఓ రోజు మామూలుగానే మేనేజిమెంట్ నుంచి జగన్నాధానికి ఓ కవరు అందింది. అతని ఆనందానికి అంతు లేదిక. చుట్టూ చేరిన మిత్రుల వంక ఓ సారి గర్వంగా చూసి ఆ కవరు విప్పి అందులోని కాయితం తీసి చదివాడు. అంతే! నిలువు గుడ్లేసుకుని వుండి పోయాడు.

"మీరు ఫలానా రోజున ఫలానా విషయమై వ్రాసిన సలహా అందింది. ఫలానా రోజున వర్కు సైటులో వున్న వాటి గూర్చి వ్రాసిందీ అందింది. వీటిని బట్టి చూస్తే మీ రసలు మీ సీటు వర్కు పూర్తిగా అశ్రద్ధ చేశారనీ, సీటులో వుండక, వర్కు సైటులలో తిరుగుతున్నారని బోధ పడింది. ఇంత అశ్రద్ధగా డ్యూటీని చేస్తున్న మీపై ఎందుకు చర్య తీసుకో కూడదు? ఈ విషయమై యిరవై నాలుగ్గంటల్లో మీ నుంచి సమాధానం రానిపక్షంలో మిమ్మల్ని సస్పెండ్ చేయడానికి మాకు అధికారం వుందని గ్రహించగలరు."

—యం. ఉమామహేశ్వరరావు

# కిటుకు

"...అభ్యర్థి శ్రీ విఘ్నేశ్వర్రావు పదివేల ఓట్ల మెజారిటీతో గెలుపు!"

పేపరు చూస్తున్న నేను ఆశ్చర్యపోయాను. విఘ్నేశ్వర్రావు గెలవడమేమిటీ అని? విఘ్నేశ్వర్రావుకి రాజకీయాలు బొత్తిగా తెలీవు. వాగ్దానాలు చెయ్యడం తెలీదు. మోసం చెయ్యడం తెలీదు. నాయకులకీ, వాళ్ళ సంతానానికీ తరతరాల 'సేవ' చెయ్యడం తెలీదు. సోషలిజం తెచ్చితీరతామని బెదిరించడం తెలీదు. నిరుద్యోగాన్ని రూపుమాపుతాం మార్పు నినాదాలు యివ్వడం చేతకాదు. ఇన్ని అనర్హతలతో వాడు గెలిచాడంటే నేను ఆశ్చర్యపోవడంలో విడ్డూరం యేముంది? వాడు ఎలక్షన్లలో నిలబడతానన్న రోజున నేను వాణ్ణి నానాచీవాట్లు పెట్టాను. నువ్వు నెగ్గవు అని జోస్యం చెప్పాను. చెడిపోతావ్ అని హెచ్చరించాను. అయినా వాడు ఖాతరు చెయ్యలేదు. నాకు మహా కోపం వచ్చింది. 'నీ చావు నువ్వు చావు' అని వెళ్ళిపోయాను. తర్వాత వాడు—రెండుమూడు పార్టీలకు అప్లైచేశాడు. ఒక పార్టీవాళ్ళు టిక్కెట్టు ఇవ్వగానే మిగతా పార్టీలకు విడాకులిచ్చేసాడు. అంతే వాడి నియోజకవర్గం మొఖంకూడా సరిగా చూడలేదు. అక్కడ పర్యటించడం కానీ ఉపన్యాసాలు ఇవ్వడం కానీ, ఆఖరికి కరపత్రాలు పంచిపెట్టడం కానీ చెయ్యలేదు. పోలింగ్ మరో నాలుగు రోజులుందనగా వాడు మా ఊళ్ళోనే ఉన్నాడు. నేనే వాడి నియోజక వర్గానికి వెళ్ళి పరిస్థితి చూసి వచ్చాను. అక్కడ మా వాడి ప్రత్యర్థులు మా వాడికి ఆఖరికి ఒక్కగోడ కాదు కదా, గోడలో ఒక్క మూలకూడా దక్కనీయలేదు. అన్నీ వాళ్ళపేర్లతోనే, వాళ్ళపార్టీ గుర్తులతోనే ఖరాబు చేసేశారు. అసలు దగ్గిరకెళ్ళి తడిమిచూస్తేకానీ అవి గోడలని తెలీటంలేదు. ఎక్కడ చూసినా వాళ్ళపేర్లే. మరి గెలిచినందుకు నాకు ఆశ్చర్యం కలగదా? అందుకే వెళ్తున్న. చూస్తూనే వాడు నన్నమాంతం కావలించుకున్నంత పనిజేశాడు. ఆ మాటా యీమాటా అయింతర్వాత నా సందేహం బయటపెట్టాను.



"నువ్వు నీ నియోజక వర్గంలో ఎవ్వరికీ తెలీనివాడివి. అందరిలా వాగ్దానాలూ ఉపన్యాసాలూ, మీటింగులూ గట్రా చెయ్యలేదు. కనీసం కరపత్రాలన్నా పంచిపెట్టలేదు. పైగా మీ పార్టీ యిక్కడ

యెప్పుడూ గెలవలేదు. ఏ గోడలమీద చూసినా మీ ప్రత్యర్థుల పేర్లూ వాళ్ళ పార్టీ గుర్తులే తప్ప నీ పేరుగానీ గుర్తుగానీ లేదు. మరి నీ వెలాగ గెల్చావో చెప్పి నా అజ్ఞానాన్ని పారదోలి పుణ్యం కట్టుకో"మని ప్రార్థించాను.

వాడు రాజకీయ బోధిసత్త్వుడిలా చిర్నవ్వు నవ్వి యిలా అన్నాడు :

"ఎలక్షన్లు రెండు రోజులు ఉన్నా యనగా ఇంటింటికీ వెళ్ళి నాకు ఓటు యిచ్చి గెలిపిస్తే యితర పార్టీలవాళ్ళు ఖరాబుచేసిన మీ గోడలకు వెల్లవేయిస్తానని చెప్పాను. అంతే !" అన్నాడు.

**—రావూరి ప్రసాద్**

# పరవశం

బస్ కదిలింది బరువుగా. నాల్గుగంటలు బస్‌లో కూర్చోవాలంటే మహాబోర్! 'ఏదైనా పత్రిక ఉంటే బావుణ్ణు' అని చుట్టూ చూశాను. ఏ ఒక్కడి దగ్గరా కనీసం దిన పత్రికైనా లేదు!

ప్రయాణంలో నాకిదో అలవాటు. బస్‌లో ఎవరి దగ్గర ఎలాంటి పత్రి కున్నా అది అడిగి పుచ్చుకుని తనివితీరా చదివి మరో తోటి పాఠకుడి కివ్వగం:

మరకొంత సేపటికి బస్ ఆగింది. 'కాఫీలు తాగొచ్చు' అని కండక్టర్ దిగి పక్క హోటల్‌లోనికి దూరాడు. నేనూ దిగి కాఫీ తాగి, కిళ్ళీ బిగించి పక్కన ఉన్న పుస్తకాల షాపు దగ్గర నిలబడ్డాను. రకరకాల సినిమా తారల ముఖ చిత్రాలతో అందంగా పుస్తకాలెన్నో వేలాడు తున్నాయి. కొందా మనిపించింది. ఇంతలో నా పక్కనే కూర్చున్న తను పరుగున వచ్చి, ఓ అందమైన సినిమా పత్రిక కొనేశాడు. 'హమ్మయ్య' అనుకున్నాను నా అదృష్టాన్ని అభినందించుకుంటూ !



అతను పాపం అయిదు నిమిషాల్లోనే బొమ్మలన్నీ చూసేసి ఆకలిగా అతని వేపు చూస్తున్న నాకు అది యిచ్చేశాడు. గంటలు గడిచి పోయాయి. నా అభిమాన తారల జీవిత విశేషాలు, వాళ్ల హాబీలు చదవడం ఓ థ్రిల్! ఇంతలో నేను దిగవలసిన చోటు వచ్చేసింది. 'పుస్తకం ఇచ్చేద్దాం' అని పక్కకు చూస్తే అతను లేడు! "ఈవాళ లేచిన వేళ బావుంది పత్రిక ఫ్రీగా దొరికింది" అని మనసులో ఆనందిస్తూ మీదకి చూశాను. నా సూట్‌కేస్ అక్కడ లేదు! అసలు బస్‌లో ఎవరూ లేరు. నేనూ, 'నా' సినిమా పత్రికా తప్ప!

**—కిల్లాన మోహన్‌బాబు**

## కల్తీ

"అంటాను సుబ్బయ్యా, ముమ్మాటికీ అంటాను. నీ కొట్లో సరుకులన్నీ శుద్ధ కల్తీ!" రెట్టించాడు సైన్సు గ్రాడ్యుయేట్ సుబ్బారావు.

"ఇదిగో పంతులుగోరూ! జనం ఎర్రిబాగులోళ్ళు కాదండీ. నేను కల్తీ సరుకులమ్మితే కొంటానికి. నా సరుకులు కల్తీవని ఋజువయితే ఈ షాపే మూసేత్తాను. తెలిసిందా?" అరగంట సేపట్నుంచి విసిగిపోయి చివరి సారిగా తెగించి చెప్పేశాడు షావుకారుసుబ్బయ్య.

"ఇహనేం, సుబ్బయ్య చెప్పిందీ సబబుగానే వుంది. అయితే పంతులుగోరూ, మీరు ఋజువు చెయ్యడమే తరవాయి!" ఒక పెద్ద మనిషి మధ్యవర్తిత్వం చేశాడు.

"ఇదిగో! ఈ పేపర్లో ఏ పదార్థాలలో కల్తీ కలిపితే ఎలా తెలుసుకునేదీ వుంది చూడండి. ఉదాహరణకు బెల్లంలో కల్తీ కలిసిందీ,లేనిదీ తెలుసుకోవాలంటే నీళ్ళలో కాస్త బెల్లం కరిగించి, కొద్దిగా హైడ్రోక్లోరిక్ఆమ్లం వెయ్యాలి. బెల్లంలో కల్తీ కలిసిందంటే ఎర్రగా మారుతుంది. ఇదిగో, నా దగ్గర హైడ్రోక్లోరిక్ ఆమ్లం వుంది. మీ కళ్ళెదుటే ఈ పరీక్ష చేసి, చూపిస్తాను" హుషారుగా పరీక్ష ప్రారంభించాడు సుబ్బారావు. గతుక్కుమన్నాడు షావుకారు సుబ్బయ్య.

పరీక్ష పూర్తయింది. బెల్లం ఎర్రగా మారలేదు. కాని, సుబ్బారావు ముఖం మాత్రం ఎర్రగా మారిపోయింది.

షావుకారు సుబ్బయ్య ముఖం వికసించింది. సుబ్బారావును తెగుడ్తూ, తన సరుకుల్ని పొగుడ్తూ గంటసేపు అదరగొట్టాడు. అప్పట్నుంచీ అతని సరుకులకు గిరాకీ పెరిగి పోయింది. నిక్కచ్చి సరుకులు మాత్రమే అమ్ముతాడనే పేరు చిరస్థాయిగా నిలిచిపోయింది.



పాపం ఇప్పటికీ సుబ్బారావుకు తెలీనిదల్లా ఒక్కటే! అతను కొన్న హైడ్రోక్లోరిక్ ఆమ్లమే కల్తీదని.

**—అంబటి రామారావు**

## సీటు

బస్సు పరిగెడుతోంది. బస్సులో నించున్నాడు రాజారావు. బస్సంతా ఒకటే రద్దీగా వుంది. రాజారావు చేతిలో రెండు సంచీలు. ఒక సంచీలో హాస్పిటల్లోవున్న

వాళ్లావిడకు కేరియరు, మరొక సంచీలో ఆఫీసుఫైళ్ళు, రాజారావు తాలూకు మరొకచెయ్యి బస్సు కడ్డీని గట్టిగా పట్టుకుంది.



బస్సు కుదిపినపుడల్లా రాజారావు మరొకరి మీద పడుతున్నాడు. రాజారావు మీద మరొకడు పడుతున్నాడు.

ముందు వాడు రాజారావుని గుర్రుగా చూస్తున్నాడు, రాజారావూ గుర్రుగా చూస్తున్నాడు— వెనుకవాడిని.

బస్సు పరిగెడుతూనే వుంది. చాలామంది కూచున్నారు. కొంతమంది కూచుని నిద్రకూడా పోతున్నారు.

రాజారావుకి ఒళ్ళుమండిపోతోంది— వాళ్ళు కూచున్నందుకు కాదు, నిద్రపోతున్నందుకు.

రాజారావుకి ఒళ్లుమండిపోతోంది— వాళ్ళు కూచున్నందుకు కాదు, మీరు కూడా కూచుంటారా అని ఎవ్వరూ ఆఫర్ చేయనందుకు. రాజారావుకి ఒళ్ళుమండిపోతోంది— వాళ్ళు కూచున్నందుకు కాదు, ఒక్కరూ తన సంచీలు తీసుకోనందుకు.

అందుకే అనుకున్నాడు, తనస్టేజిలో దిగిపోతూ, దిగిపోతూ, 'ఇదేనేను కూచుని వుంటేనా ఎవరు సామానుతో నించుని వున్నా సరే వాళ్ళనిపిలిచి సీటైనా ఇద్దును. లేకపోతే సామాన్లైనా తీసుకొని వుండును. అంతేకాని. ఇంత ఇన్‌హ్యూమన్‌గా అసలు సాటిమనిషి గురించి పట్టించుకోకుండా మాత్రం వుండను'

అదే రోజు సాయంత్రం—

మళ్ళీ బస్సెక్కాడు రాజారావు, చేతిలో రెండు సంచీలతో. ఒక దాంట్లో ఖాళీ కేరియరు, మరొకదాంట్లో కూరలు' సామానులు, అయితే ఈసారి రాజారావుకి బస్సులో సీటు దొరికింది.

రెండుమూడు స్టేజిలు దాటాక, చాలా రష్‌గా తయారైంది బస్సు. చాలామంది నించుని వున్నారు. కొంతమంది చేతుల్లో సంచీలు, పేకట్టులు, మోయలేని బరువులు.

అలా బస్సు చాలా దూరం ప్రయాణించాక, తన స్టేజివస్తే దిగిపోయాడు రాజారావు.

కానీ-

బస్సులో తను కూచునివుండగా ఎవరినీ కూచోమని గానీ, సంచీలు తనకివ్వండని గానీ అనలేదు. కూచున్నంతసేపూ నించున్న వారిగురించి రాజారావు అసలు ఆలోచించనే లేదు అవును, సీటు దొరకనంతవరకే ఆలోచన!

**—కొంపెల్ల విశ్వం**

# రెండు జడలు

వాణి ఆ కాలేజీలో కల్లా మంచి అమ్మాయి. బుద్ధిగా చదువు కుంటుంది. అందరితోనూ కలివిడిగా ఉంటుంది అందానికి తోడు తెలివైన పిల్ల

వాళ్ళ కాలేజీలో సాంస్కృతిక వారోత్సవాలు ప్రారంభ మయ్యాయి. రోజూ సభలూ నాటకాలూ జరుగుతున్నాయి. నాటకాలు పూర్తి అయ్యే సరికి రాత్రి ప్రొద్దు పోతోంది. ఆ సమయంలో ఇంటికి వెళ్ళడం పిల్లలకు కష్టంగా ఉండేది. అందుకని మరీ మంచిపను కొన్ని కార్యక్రమాలకు తప్ప ఆడపిల్లలు వచ్చే వాళ్ళు కాదు.

ఆ రోజు వెడదామంటే వెడదామను కొని అందరూ కలిసి కాలేజీ ఆవరణలోకి వెళ్ళారు. నలుగురైదుగురు అబ్బాయిలు వాణి బృందం కోసం ఎదురు చూస్తున్నారు. అందులో ఒకతను ఆడపిల్లలను ఏడిపించటంలో పేరు పడ్డాడు.
అతను 'వాణీ' అని పేరు పెట్టి పిలిచి 'జస్ట్ ఎ మినిట్' అన్నాడు.

ఇతనికి వాణీతో పనేముందని మిగతా వాళ్ళు అనుకొన్నారు. అందరికీ అర్థమైపోయింది. కానీ "ఏమండీ ఎందుకు పిలిచారు?" అనడిగింది వాణి నదురూ బెదురూ లేకుండా.

అతను కొంచెం నసుగుతూ "మీరు ఏమీ అనుకోకుండా ఉంటే ఒక్కమాట చెప్తాను. మీరు రెండు జడలు వేసుకుంటే చాలా అందంగా ఉంటారు. రేపు రెండు జడలు వేసుకు రారూ" అన్నాడు.

అతని మొఖంలో, ఒక అందమైన అమ్మాయిని ఇంత పబ్లిగ్గా పలకరించి, అలాచెయ్, ఇలాచెయ్ అని అవమానించిన ఘనుడననే భావం కానవచ్చింది.

వాణి స్నేహితురాళ్ళు ఏడుపుముఖాలు పెట్టేశారు. వాణి మాత్రం ఒక్క నిమిషంలోనే తేరుకుని నవ్వుతూ అంది.



"తప్పకుండా రేపు రెండు జడలు వేసుకొస్తానండీ. అయితే... నాకూ ఓ చిన్న కోరికుంది. మీరూ నా మాట ప్రకారం చేస్తానంటే..." అంది వాణి సంశయిస్తున్నట్లుగా.

వాణి అలా జవాబు చెబుతుంటే అటు వాణి స్నేహితురాళ్ళా, ఇటు ఇతగాడి స్నేహితులా ఆశ్చర్యానికి హద్దుల్లేవు:

అతను సంతోషంగా—

"తప్పకుండా వాణీగారూ, మీరడిగిన తర్వాత చేయకుండా ఉంటానా? సంగతేమిటో చెప్పారు గాదు" అన్నాడు.

"ఏమంత పెద్ద విషయం కాదు లెండి. మీరు 'గుండు' చేయించు కొంటే చాలా

అందంగా యుల్ బ్రిన్నర్‌లా కనిపిస్తారు. రేపు గుండు చేయించుకు వస్తారు గదూ!" అంది వాణి నవ్వుతూ.

—రావూరి రవీంద్రనాథ్

## బొమ్మల కొలువు

పేరంటం నిండుగా ఉంది-అమ్మలక్కలతో, ఆడపిల్లలతో, పట్టుచీరలతో, శనగల వాయినాలతో. వీళ్ళందరికీ, వాటన్నిటికీ ఎదురుగా చెక్కమెట్లపైన వేసిన తెల్లపరదామీద వరుసగా ఉన్న బొమ్మలు.



పైమెట్టుమీద నటరాజ విగ్రహం. పక్కనే వెంకటేశ్వరుని రూపం. మరో పక్క మీరాబాయి. క్రిందమెట్టుమీద పెద్ద బొజ్జతో శెట్టిగారు-పక్కనే కులుకులొలుకుతూ నిలబడ్డ గొల్లపిల్ల. ఆ పిల్ల నెత్తిన పాలముంత. ఆ తర్వాత మెట్టుమీద మరిన్ని బొమ్మలు-మళ్ళీ మెట్టు, మళ్ళీ బొమ్మలు-మొత్తం ఎనిమిది వరుసలు-

ఏడాదికి ఒక్కసారివచ్చే సంక్రాంతి. భోగినాడు పిల్లలకు తలమీద భోగిపళ్ళు పోసి, ఆ సంబరంలో కలుపుకొంటూ పెట్టుకొన్న బొమ్మలకొలువు. అందంగా కంటికి ఇంపుగా ఉంది

అయితే ఒకటే అర్థంకాలేదు నాకు-సుజి ఇన్నెప్పుడు కొంది ?

నాతో బాటుగ పేరంటానికి వచ్చిన వారూ అదే అనుకొన్నారు కాబోలు-వాళ్లు పైకే అనేసారు—"మొదటి సంవత్సరమే అయినా చాలా బొమ్మలే పెట్టారు మీరు !"

సుజాత గర్వంగా నవ్వింది.

వాణి వచ్చి ఆ మాటే అంది. శమంతకమణి వచ్చి ఆమాటే అంది. సరస్వతీ అదే అంది. వచ్చిన అందరూ ఆఖరికి సుజాత ఇంట్లో పనిమనిషి పార్వతీ అదే అంది-"బాగా ఎట్టేరను అమ్మగారూ !" అని!

పేరంటం అయిపోయింది. చుట్టాలు వెళ్ళిపోయారు. పట్టుచీరలు మడతల్లోకి దూరిపోయాయి-ఇంట్లో అక్కడక్కడ పడ్డ శనగల్నీ, రేగిపళ్ళనూ ఊడుస్తూ అంది సుజాత— "అన్నిపనులూఅయిపోయినట్లే, ఇదొక్కటి తప్ప!"

"ఏమిటీ? బొమ్మల్ని దాచటమా?" అన్నాను నేను.

"ఊఁ—ఎవరి బొమ్మల్ని వాళ్ళింట్లోనే దాచాలి కదా ! రా కొంచెంసాయం చెయ్యి, ఇవి ఇచ్చేసి వద్దాం!" అంది సుజాత.

నవ్వుతున్న బొమ్మలతోబాటు, నవ్వు ఆపుకొంటున్న సుజాతతో బాటు—నేనూ నవ్వాను.

—పాలకోడేటి

# జవాబు

రైల్వే స్టేషన్‌లో ఎంక్వయిరీ అన్న బోర్డు తగిలించి వున్న కౌంటర్ దగ్గరికి వెళ్ళాను మద్రాసువెళ్ళే రైలు నెల్లూరు ఎప్పుడు చేరుతుందో కనుక్కుందామని.

కౌంటర్‌లో ఒకేఒక వ్యక్తి వున్నాడు. నాలా సమాచారం తెలుసుకోడానికి వచ్చిన అనేక మంది కౌంటర్ముందు నిల్చుని అతన్ని ప్రశ్నలు అడుగుతున్నారు.

కౌంటర్‌లో మూడు టెలిఫోన్‌లు వున్నాయి. మాటిమాటికీ ఏదో ఓ ఫోన్ మ్రోగుతూనే వుంది. ఫోన్ మ్రోగినప్పుడల్లా రిసీవర్ అందుకుని వాళ్ళకి జవాబు చెప్తున్నాడు. ఒకోసారి ఏ ఫోన్ మ్రోగుతోందో కూడా తెలియటం లేదు.

అయిదు నిమిషాలు నించున్నాను. కొత్తవాళ్ళు వస్తున్నారు సమాచారం అడగడానికి. నోట్లో కారాకిళ్ళీతో అతను సవ్యసాచిలా టెలిఫోన్ కాల్స్‌కు బదులు చెప్తూ, కౌంటర్ ముందున్న వాళ్ళకి జవాబు చెప్తున్నాడు.

విసుగొచ్చింది నాకే. ఎన్నిసార్లు నేనడిగినా, నా ప్రశ్నకి సమాధానం చెప్పనందుకు. ఎంక్వయిరీ కౌంటర్ ముందు జనం ఎక్కువవుతున్నారు.

నేను 'మద్రాస్‌కి టిక్కెట్స్ అమ్మే కౌంటర్‌లోని క్లర్క్‌ని అడిగితే "ఎంక్వయిరీలో అడగండి" అంటున్నాడు చిరాకుగా.

పబ్లిక్ కాల్ బూత్ దగ్గరకి వెళ్ళి, అర్థ రూపాయితీసి సిద్ధంగా పట్టుకుని ఇందాక నే చూసిన కౌంటర్‌లోని మూడు ఫోన్‌లలో ఒకదానికి ఫోన్ చేశాను. కౌంటర్‌లోని వ్యక్తి రిసీవర్ అందుకోవటం చూశాను మూసివున్న టెలిఫోన్ బూత్ గాజు అద్దంలోంచి.



"రైల్వే ఎంక్వయిరీ" టెలిఫోన్‌లో వినిపించింది. అతను ఫోన్‌లో మాట్లాడటం నాకు స్పష్టంగా కనిపిస్తోంది.

"మద్రాస్ వెళ్ళే రైలు నెల్లూరు ఎప్పుడు వెళ్తుంది" అడిగాను.

చెప్పాడు.

ఫోన్ పెట్టేసాను "థాంక్స్" అని.

కౌంటర్‌లో అతను ఫోన్ పెట్టేయడం కనబడింది.

అతను ప్రాణంవున్న మనుషులకన్నా ప్రాణంలేని టెలిఫోన్‌లకే ఎక్కువ గౌరవం ఇస్తున్నాడనిపించింది.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి

# చిన్నారి జ్ఞానం

కాన్వెంటు నుండి తిరిగి వచ్చిన ఆరేండ్ల సీను ఇంట్లో అడుగు పెడుతూనే "హల్లో! అంకుల్ !'' అన్నాడు.

ఆ మధ్యాహ్నమే వచ్చిన మేనమామ ''ఎంత వాడవయ్యావు? ఇంగ్లీషు మాట్లాడేస్తున్నావట్రా'' అంటూ కుర్చీ మించి చెయ్యి చాచి సీనుని ఆప్యాయంగా దొరకపుచ్చుకున్నాడు.



ముఖం, చేత్తులూ కడుక్కొని, బట్టలు మార్చుకున్న సీను అమ్మ అందించిన వేడివేడి హార్లిక్స్ ఆరగించాక గువ్వలా మేనమామ దగ్గర వచ్చి వాలాడు,

''అయితే చెల్లెమ్మా అల్లుడు రాటు దేరుతున్నడన్నామాట పనికివస్తాడ్లే." అంటూ సీను మేనమామ-సీనుని దగ్గ రికి తీసుకొని ద్వారం దగ్గర నిల్చున్న చెల్లెలు వైపు చూచాడు.

''వాట్ మమ్మీ అల్లుడంటున్నారు అంకుల్. ఏమిటీ?'' అంటూ మేనమామ ఒళ్ళో కూర్చున్న సీను సందేహం వెలి బుచ్చాడు.

''అదేరా మీమామయ్య నీకు సీతనిచ్చి పెళ్ళి చేస్తారట" అంటూ సీను తల్లి అన్నయ్యని చూచి ముసిముసి నవ్వులు నవ్వింది.

మేనమామ ఒడిలో నుండి అనుకో కుండా క్రిందికి దూకిన సీను మమ్మీని మామయ్యని మార్చి మార్చి చూసి, "ఎవర్నీ ఆ చీమిడి ముక్కు సి త్తప్పనా మైగాడ్ అది ఏడుపుగొట్టుది. ఎప్పుడూ ఎత్తుకొని తిప్పాలిదాన్ని. అంతకీ కావలిస్తే సుశీలని పెళ్ళాడతాను. ఎంచక్కా పొడు గాటి జడ వేసుకొని, మమ్మీలా చీరకడు తుంది. నన్నెత్తుకొని తాయిలాలు పెడు తుంది." అని చిన్ని మనస్సు విప్పి చెప్పేడు.

"ఓరి నీ తస్సదియ్య!" అంటూ అబ్బుర పడుతున్న మేన మామ దగ్గర నుండి తల్లి పక్కకి వచ్చి చేరాడు సీను.

తల్లి వాడి తల నిమురుతూ, "చూడు కన్నా! సుశీలేమో నీ కన్న పెద్దది. సుశీల చెల్లెలు సీతే నీకు ఈడు సీత కూడా పెద్దయితే సుశీలానేఉంటుంది". అని గోముగా అంది.

"అలాగే మమ్మీ! ఇప్పుడయితే సుశీలని పెళ్ళి చేసుకుంటాను. సీతని మరి పెద్దయ్యాక" అంటూన్న సీను అమాయకపు చూపుల ముందు అన్నా చెల్లెళ్ల చూపులు సిగ్గుతో వాలిపోయాయి.

—శింగిసెట్టి సంజీవరావు

"ఆరేసుకోబోయి పారేసుకున్నాను..."

"అదేమిటే మళ్ళీ ఏం పారేశావ్ ?"

"ఏరేంలేదు. మీరు మొన్నకొను క్కొచ్చిన కొత్తచీర గోడ వారని ఆరేస్తే ఎవరో చంకన పెట్టుకు పోయారు"

"అయ్యో...అయ్యో ఆ కొత్తచీర కాస్తా పోయిందీ" కొట్లోదానిబాకీ యింకా తీరనేలేదు"

"నేనేం చేయను ? ప్రహరీగోడ కట్టించండీ అంటే విన్నారూ ?"

"సరి సరి, యిదేమిటి యిక్కడ



మందార మొక్కేదీ నిన్నటి వరకు చక్కగా గుమ్మటమల్లె వుండేది ?"

"ఆ నల్లమేకొచ్చి తిని పోయింది. అందుకే ప్రహరీ గోడ పెట్టించండీ అన్నాను. విన్నారూ నా మాట !"

"వాళ్ళెవరూ, అలా లోపలికి తోసు కొచ్చేస్తున్నారు ?"

"యింకెవరు ? చందాల కోసమో, దాన ధర్మాల కోసమో వస్తుంటారు ప్రహరీగోడ పెట్టించండీ అంటే వినరు గదా..."

* * *

# అదేనయం

"ఏమేవ్, వేగిరం సామాను సర్దెయ్"

"ఎందుకు ?"

"ఎందుకేమిటి, యిల్లు చూశాను. రెండు గదులు. మన రామారావులేడూ ? వాళ్ళ కాంపౌండులోనే రెండు గదులు ఖాళీ అయితే మాట్లాడొచ్చాను."

"అదేమిటండీ సొంతయిల్లు పెట్టు కొని..."

"ఈ యిల్లు అద్దెకిద్దాంలే-పద పద-సామాను సర్దు"

"అదేం కర్మండీ, సొంత యిల్లు పెట్టుకొని అద్దె కొంపలకి పోవడం..."

"నీకు తెలియదులే ఆయింటి వాళ్ళు చండశాసనులు. ఇంటాయనెప్పుడూ ముద్దుకర్ర పట్టుకొని వాకిట్లోనే కూర్చుం టాడు. ఆఖరికి కూరలమ్మే వాళ్ళని కూడా ఆ ఇంటి చాయలకు రానియ్యడు. ఇంటావిడెప్పుడూ వాళ్ళింట్లో కూర్చోదు. ఆవిడెప్పుడూ అద్దెకున్న వాళ్ళ యిళ్ళ ముందే కూర్చుంటుంది. ఆ దంపతులి ద్దరూ దోమను బయటకు పోనియ్యరు-ఈగను లోపలికి రానియ్యరు. యిహ యింటి కాపలా గొడవ మనకుండదు. పద పద సామాను సర్దు."

– ఎస్. ఆర్. రావు

# రచయితలకు ఆహ్వానం

జాతి జీవిత సమగ్ర చిత్రాన్ని విభిన్న కోణాల నుండి దర్శించి, పాఠకులకు దర్శనీయం చేయగల ఉత్తమ నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది.

* నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలుండాలి. అచ్చులో 'చతుర'లో ఒక పేజీకి సుమారుగా 240 పదాలు వస్తాయి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* నవలలు తెలుగుదేశపు వాతావరణంతో, తెలుగువారి సమకాలీన జీవిత చిత్రణగా ఉండటం అవసరం.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయితనుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నికకాని నవలలను త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచననుబట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుదినిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ
హైదరాబాద్–500004

Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications. Printed at Colorama Offset Printers, Hyderabad. Office Address : CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004

